శ్రీః

శ్రీ చెఱువు సత్యనారాయణశాస్త్రిణా విరచితా

# లింగోద్భవవృత్తమాలికాస్తుతిః

వ్యాఖ్యాత - డా॥ తాడేపల్లి పతంజలి




## స్వయంసిద్ధ కాళీపీఠము

4వ లైను, రవీంద్రనగర్, గుంటూరు - 522006

ఫోన్ : 9440018861

శ్రీః

శ్రీ శివాయ గురవే నమః

**శ్రీ చెలువు సత్యన్నారాయణశాస్త్రిణావిరచితా**

# లింగోద్భవవృత్తమాలికాస్తుతిః

**వ్యాఖ్యాత - డా॥ తాడేపల్లి పతంజలి**

*ముద్రణ : దుర్ముఖనామసంవత్సర, మహాశివరాత్రి*

*ప్రతులు : 500*

*పేజీలు : 132*

*వెల రూ. : 60-00*



**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
**Andhra Pradesh.**
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**



*His Holiness, Courtallam Sankaracharya, Jagadguru*
**SRI SIDDHESWARANANDA BHARATI SWAMY**
*Peetadhipati - Siddheswari Peetam*

**Office :**
**Mounaswamy Mutt**
**Courtallam-627 802.**
Thirunelveli Dist., (T.N.)
TAMILANADU
Ph : 04633 - 283707

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు
**శ్రీసిద్ధేశ్వరానంద భారతీస్వామి**
సిద్ధేశ్వరీ పీఠాధిపతి - కుర్తాళం

**Camp Office :**
Swayam Siddha Kaali Peetam
4th Line, Ravindra Nagar
Guntur - 522 006. (A.P.)
Ph : 9440208103

## ఆశీర్వాదశ్రీముఖము

శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రిగారు యాభై సంవత్సరాల క్రింద నాతో ఆత్మీయతతో ఉండేవారు. ఆరోజుల్లో గుంటూరు పి.జి. సెంటరులో తెలుగు ప్రొఫెసరుగా ఉన్న డా॥ యస్వీ జోగారావుగారితో జరిగే సాహిత్యగోష్ఠులలో తరచుగా వీరు పాల్గొంటుండేవారు. అప్పుడు శాస్త్రిగారి పాండిత్యాన్ని, కవితాశక్తిని దగ్గరగా గమనించే వాణ్ణి. మహోపాసకులుగా ప్రసిద్ధి చెందిన బ్రాహ్మణ్యులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారిని గురించి విశేషాలను వారు చెపుతూ ఉండేవారు. బ్రహ్మాండపురాణంలోని లలితాదేవి చరిత్రలోని కొన్ని విశేషాలను, వివాహంలో చెప్పే "మాంగల్యం తంతునానేన" అనే శ్లోకంలోని పాఠాంతరాన్ని తాడేపల్లివారు ఏవిధంగా భావించారో శాస్త్రిగారు చెప్పగా విన్నాను.

ఇక ఈ గ్రంథాన్ని చదివిన తరువాత చెరువువారి కవితాప్రజ్ఞ, వారికి గీర్వాణ భాషమీద ఉన్న అధికారము చాలా సంతోషాన్ని, సంతృప్తిని కలిగించినవి. డా॥ తాడేపల్లి పతంజలిగారు రచించిన వ్యాఖ్యానాన్ని పరిశీలించిన మీదట ఇంతకంటే ఎవరైనా ఏమి విశేషాలు చెప్పగలరు? అనిపించింది. ప్రతిభా సముల్లసితమైన సత్యనారాయణశాస్త్రి గారి రచనను, వైదగ్ధ్య సమున్నతమైన పతంజలిగారి విశ్లేషణ విన్యాసాన్ని చూచి ఇది అపూర్వమైన సమ్మేళనమని భావిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని సాంస్కృతిక హృదయులు, సాహిత్య ప్రియంభావుకులు అయిన శ్రీ రావి మోహనరావుగారు ముద్రించటం బంగారానికి తావి అబ్బినటులున్నది. ఎన్నో ధార్మిక కార్యాలు చేస్తూ దైవసేవ, కవితాసేవ, ప్రజాసేవ కావిస్తున్న మోహనరావుగారు మిక్కిలి ప్రశంసార్హులు.

వీరందరికి పరమేశ్వరి కరుణా కటాక్షములు, కృతినాయకుడైన **లింగోద్భవ మహాదేవుని** అనుగ్రహకాంతిలహరులు లభించునుగాక!

దుర్ముఖి సంక్రాంతి
ది. 14-01-2017

**నారాయణ స్మరణతో**
**సిద్ధేశ్వరానంద భారతీస్వామి**

# అభినందన

డా॥ సూరం శ్రీనివాసులు

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందని తెలుగు సామెత. కొన్ని పూలు మొగ్గలుగా వున్నప్పుడే పరిమళించినా పువ్వులతోనే లెక్క ప్రారంభించా రెందుకోమరి. కళల విషయమూ అంతే. అవి పొటమరించటానికి వయస్సుతో సంబంధం లేదు. కళలకు మూలం ప్రతిభ. ప్రతిభకు వయస్సు ఉండవచ్చు గానీ ప్రతిభావంతులకు వయస్సుతో పనిలేదు. అసలు సామాజికంగా కనిపించే ఎన్నో అద్భుతాంశాలు ఆయా వ్యక్తులు తమ లేత వయస్సులో ప్రకటించినవే. కవిత్వం కూడా కళలలో ఒకటి. అంతే కాదు లలితకళలలోనూ ఒకటి. విశిష్టమైనది కూడా.

కవులకూ, కవితా ప్రాదుర్భావానికి సంబంధించి ఎన్నో కథలూ – గాథలూ కనిపిస్తాయి. వాల్మీకి తొలుత క్రూరుడట. కాళిదాసు తొలుత వెర్రివాడట. భారవి చిన్నప్పుడే మేధావి కానీ తండ్రిని కడతేర్చాలన్న ఆవేశానికి లోనయి ఆయన శిక్ష మేర అత్తగారింటికి వెళ్ళి, అక్కడ ఒక శ్లోకంతో ఒక దారుణాన్ని ఆపగలిగాడట. మయూరుడు సూర్యశతకంతో కుష్ఠవ్యాధినుండి బయట పడ్డాడట. ఇక భవభూతి తానెంతగా లోక నిరాదరణకు గురయ్యాడో తన మాటల వల్లనే తెలుస్తుంది. కొందరు సహజపండితులు. కొందరు అసహజపండితులు.

అభిమన్యుడు తల్లిగర్భంలో వున్నప్పుడే పద్మవ్యూహం ప్రవేశం నేర్చుకొన్నాడట. ప్రహ్లాదుడు తల్లి గర్భంలోనే విష్ణుకథలు విన్నాడట. పార్వతి పుట్టుకతోనే ప్రాక్తన జన్మ విద్యలన్నీ గ్రహించిందట.

సంస్కృతభాషలో 'మహిషశతకమ్' అన్న పేరుతో ఒక విలక్షణ శతకముంది. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు మేళవింపు దానిలో కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. దాని రచయిత వాంఛేశ్వరుడు. కుట్టికవి అని ఆయన బిరుదు. తమిళంలో కుట్టి అంటే 'పిల్ల' (బాల) అని అర్థం. ఆ పేరు వెనుక ఒక కథ వుంది.

తంజావూరునేలిన రాజులలో శహాజీ (క్రీ.శ. 1684–1710) ఒకరు. ఆయన గొప్ప కవీ, పండితుడూ, కవి పండితపోషకుడూ. కుట్టికవి తండ్రి ఆయన ఆశ్రితుడు, ఆమాత్యస్థానంలోనివాడు. శహాజీ రాజు మధురను దర్శించి అక్కడ మీనాక్షి సన్నిధిలో ఆమె ఎదురుగా నిలిచి ఆమెను ఇలా స్తుతించాడట.

శ్లో॥ పురి మధురం గిరి మధురం గరిమధురంధరనితంబభారాఢ్యమ్ ।
స్థూలకుచం నీలకచం బాలకచంద్రాంకితం తేజః"

ఆ శ్లోకం విన్న వెంటనే – తండ్రితోపాటు అక్కడే వున్న కుట్టికవి –

శ్లో॥ హృదితరసా విదితరసా తదితరసాహిత్యవాఙ్న్ మే లగతి ।
కవిలోకే న విలోకే భువి లోకేశస్య శాహజేరుపమానమ్ ॥

అంటూ రాజును ప్రస్తుతించాడట ఆయన కవితా మాధుర్యానికి అబ్బురపడి. శహాజీ రచనా విన్యాసానికి తీసిపోకుండా అలాగే అనుసరిస్తూ కుట్టికవి చేసిన నిర్మాణం ఆశ్చర్యకరం. పువ్వు పుట్టగానే.... అంటే ఇదే.

భారతదేశంలో భక్తిభావం భగవంతునిలాగే సర్వతోవ్యాప్తం. సర్వకళలనూ, సర్వవిద్యలనూ అది లోబరచుకొన్నది. విద్యలూ, కళలే కాదు. వ్యాపారాలు కూడా భక్తి పేరుతో బలంగా సాగుతాయి. 'భక్తి'ని కేంద్రస్థానంలో నిలిపి చేస్తున్న వ్యాపారాలేవీ నష్టపోవడం లేదు.

ఆచరణం అందుబాటులోనికి లేకపోయినా భావం / భావన సులభం, విశ్వజనీనం కావటం భక్తికి కళలలో ప్రధానస్థానాన్ని కల్పించిందది. కవిత్వమైనా, చిత్రలేఖనమైనా, శిల్పనిర్మాణమైనా, నాట్యమైనా, సంగీతమయినా భక్తిభావన లేకపోతే వ్యాపించవు, రాణించవు ఎన్నడో క్వాచిత్కంగా తప్ప. అది భక్తి గొప్పతనం. భగవంతుని గొప్పతనమని కూడా అందామా?

'సా త్వస్మిన్ అనన్య ప్రేమరూపా' అని నారదభక్తిసూత్రం భక్తిని నిర్వచించింది. 'అస్మిన్' అంటే దీనియందు / వీనియందు. అక్కడ 'ఇదమ్' శబ్దవాచ్యుడు పరమాత్మ. పరమాత్మ మౌలికంగా బహుత్వాన్ని స్వీకరించిన తరువాత, మనిషికి సర్వత్ర పరమాత్మను దర్శించటం చేతనయిన తర్వాత ఆ బహుత్వం విస్తరించింది. దైవభావన వ్యాపక మయింది. జాతి మత ప్రాంత వయో భేదాలు లేకుండా భక్తి విశ్వతోముఖమయింది. దానికి ఆలంబనాలు కూడా పెరిగాయి.

సృష్టి–స్థితి–లయకారులుగా బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులను భావించి, వారి నారాధించటం మనకు నిత్యకృత్యం. వారిలోనూ మహేశ్వరుడు సులభసాధ్యుడుగా, బోళాదేవుడుగా మన మనస్సులలో ముద్రవేసికొన్నాడు. కాకపోతే పాలసముద్రాన్ని చిలికినపుడు అందరూ అన్నీ పట్టుకుపోతే తాను మాత్రం విషం మ్రింగి ఊరుకుంటాడా? నమకంతో నమస్కరిస్తూనే చమకంతో కోరికల పట్టీలు విప్పుతుంటే రెండింటినీ సమంగానే భావించి మనలను అనుగ్రహిస్తాడా? అద్వయభావానికి తానే ఆదియై నిలుస్తాడా?

సాహిత్యంలో కూడా తమ తమ ఇష్టదైవస్వరూపాలను మనస్సులో నిలుపుకొని భక్తిభావాన్ని ప్రదర్శించటం కనిపిస్తుంది. వాటిలో దేనికదే సాటి అన్నంతగా అవి కవి పండితభావుకభక్తుల మనస్సులను ఆకట్టుకొంటున్నాయి.

ఆ శైశవం – ఆ భక్తి – ఆ శైవం ముప్పేటగా వున్న స్తుతిరూపకావ్యం **లింగోద్భవవృత్తమాలికాస్తుతి.** రచయిత డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రిగారు దాని వ్యాఖ్యాత డా॥ తాడేపల్లి పతంజలిగారు ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు జిల్లాలోని చందోలులో లింగోద్భవస్వామి దేవాలయమున్నది. తత్‌స్తుతిరూపంగా సాగింది **లింగోద్భవవృత్తమాలికాస్తుతి.** ఒక సర్గనో, ఒక అధ్యాయాన్నో, ఒక స్తుతికృతినో ఒకే వృత్తంతో రచించటం – ముగింపులో ఛందస్సును మార్చటం సంస్కృత కవుల కలవాటు. ఇది ఎక్కడా విధించిన నియమం కాదు. కానీ పాటిస్తున్న ఆచారం. దీనికి భిన్నంగా కూడా రచనలు లేకపోలేదు. కానీ ప్రస్తుతం **లింగోద్భవవృత్తమాలికాస్తుతి** వృత్తమాలికా రూపం. ఆ అంశాన్ని పేరులోనే ప్రకటించాడు రచయిత.

వృత్తమాలికా తత్త్వాన్ని కొంచెం చూద్దాం. ఈ కృతిలో మొత్తం 52 శ్లోకాలున్నాయి. వాడిన ఛందస్సులు 26. వాటిలో 24 గణచ్ఛందస్సులు. 2. మాత్రాఛందస్సులు. గణచ్ఛందస్సుల పంపకం సమానంగా జరగలేదు. ఈ పట్టికను గమనించండి.

| | ఛందస్సు పేరు | శ్లోక సంఖ్య | మొత్తం శ్లోకాలు |
|---|---|---|---|
| 1. | అనుష్టుప్ | 1, 2, 5, 52 | 4 |
| 2. | ఆర్యా | 25, 43, 46 | 3 |
| 3. | ఆర్యాగీతి | 26, 49 | 2 |
| 4. | ఇంద్రవంశం | 41 | 1 |
| 5. | ఉపజాతి (ఇంద్రవజ్ర+ఉపేంద్రవజ్ర) | 3, 4, 9, 10, 11, 12 | 6 |
| 6. | కమలవిలసితం | 27 | 1 |
| 7. | చంపకమాల | 36 | 1 |
| 8. | జలోద్ధతగతి | 31 | 1 |
| 9. | దోధకం | 14 | 1 |
| 10. | ద్రుతవిలంబితం | 24 | 1 |
| 11. | పంచచామరం | 39, 40, 44, 47 | 4 |
| 12. | ప్రమద | 34 | 1 |
| 13. | ప్రమితాక్షర | 33 | 1 |
| 14. | మందాక్రాంత | 23 | 1 |
| 15. | మాలిని | 28, 50, 51 | 3 |
| 16. | మేఘవిస్ఫూర్జితం | 38 | 1 |

| | | | |
|---|---|---|---|
| 17. | రథోద్ధతం | 15, 16, 42, 45 | 4 |
| 18. | లలితం | 35 | 1 |
| 19. | వంశస్థం | 13 | 1 |
| 20. | వసంతతిలకం | 21, 22, 48 | 3 |
| 21. | వియోగిని | 19, 20 | 2 |
| 22. | శాలిని | 32 | 1 |
| 23. | శార్దూలం | 6, 7, 8 | 3 |
| 24. | శ్రీ | 37 | 1 |
| 25. | స్రగ్విణి | 29, 30 | 2 |
| 26. | స్వాగతం | 17, 18 | 2 |

సంస్కృతకావ్యాలలో ఎక్కువగా కనిపించే ఉపజాతి చెఱువువారి కృతులు కూడా ప్రధాన స్థానాన్నే ఆక్రమించింది.

కృతిలో మొదటి అయిదు శ్లోకాలలో నిర్విఘ్న గ్రంథపరిసమాప్తికై దైవ గురు వందనంతో పాటు నాలుగవ శ్లోకంలో తననుగురించి తాను ప్రస్తావించారు కవి.

శ్లో॥ మాత్రావియుక్తశ్చతురబ్దమాత్రే
మాతామహాభ్యామవియుక్తసేవీ ।
గర్భాష్టమే ప్రాక్తన కర్మబంధా -
దుద్బుద్ధబుద్ధిః కవయామ్యహం త్వా ॥

ఈ శ్లోకంలోని ద్వితీయార్థం కవి బాలుడైనా కవితలోని ప్రౌఢిమను ప్రదర్శిస్తుంది. 'గర్భాష్టమే' అన్న పదం సాధారణంగా వాడేది కాదు, సాంప్రదాయికంగా ఆ పదాన్ని వింటుంటే తప్ప. శాస్త్రిగారు అప్పటికే ఉపనీతులయివుంటారు. గర్భాది సంఖ్యా పరిగణనం ఆ సమయంలో విని వుంటారు. అలా దానిని పట్టగలిగారు. ప్రాక్తన కర్మబంధం కూడా అటువంటిదే. 'జయమానోమనుష్యః త్రిభిః ఋణావా జాయాత్' అన్న మర్యాదను బట్టి మనిషి 'దేవ ఋణంతో పాటే పుడతాడు. దానిని స్ఫురింపజేస్తూ దేవఋణవిముక్తికై కవిత అన్న భావం ధ్వనిస్తుంది. ఇక నాలుగవపాదం కారక ప్రయోగంలోని జాగరూకతను సూచిస్తుంది. కవయామి పదం **కవృవర్ణనే** ధాతు సంబంధి, ఆ ధాతువు సకర్మకం. కాబట్టి ధాత్వర్థం కర్మనపేక్షిస్తుంది. అందుకే యుష్మచ్ఛబ్దం ద్వితీయాంతంగా (త్వా) వాడబడింది.

లింగోద్భవస్తుతిలో సంబోధనాంత శ్లోకాలు, ద్వితీయా చతుర్థ్యంత శ్లోకాలూ ఎక్కువ కనిపిస్తాయి. ఆ పదాలను వినియోగించటంలో నమక ప్రభావం రచయితపై

కనిపిస్తుంది. శాస్త్రిగారు అప్పటికే దానిని పదేపదే విని వుండవచ్చు. అయినా చమక స్ఫురణ మాత్రం కలుగదు.

26 రకాల ఛందస్సులను వాడటమంటే ఛందోలక్షణాలు తెలియటమే కాదు, ఆ ఛందస్సులో వ్రాయటానికి తగినంత భాషాపరిజ్ఞానం కూడా కావాలి. ఏ భావాన్ని ఏ ఛందస్సులో సరిపెట్టడం సులభమో అవగాహన కూడా కావాలి. వీటినన్నింటినీ సాధించి పట్టుగా శాస్త్రిగారు కృతిని పూర్తిచేశారు. వాస్తవానికి దీనిని గర్భాష్టమ వయస్కుడైన బాలుడు వ్రాశాడంటే నమ్మటం కష్టం. శ్లోకాలలో అక్కడక్కడ అన్వయ కాఠిన్యం కనిపిస్తున్నా తదితరమంతా నిర్దుష్టమూ, నిరాడంబరమూ కూడా!

శ్లో॥ కైలాసనామాద్రిరోఽస్తి కశ్చి –
న్మహర్షిభిర్దేవగణైశ్చ సేవ్యః ।
తస్మింస్తు బిల్వద్రుమవేదికాయాం
సాహ్యస్థితాయ ప్రియయా నమస్తే ॥

ఇటువంటి కథాకథనశైలిపై కూడా కవి చేయి తిరిగినతనం కనిపిస్తుంది. సంబోధన పదాలతో స్తోత్రరచన కుదిరినంత తేలికగా ఇటువంటి కథాకథనం కుదరదు మరి.

ఇక ఈ గ్రంథవ్యాఖ్యానాన్ని గురించి... డా॥ తాడేపల్లి పతంజలిగారు లింగోద్భవ వృత్తమాలికాస్తుతి వ్యాఖ్యాత.

వ్యాఖ్యాన ప్రణాళిక చాలా విస్తృతం. ప్రతిపదార్థతాత్పర్యాలను వ్రాయటంతో పాటు ప్రతిపదార్థవిశేషాలనూ, శ్లోకవిశేషాలనూ చాలా విశ్లేషణాత్మకంగా వివరించటం ఇక్కడ చూడవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ వ్యాఖ్య శ్లోకగత పదనిఘంటువుగా కనిపిస్తుంది. నిఘంటుపదం కూడా విస్తృతార్థంలోనే వాడుతున్నా, తనకు తెలిసిన విషయమంతా పాఠకునికి కూడా తెలియజేయాలన్న తపన వ్యాఖ్యాతలో కనిపిస్తుంది. ప్రతిపదార్థరచనలో వ్యాఖ్యాత కొంత స్వేచ్ఛను తీసికొన్నారు.

మొత్తంమీద ఇది ఒక చక్కని కృషి. పాఠకుడికి వివిధవిషయవిజ్ఞానదాయకం. వ్యాఖ్యాతనూ, ప్రచురణకర్తను మనసారా అభినందిస్తున్నాను.






# లింగోద్భవ వృత్తమాలికాస్తుతిః

**శ్లో॥ సరస్వతీ బ్రహ్మముఖే - పద్మా చ హరివక్షసి ।**
**శివా శివశరీరార్ధే - త్రిమూర్తీనాం త్రిశక్తయః ॥** 1

శ్రీ లింగోద్భవస్వామి దేవాలయం గుంటూరు జిల్లా చందోలులో ఉంది. ఇక్కడే శివుడు లింగోద్భవరూపంలో ఉద్భవించాడని చెబుతారు. ఆ దేవాలయంలో 11అడుగుల ఎత్తు, నాలుగున్నర అడుగుల వెడల్పుగా ఉన్న మహాశివలింగాన్ని ఒక ఎనిమిదేళ్ల బాలుడు దర్శించాడు.

“ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః” - అన్నాడు కదా కాళిదాసు. పూర్వజన్మలో తాను నేర్చుకొన్న విశిష్టవిద్యలు అదృష్టవంతులలో ప్రవేశిస్తాయి. లింగోద్భవస్వామిపై స్తుతి రాయాలని - అందులోనూ - సంస్కృతంలో - రాయాలని ఆ బాలకవికి తోచింది. తాతగారు చందవోలుమహర్షిగా ప్రసిద్ధికెక్కిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి ఆశీస్సులు లభించాయి. ఇంకేముంది! భవిష్యత్తులో “అవధాన విద్యా వాచస్పతి”గా పేరు పొందనున్న ఆ బాలకవి - చెఱువు సత్యనారాయణ శాస్త్రి గళం కదిలింది. చదువులమ్మ ఆ బాలకవిని చూసి ముసి ముసిగా నవ్వింది.

**“సరస్వతీ బ్రహ్మముఖే - పద్మా చ హరివక్షసి ।**
**శివా శివశరీరార్ధే - త్రిమూర్తీనాం త్రిశక్తయః ॥”**

ఇలా మొదటి అనుష్టుప్ బయటికి వచ్చింది. శ్లోకానికి నాలుగు పాదాలుండి, ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలుంటే దానిని అనుష్టుప్ ఛందస్సంటారు. ఈ శ్లోకంలో ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి.

ఈ శ్లోకం అన్వయం ఇది.

బ్రహ్మముఖే సరస్వతీ, హరివక్షసి పద్మా చ, శివ శరీరార్ధే శివా, త్రిమూర్తీనాం త్రిశక్తయః

**తాత్పర్యం :** బ్రహ్మ ముఖంలో సరస్వతి, హరివక్షస్థలంలో లక్ష్మి, శివుని సగం శరీరంలో పార్వతి ఉన్నారు. ఆ త్రిమూర్తుల యొక్క మూడు శక్తులు (తరువాత శ్లోకంతో అన్వయం).

ప్రతిపదార్థ విశేషాలు :

**బ్రహ్మ :** బృంహతి వర్ధయతి ప్రజా ఇతి బ్రహ్మ = ప్రజలను వృద్ధి పొందించే వాడు బ్రహ్మ.

**ముఖే :** ముఖమునందు – ముఖ శబ్దమునకు ఇక్కడ నోరు అని అర్థం – ఖన్యతే భక్ష్యమనేనేతి ముఖం – దేనిచేత భక్ష్యం పీడించబడుతుందో అది ముఖం.

**సరస్వతీ :** సరః ప్రసరణం సర్వత్ర అస్తీతి సరస్వతీ – అంతటా వ్యాప్తి కలిగినదానిని సరస్వతీదేవి అంటారు.

**హరిః :** హరతీతి హరిః. హరించువాడు హరి. పాపాలను హరించేవాడని భావం. ("హరియను రెండక్షరములు హరి యించును పాతకంబు..." అన్నాడు కదా పోతన్న.)

**వక్షసి :** వక్షస్థలమునందు– వక్షస్సు అంటే ఱొమ్ము. సురతాదులలో కొట్టబడేది కాబట్టి ఱొమ్మును వక్షస్సు అన్నారట. వక్ష సంఘాతే–

**పద్మా :** పద్మము చేతియందు ఉండేది కనుక లక్ష్మీదేవికి పద్మా అని పేరు. విష్ణువు యొక్క ఱొమ్ముపై లక్ష్మి ఉంది. భార్యని గుండెల్లో పెట్టుకోవాలి నాయనా.. అది చెప్పటానికే విష్ణువు తన ఱొమ్ములో లక్ష్మిని ధరించాడని పెద్దలు చెబుతారు.

**శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు శివుడు. బ్రహ్మానందస్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు.

**శరీర + అర్ధే :** శరీరము యొక్క సగభాగములో

శరీరములు రకరకాలు

**త్రివిధ–శరీరములు :** 1. స్థూలశరీరము, 2. సూక్ష్మశరీరము, 3. కారణశరీరము.

**షడ్విధ–శరీరములు :** 1. ఊష్మజములు (వేడివలన జన్మించునవి – క్రిములు, దోమలు

మొ॥వి), 2. అండజములు (గుడ్లవలన జన్మించునవి – పక్షులు, పాములు మొ॥వి), 3. జరాయుజములు (గర్భవేష్టనము నుండి పుట్టును), 4. ఉద్భిజ్జములు (భూమిని భేదించుకుని జనించునవి), 5. సాంకల్పికములు (సృష్ట్యాదిలో ప్రజాపతి సంకల్పమున ఉత్పన్నములగు ఋషుల శరీరములు), 6. సాంసిద్ధికములు (యోగసంసిద్ధిచే నేర్పరచుకొనబడు శరీరములు–సాంఖ్యులు).

**సప్త–దేహములు :** 1. స్థూలదేహము, 2. సూక్ష్మదేహము, 3. ప్రాణదేహము, 4. వాసనాదేహము, 5. మానసదేహము, 6. బుద్ధిదేహము, 7. ఆత్మదేహము.

**అష్టవిధ–శరీరములు / అష్ట–దేహములు :** 1. స్థూలము, 2. సూక్ష్మము, 3. కారణదేహము, 4. మహాకారణదేహము, 5. విరాట్టు, 6. హిరణ్యము, 7. వ్యాకృతము, **8. మూలప్రకృతి**

ఇవే కాక నాదము శివుని శరీరం. పంచభూతములును, సూర్యచంద్రులును, యాగముచేయు యజమానుడు శివుని అష్టమూర్తులు. ఇంతకీ శివుని శరీరము వీనిలో ఏది? వీనిలో శివుని శరీరము కానిది లేదని జవాబు. ఏదో ఒకటి ఉండాలి కాని ఇన్ని శరీరాలుంటాయా? పరిమితులున్న మానవ బుద్ధి పరిమితిలేని శివుని శరీరాన్ని ఇదా, అదా అని ఊహించటానికి మొదలుపెట్టినప్పుడు సందేహాలు చప్పుడు చేస్తూనే ఉంటాయి. కనిపించేది , కనిపించనిదంతా శివ శరీరమని భావించినప్పుడు అజ్ఞానం సెలవు తీసుకొంటుంది. అర్ధము,అర్థము రెండూ వేరు వేరు. అర్ధము అంటే సగం.

**శివా :** శివస్య పత్నీ శివా– శివుని భార్య శివా. ఆయన శివ. ఈమె శివా. "త్రిమూర్తీనాం త్రిశక్తయః" ముగ్గురు మూర్తుల యొక్క మూడు శక్తులు.

శ్లోకంలోని చివరి పాదంలో కవి ప్రతిభ ఉంది. ఇప్పటిదాకా బ్రహ్మ నోటిలో సరస్వతి, విష్ణువు రొమ్ములో లక్ష్మి, శివుని అర్ధ శరీరంలో పార్వతి ఉన్నారని మూడు పాదాలలో చెప్పారు. ఇందులో గొప్పేముంది? అనాదిగా అనేకమంది కవులు చెబుతున్న విషయమే. కాని సరస్వతి, లక్ష్మి, పార్వతి – ఈ ముగ్గురిని మూడు శక్తులుగా భావించటంలో తన ప్రత్యేకతను కవి చాటాడు. 1. జ్ఞానశక్తి, 2. క్రియాశక్తి, 3. ఇచ్ఛాశక్తి (ద్రవ్యశక్తి).

1. సంజ్ఞానము (చేతన భావం) 2. విజ్ఞానము (కళావివేక జ్ఞానం), 3. ప్రజ్ఞానము(తెలివి). వీటిని ప్రసాదించే తల్లి సరస్వతి. అందుకే ఆమె జ్ఞానశక్తి.

"క్రియా హి వికల్ప్యతే న వస్తు" ధనమనే వస్తువును గురించిన క్రియ అనేక రకములుగ ఉండవచ్చు. ఆ ధనము అనే వస్తువు మాత్రము వికల్పము పొందదు. నడిచి వెళ్ళినా, కారుపై వెళ్ళినా, బండిపై వెళ్లినా, తుదకు వెళ్ళక పోయినా గమ్యస్థానము మాత్రము మారదు. గమనము మారుతుంటుంది. ఆ ధనము కొరకు చేసే క్రియకు కావలసిన శక్తి నిచ్చి, గమ్యస్థానము దగ్గరకు చేర్చే క్రియా శక్తి లక్ష్మి.

ఇచ్ఛలు మూడు రకాలు

1. స్వేచ్ఛ : ఉద్దేశపూర్వకంగా ఒక పని చేయాలనుకోవటం, అందువల్ల కలిగే ఫలితాలను అనుభవించడం.

2. పరేచ్ఛ : తనకేమీ సంకల్పం లేదు కాని ఎవరో చెప్పినందువల్ల చేయడం.

3. దైవేచ్ఛ : విధివశాత్తు తన వల్ల జరగడం అనిచ్ఛ లేదా దైవేచ్ఛ.

పార్వతీదేవి ఇచ్ఛాశక్తి. ఆమె అనుగ్రహం పొందితే మూడు రకాల ఇచ్ఛలు సక్రమ పథంలో జరుగుతాయి.

సరస్వతి, లక్ష్మి, పార్వతి ఈ ముగ్గురి యొక్క జ్ఞాన, క్రియా, ఇచ్ఛాశక్తులు తనకు ఏమిచేయాలని కోరుకొంటున్నాడో కవి రాబోయే రెండో శ్లోకంలో చెప్పబోతున్నాడు.



**శ్లో॥ త్రిషు స్థానేషు వర్తన్తే - తేభ్యస్తాభ్యో నమో నమః ।**
**తే తాస్సదాఽపి విద్యాయుః - కీర్తిపూర్తైః అవతు మామ్ ॥ 2**

ఒకే క్రియతో ముగిసే పద్యముల / శ్లోకముల సమూహాన్ని కులకము అంటారు. చెఱువువారి శ్రీ లింగోద్భవ వృత్తమాలికా స్తుతి లోని మొదటి శ్లోకం - ఈ రెండవ శ్లోకంలోని "అవతు" అను (క్రియతో) ముగుస్తోంది కనుక ఈ రెండు శ్లోకాలను కలిపి కులకము అంటారు.

**తాత్పర్యం :** బ్రహ్మముఖంలో సరస్వతి, హరివక్షఃస్థలంలో లక్ష్మి, శివుని సగం శరీరంలో పార్వతి ఉన్నారు. మూడు స్థానాల్లో ఉన్న ఆ త్రిమూర్తులయొక్క మూడు శక్తులకు సరస్వతి, లక్ష్మి, పార్వతులకు నమస్సులు. త్రిమూర్తులకు నమస్సులు.

ఆ త్రిమూర్తుల శక్తులు / త్రిమూర్తులు ఎప్పుడూ విద్య, ఆయుస్సు, కీర్తులను ఇచ్చి నన్ను కాపాడు గాక !

**ప్రతిపదార్థవిశేషాలు :**

**త్రిషు స్థానేషు వర్తన్తే :** మూడు స్థానములలోనూ ఉన్నారు. "తిష్ఠంత్యస్మిన్, స్థితిశ్చ స్థానం" దేనియందు ఉంటారో, అది స్థానం. ష్ఠా గతి నివృత్తౌ. బ్రహ్మదేవుని ముఖాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. వేదాలంటే వాక్కులు కాబట్టి బ్రహ్మ ముఖంలో సరస్వతి ఉంటుందని పెద్దలు చెప్పారు.

తేభ్యస్తాభ్యో నమో నమః – తేభ్యః, తాభ్యః నమః నమః

శాస్త్రిగారు త్రిమూర్తుల కొరకు తేభ్యః, వారి శక్తుల (భార్యల) కొరకు తాభ్యః అని విడివిడిగా ప్రయోగించారు. అందుకే ఇద్దరికి చెరో నమః – త్రిమూర్తులకి ఒక నమస్కారము. త్రిమూర్తుల శక్తులకి ఒక నమస్కారము.

తే తాస్సదాఽపి – తే తాః సదా, అపి

త్రిమూర్తులు (తే) త్రిమూర్తుల భార్యలు (తాః) ఎప్పుడూ కూడా

విద్యాయుః కీర్తిపూర్తైః అవతు మామ్
మామ్, విద్యా, ఆయుః, కీర్తిపూర్తైః అవతు

విద్య, ఆయుస్సు, కీర్తులను ఇచ్చి నన్ను కాపాడు గాక !

విద్య అంటే1. చదువు; 2. జ్ఞానము. ఇది ప్రధానంగా నాలుగు రకాలు

ఆన్వీక్షకి (ఇందు విజ్ఞానము తెలుపబడును), త్రయి (ఇందు ధర్మాధర్మములు తెలుపబడును), వార్త (ఇందు అర్థానర్థములు తెలుపబడును), దండనీతి (ఇందు నయానయములు తెలుపబడును). ఇంకా షడ్విద్యలు. చతుర్దశ విద్యలు. అష్టాదశవిద్యలు. ఉన్నాయి. అవి వేరే సంగతి. ఈ విద్యలు జ్ఞానశక్తి అయిన సరస్వతి బ్రహ్మ దేవునితో కలిసి ఇవ్వాలని కవి ప్రార్థన. క్రియాశక్తి అయిన లక్ష్మీదేవి, విష్ణువుతో కలిసి నిండు నూరేళ్ల జీవిత గమ్యస్థానానికి తనను చేర్చాలి. ఆయుష్యము ఇవ్వాలి. ఇచ్ఛాశక్తి అయిన పార్వతి శివునితో కలిసి నిండయిన కీర్తులను ఇవ్వాలి.

కీర్త్యత ఇతి కీర్తిః – కీర్తింపబడేది కీర్తి. ఏడు రకాల కీర్తులు ఉన్నాయట. 1. దానకీర్తి, 2. పుణ్యకీర్తి, 3. కావ్యకీర్తి, 4. వక్తృత్వకీర్తి, 5. వర్తనకీర్తి, 6. శౌర్యకీర్తి,

7. విద్వజ్జనకీర్తి. ఈ కీర్తులు అరకొరగా ఇవ్వవద్దు. నిండుగా ఇమ్మని త్రిమూర్తులకు, వారి శక్తులకు బాలకవిగా చెఱువువారి ప్రార్థన.



**శ్లో॥ సంస్కారవిద్యే చ సురప్రసాదః**
**స్వభ్యాసయోగశ్చ కవిత్వమూలమ్ ।**
**తత్సర్వహేతోః సతతం గురోర్మే**
**పాదారవిందే ప్రణతః ప్రపద్యే ॥ 3**

**ప్రతిపదార్థం :** సంస్కార = సంస్కారము మరియూ; విద్యే చ = విద్య కూడా; సురప్రసాదః = దేవునియొక్క కరుణ వల్ల లభిస్తాయి; స్వభ్యాసయోగశ్చ = సు + అభ్యాసః, యోగః చ = చక్కటి అభ్యాసము, మరియూ యోగము; కవిత్వమూలమ్ = కవిత్వానికి మూలమైనవిశేషాలు; తత్సర్వహేతోః = తత్, సర్వహేతోః = పైన చెప్పిన అన్నిటికి మూలకారణమయిన; గురోర్మే = గురోః మే = నా గురువు అయిన తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి; పాదారవిందే = పాదములనెడి పద్మములకు; సతతం ప్రణతః ప్రపద్యే = ఎప్పుడూ నమస్కరిస్తూ, శరణుపొందుతాను.

**తాత్పర్యము :** సంస్కారము మరియూ విద్య కూడా దేవునియొక్క కరుణ వల్ల లభిస్తాయి. చక్కటి అభ్యాసము, మరియూ యోగము కవిత్వానికి మూలమైనవిశేషాలు. సంస్కారము విద్య, అభ్యాసము, వీటన్నింటికి మూల కారణమయిన నా గురువు అయిన తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి పాదములనెడి పద్మములకు ఎప్పుడూ నమస్కరిస్తూ, శరణుపొందుతాను.

**విశేషాలు :**

**సంస్కారము :** సంస్కారము అంటే చక్కచేయుట, అనుభూతార్థసంస్మృతి అని రెండు అర్థాలున్నాయి. పూర్వ జన్మల వాసనలు బట్టి, దైవానుగ్రహాన్నిఅనుసరించి మనలో త్రిగుణాల సమ్మేళనం - సంస్కార రూపంలో ఉంటుంది. దాని నిష్పత్తి మారుతూ వుంటుంది.

"సంస్కారస్త్రివిధః వేగో భావనా స్థితిస్థాపకశ్చేతి" అని సంస్కారమును మూడు రకాలుగా తర్కసంగ్రహం చెప్పింది. 1. వేగము,( మన్ను తిన్న పాములా కాకుండా వేగంగా చురుకుగా స్పందించే గుణము) 2. భావన,( చక్కగా విషయాలను

భావించగలుగుట) 3. స్థితిస్థాపకము.( బలముల వలన ఒక వస్తువు వికారమునకు లోబడినప్పటికీ బలముల ఉపసంహారము తరువాత తన మొదటి స్థితిని స్వీకరించు గుణమును స్థితిస్థాపకము అంటారు. కష్ట సుఖాల ఉద్వేగాలకు గురి అయినా వెంటనే స్వస్థితిలో స్థిరముగా ఉండే స్థితి.)

**యోగము :** యోగ పదాన్ని రకరకాల అర్థాలలో వాడుతుంటాం. ఉదాహరణకు యోగక్షేమాలు – సంపదను సమకూర్చుకోవడం యోగం, దానిని భద్రం చేసుకోవడం క్షేమం.

పాతంజలయోగసూత్రాలలో రెండవదైన **'యోగశ్చిత్తవృత్తినిరోధః'** అనే సూత్రం చిత్తవృత్తులను నిరోధించడం యోగమని చెబుతోంది. సుషుప్తి మినహా మిగిలిన అవస్థలలో చిత్తంలో ఏదో ఒక జ్ఞానం కలుగుతునే ఉంటుందనీ, ఇదే చిత్త వృత్తి అనీ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు పాతంజలయోగసూత్రాలకు తమ బాలానందినీ వ్యాఖ్యలో చెప్పారు. ఉత్తమ కవితారచనకు యోగస్థితి కూడా అవసరమని మన పూర్వులు భావించారు. అసలు మన పూర్వకవులందరూ యోగులు, ఋషులు కదా !ఈ యోగము కుదరటం, అభ్యాసము చేయగలగటం దైవానుగ్రహాలు అని శాస్త్రి గారు ఈ శ్లోకంలో ప్రతిపాదిస్తున్నారు.

ప్రణతి : సంస్కారముతో మొదలుపెట్టిన ఈ శ్లోకం నమస్కారముతో ముగిసింది.

**నమస్కారాలు నాలుగు రకాలు :** 1. సాష్టాంగ నమస్కారం, 2. దండ ప్రణామం 3. పంచాంగ నమస్కారం, 4. అంజలి నమస్కారం.

1. సాష్టాంగనమస్కారం: మనస్సు, బుద్ధి, అభిమానం, రెండు పాదాలు, రెండు చేతులు, శిరస్సు అను ఈ ఎనిమిదింటితో చేయు నమస్కారమే సాష్టాంగ నమస్కారం. మస్తిష్కం, సంపుటం, ప్రహ్వాంగం అను మూడు రకాల నమస్కారం – ఈ సాష్టాంగ నమస్కారంలో కలిసి ఉంటుంది. భూమిమీద సాగిలపడి లేచి తనరెండు చేతులను తలమీద ఉంచి అంజలి చేయుట మస్తిష్కం. మస్తిష్కం చేసిన తరువాత రెండు చేతులను జోడించి హృదయాన్ని చేర్చుట సంపుటం. సంపుటం చేసిన తరువాత తలను శరీరాన్ని కొంచెం వంచి నిలబడుట ప్రహ్వాంగం. ఇలా మస్తిష్క సంపుటి ప్రహ్వాంగములతో కూడిన చేసే నమస్కారమే సంపూర్ణమైన నమస్కారమని పెద్దలు చెబుతారు.

2. దండప్రణామం : కర్రలా తన దేహాన్ని నిలువుగా భూమిపైవాల్చి పరుండి కాళ్లను

చేతులను చాపి నమస్కరించుట దండ ప్రణామం.

3. పంచాంగనమస్కారం : రెండు పాదాల వేళ్లను, రెండు మోకాళ్లను, తలను మాత్రం భూమిపైనుంచి రెండు చేతులను తలవద్ద చేర్చి నమస్కరించుట పంచాంగ నమస్కారం. ఇది స్త్రీలకు నిర్దేశింపబడింది.

4. అంజలినమస్కారం : రెండుచేతులను కలిపి నమస్కరించుట అంజలి నమస్కారం.

కుడిచేతిలో గురువుయొక్క కుడిపాదము, ఎడమ చేతిలో వారి ఎడమ పాదమును స్పృశించి నమస్కరిస్తారు. చదువు చెప్పిన గురువులకు ఈ నమస్కారం చేయాలి.

నమస్కారం చేసే అలవాటు గలవారికి, పెద్దవారిని సేవించే వారికిని ఆయువు, జ్ఞానం, కీర్తి బలం అను నాలుగు వృద్ధి పొందుతాయి.

(అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః/చత్వారి తస్య వర్ధంతే హ్యాయుః ప్రజ్ఞా యశో బలమ్)

నమస్కరించిన వాడికి తిరిగి నమస్కరించకపోతే వాడు శ్మశానంలో రాబందులు, గ్రద్దలు నివసించే చెట్టుగా పుడతాడని మన పెద్దలు హెచ్చరించారు.

**చెఱువు వారి గొప్పతనం :** దైవం వల్ల ప్రాప్తించే సంస్కారము, విద్య, చక్కటి కవితాభ్యాసము, యోగము – గురువు వల్ల లభిస్తాయని చెప్పి – తనగురువు అయిన తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి గొప్పతనాన్ని చెఱువు వారు ఎంతో ఉన్నతంగా ఆవిష్కరించారు. ఇందులో అతిశయోక్తి లేదు. చెఱువు వారితో పాటు తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి అనుగ్రహం వల్ల ఫలితాలు పొందినవారు చాలామంది ఉన్నారు.



**శ్లో॥ మాత్రావియుక్తశ్చతురబ్దమాత్రే**
**మాతామహాభ్యామవిముక్తసేవీ ।**
**గర్భాష్టమే ప్రాక్తనకర్మబంధా –**
**దుద్బుద్ధబుద్ధిః కవయామ్యహం త్వా ॥** **4**

**ప్రతిపదార్థము :** మాత్రా = తల్లిచేత; చతురబ్ద మాత్రే = చతుః + అబ్దమాత్రే = నాలుగు సంవత్సరాల వయస్సులో; వియుక్తః = వియోగము కలిగినవాడిని (విడువబడిన

వాడిని); మాతామహాభ్యామ్ = తల్లికి తండ్రి అయిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి కొరకు (మాతుః పితా మాతామహః); అవిముక్తసేవీ = విడువబడని సేవగలవాడు; గర్భాష్టమే = గర్భ + అష్టమే = ఎనిమిదవ సంవత్సర మధ్యమములో; ప్రాక్తన కర్మబంధాత్ = అదృష్టవశము వలన; ఉద్బుద్ధ = 1. మేలుకొన్న, 2. తలంపునకు వచ్చినది, 3. వికసించిన (బుధ అవగమనే- ఉద్ + బుధ్ + క్త. (కృత్ప్రత్యయము); బుద్ధిః = బుద్ధితో; కవయామ్యహం త్వా = కవయామి + అహం + త్వా = నిన్ను గురించి కవిత్వము చెప్పుచున్నాను.

**తాత్పర్యము :** ఓ శివా! నేను నా తల్లిచేత నాలుగు సంవత్సరాల వయస్సులో విడువబడిన వాడిని. నా తల్లికి తండ్రి అయిన బ్రహ్మశ్రీ రాఘవనారాయణ శాస్త్రిగారికి విడువని సేవ చేసే వాడిని. నా ఎనిమిదవ సంవత్సర మధ్యమములో నా అదృష్టవశము వలన వికసించిన బుద్ధితో నీ గురించి కవిత్వము చెబుతున్నాను.

**విశేషాలు :** 1. 07-09-1943 వ తేదీన బ్రహ్మశ్రీ వేదమూర్తులు చెఱువు శేష సోమయాజులు, శ్రీలక్ష్మి దంపతులకు చెఱువు సత్యనారాయణశాస్త్రి జన్మించారు.

2. నాలుగవయేట తల్లి గారు మరణించగా, తాతగారయిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారి వద్ద చెఱువు వారు పెరిగారు. రాఘవనారాయణ శాస్త్రిగారు చెఱువు వారికి ఆరవయేటనే రఘువంశ పాఠం ప్రారంభించారు. ఈ జీవిత విశేషాలు ఈ శ్లోకంలో చెఱువు వారు ప్రస్తావించారు.

3. ఈ శ్లోకములోని మొదటిదానితో పాటు రెండవ వాక్యం గుండెను పిండేస్తుంది.

4. మా అమ్మ నన్ను విడిచిపెట్టింది - అనే వాక్యం వెంటనే" నేను తాతగారిని విడువకుండా సేవ చేస్తున్నానని వియుక్త, విముక్త శబ్దాలతో చెఱువు వారు ఆడుకొన్నారు.

5. అవిముక్త పదము విన్నవెంటనే పవిత్రమైన కాశీక్షేత్రము గుర్తుకు వస్తుంది. న ముచ్యతే శివాభ్యామ్. పార్వతీ పరమేశ్వరులు విడువక ఈ కాశీ క్షేత్రంలో ఉంటారు కనుక కాశీకి అవిముక్తము అని పేరు వచ్చింది. ఈ పవిత్రమైన అవిముక్త శబ్దం రాఘవనారాయణ శాస్త్రి గారి ప్రస్తావనలో రావటం ఈ శ్లోకంలో ఒక విశేషం.

6. బుద్ధికే ఇంకొక పేరు మతి.

7. అంతఃకరణవృత్తులు నాలుగింటిలో బుద్ధి ఒకటి. (మనస్సు, చిత్తం, అహంకారం మిగిలిన మూడు)

8. బుద్ధిని పండ, మేధ, చార్వి, గృహీతి, శ్రౌతి, చత్వరి అని ఆఱువిధములుగా విభజిస్తారు.

ఉన్నది ఉన్నట్టు తెలిసికొనే బుద్ధి పండ. ధారణాశక్తి గలబుద్ధి మేధ. గ్రహింపజాలిన బుద్ధి గృహీతి. ఊహాపోహక్షమమైన బుద్ధి చార్వి. శ్రుతి విహితమైన బుద్ధి శ్రౌతి. శ్రవణక్షమమైన బుద్ధి చత్వరి.

9. బుద్ధికి సంబంధించిన గుణములు

శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహము, అపోహము, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానము.

10. బుద్ధి శబ్దాన్ని శ్లోకంలో ప్రయోగించి బుద్ధికి సంబంధించిన శుశ్రూష గుణాన్ని కూడా (అవిముక్త సేవీ) ఈ శ్లోకంలో కలగలిపిన ఎనిమిదేళ్ల బాలకవిని – బాలకవి అనటానికి విద్వాంసులకు మనస్సు రాదు.



**శ్లో॥ పరమేశ! నమస్తుభ్యం – త్వత్స్తోత్రం లిఖ్యతే మయా ।**
**తస్మాత్త్వం విఘ్నరాజాఽత్ర – ప్రత్యూహాన్పరిహారయ ॥ 5**

**ప్రతిపదార్థము :** పరమేశ = ఓ శివా!; నమస్తుభ్యమ్ = నమః + తుభ్యమ్ = నీకు నమస్కారము; త్వత్స్తోత్రమ్ = త్వత్ + స్తోత్రమ్ = నీ స్తోత్రము (స్తూయతే అనేనేతి – స్తోత్రం); లిఖ్యతే మయా = మయా లిఖ్యతే = నా చేత వ్రాయబడుచున్నది; తస్మాత్త్వం విఘ్నరాజాఽత్ర – తస్మాత్ = అందువలన; విఘ్నరాజ = ఓ వినాయకా!; అత్ర = ఈస్తోత్ర రచనలో; ప్రత్యూహాన్పరిహారయ – ప్రత్యూహాన్ = విఘ్నములను; పరిహారయ = తొలగించుము.

**తాత్పర్యము :** ఓ శివా! నీకు నమస్కారము. నీ స్తోత్రము నా చేత వ్రాయబడుచున్నది. అందువలన ఓ శివుని కుమారుడవైన ఓ వినాయకా! ఈస్తోత్ర రచనలో విఘ్నములను తొలగించుము.

**ఛందస్సు :** ఈ శ్లోకం అనుష్టుప్పు

"శ్లోకే షష్ఠం గురుం జ్ఞేయం – సర్వత్ర లఘు పంచమమ్ ।
ద్వి చతుః పాదయోః హ్రస్వం – సప్తమం దీర్ఘమన్యథా ॥"

**లక్షణాలు :** అనుష్టుప్పు లోని ప్రతి పాదమునకు 8 అక్షరములు ఉండాలి. ప్రతి పాదములోని 6వ అక్షరము గురువు, 5వ అక్షరము లఘువు. 7వ అక్షరము 1,3 పాదములలో గురువు, 2,4 పాదములలో లఘువు అయి ఉండాలి. అంటే 1, 2, 3, 4 అక్షరములకు నియమము లేదు – గురువైన కావచ్చు, లేక లఘువైన కావచ్చు. ఈ అనుష్టుప్పులో అన్ని లక్షణాలు సరిపోయాయి.

**విశేషాలు :**

**1. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥**

**– ఈ శ్లోకం మనందరికి తెలిసిందే.**

"తెల్లని బట్టలు ధరించి, పూర్ణచంద్రునిలా ప్రసన్నముఖము కలవాడై, నాలుగు భుజములతో ఉన్న వినాయకుని అన్ని విఘ్నాలను తొలగించి శాంతిని చేకూర్చమని ప్రార్థిస్తున్నాను.

2. దీని అంతరార్థం వేరే ఉన్నదని పెద్దలు చెబుతారు. శుద్ధమైన చైతన్య స్వరూపం (శుక్లం), సూక్ష్మమైన చిదాకాశాన్ని స్వరూపంగా ధరించింది (అంబరధరం), ఆ సర్వవ్యాపకుడైన (విష్ణుం) ధర్మ జ్ఞాన వైరాగ్య ఐశ్వర్యాలు అనే విభూతులు తన అనుభవాలుగా ఉన్న ఆ పరమాత్మ (చతుర్భుజం), మానసికమైన వివిధ గుణాలతో బాధించబడుతున్న మనకోసం ("శశి వర్ణం"), ప్రసన్నుడు కావాలని (ప్రసన్న), జ్ఞానం బోధించి (వదనం) – మన సాధనలో అడుగడుగున వస్తున్న అన్ని విఘ్నాలను తొలగించమని ధ్యానిస్తున్నాను".

3. అంటే లౌకిక జీవితంలో కలిగే విఘ్నాలను తొలగించమని ప్రార్థించే దశ నుండి, సాధనాపరమైన అడ్డంకులను తొలగించమని ప్రార్థించే దశకు సాధకుడు చేరుకోవాలని ఈ శ్లోక అంతరార్థం.

4. ప్రతికూలమూహనమితి ప్రత్యూహః – ప్రతికూలమైన ఊహను ప్రత్యూహము అంటారు.

5. సాధకునికి ఈ ప్రతికూలమైన ఊహలు ఎక్కువ. వాటిని తొలగించమని చెఱువు సత్యనారాయణశాస్త్రి అనే ఒక సాధకుడు విఘ్నరాజును ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నాడు.

6. వినాయకుడిని ఈ శ్లోకంలో "విఘ్నరాజ" అని సంబోధించుటలో కూడా ఒక చమత్కారముంది. దుష్టులను విఘ్నములను శిక్షించువాడు, స్వతంత్రుఁడౌట వలనఁ దనకు ఇతర ప్రభువు లేనివాఁడు వినాయకుడు. శ్లోకం మొదట "పరమేశ" అని సంబోధన. అంటే శివునికి మించిన ప్రభువు ఇంకొకరు లేరు అని అర్థం. కనుక వినాయక (విగతో నాయకః ప్రభుర్యస్య స్వతంత్ర త్వాత్ – స్వ తం త్రుడౌట వలన దనకు ఇతర ప్రభువు లేనివాడు) అని సంబోధిస్తే తాను మొదట చెప్పిన "పరమేశ" పదానికి అర్థం లేకుండా పోతుంది. అందువలన" విఘ్న రాజ" అని మాత్రమే సంబోధన.

7. శివుడినే విఘ్నాలు తొలగించమని ప్రార్థించవచ్చు కదా! మధ్యలో విఘ్నరాజ నుతి దేనికి? లౌకిక వ్యవస్థలో ప్రధానమంత్రి దగ్గరికి వెళ్ళి మనకు రేషన్ కార్డు కావాలని దరఖాస్తు పెట్టుకోం. రేషన్ కార్డు కొరకు ఎంఆర్వో చాలు. విఘ్నాల మీద అధిపత్యం వినాయకునికి శివుడు ఇచ్చాడు. అందువలన దరఖాస్తు మొదట విఘ్నరాజు దగ్గరకు వెళ్లాలి. చెఱువు వారు అదే పని చేసారు.

8. "దత్త భాగవతం అనే పుస్తకాన్ని రచించి చందోలులోని "లింగోద్భవ స్వామికి" అంకితమిచ్చాను ."యామావిక" అనే పుస్తకాన్ని శ్రీ చెన్నకేశవ స్వామికిచ్చాను. ఈ రకంగా శివ కేశవులు నాకు అల్లుళ్ళు అయ్యారు. అని తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారు "మత్స్వప్నః" అను పుస్తకంలో చెప్పుకొన్నారు. తన తాతగారు దత్త భాగవతం లింగోద్భవ స్వామికి అంకితమిస్తే శ్రీ లింగోద్భవ వృత్తమాలికా స్తుతితో శివస్వామికి చెఱువువారు అక్షరాభిషేకం చేసారు.



**శ్లో॥ హే గౌరీశ్వర! దేవ! భక్త వరదాయిన్ రుద్ర దేవేశ్వర!**
**స్థాణో భీమ పరేశ! ఖండ పరశో! విశ్వేశ! దేవేశ్వర ।**
**ధాతుర్ధాత రనన్త వైభవ విభో! శూలిన్కపాలిన్! గదిన్!**
**స్మారం స్మారమహం నమామి పదయోస్తే మామవానారతమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** హే గౌరీశ్వర = గౌరీదేవికి ప్రభువయిన శివా!; దేవ = మా మనస్సులలో క్రీడించే దేవా!; భక్త వరదాయిన్ = భక్తులకు వరములిచ్చువాడా!; రుద్ర = రోదనము చేయుచూ పుట్టిన రుద్ర స్వరూపుడా!; దేవేశ్వర = దేవతలకు ప్రభూ!; స్థాణో! = స్థిరమైన వాడా! అణురూపములో జగత్తులో వ్యాపించినవాడా! సంసారమనే మండపానికి

మూలస్తంభముగా ఉన్నవాడా!; భీమ = భయంకరరూపము కలవాడా! భయానకరసము కలవాడా!; పరేశ = అత్యున్నతుడైన దేవా!; ఖండ పరశో! = పరశువనెడి రాక్షసుని ఖండించినవాడా! (ఖండించిన గండ్రగొడ్డలి కలవాడా!); విశ్వేశ! = కాశియందు ఉండు విశ్వేశ్వరుడా!) (ఇక్కడ శివునికి అన్నపూర్ణ, విశాలాక్షి అని ఇరువురు భార్యలు.); జీవేశ్వర! = జీవులకు ఈశ్వరుడా!; ధాతుర్ధాతః = అన్నింటి గొప్పయయిన బ్రహ్మను (ధాతుః) మించిన బ్రహ్మ స్వరూపుడా! (శ్రేష్ఠుడని భావము); అనన్త వైభవ = అంతులేని వైభవము కలవాడా!; విభో! = సర్వ వ్యాపకుడా!; శూలిన్ = శూలము ధరించినవాడా!; కపాలిన్ = బ్రహ్మ శిరస్సును కపాలముగా ధరించినవాడా!; గదిన్ = గద ధరించిన వాడా! (శివుడు సర్వాయుధుడని – అన్ని ఆయుధములు కలవాడని శివ సహస్ర నామములో (810) ఉంది. అందువలన చెఱువువారు గదను ఈ శ్లోకంలో శివునికి ఆయుధముగా చేసారు); స్మారం స్మారమ్ = నిన్ను మాటి మాటికి స్మరిస్తూ స్మరిస్తూ; అహమ్ = నేను; తే పదయోః = నీ పాదములకు; నమామి = నమస్కరించుచున్నాను; మామ్ = నన్ను; అనారతమ్ = ఎడతెగకుండ, ఎల్లప్పుడు (ఆ + రమ్ + క్త – ఆరతమ్ = విరతిః – న + ఆరతమ్ – అస్య. (నఞ్ బహువ్రీహి సమాసము); అవ = రక్షించుము.

**తాత్పర్యము :** గౌరీదేవికి ప్రభువయిన శివా! మా మనస్సులలో క్రీడించే దేవా! భక్తులకు వరములిచ్చువాడా! రోదనము చేయుచూ పుట్టిన రుద్ర స్వరూపుడా! దేవతలకు ప్రభూ! సంసారమనే మండపానికి మూలస్తంభముగా ఉన్నవాడా! భయంకరరూపము కలవాడా! అత్యున్నతుడైన దేవా! పరశువనెడి రాక్షసుని ఖండించినవాడా! కాశియందు ఉండు విశ్వేశ్వరుడా! జీవులకు ఈశ్వరుడా! అన్నింటి గొప్పయయిన బ్రహ్మను మించిన బ్రహ్మ స్వరూపుడా! అంతులేని వైభవము కలవాడా! సర్వ వ్యాపకుడా! శూలమును ధరించినవాడా! బ్రహ్మ శిరస్సును కపాలముగా ధరించినవాడా! గదను ధరించిన వాడా! నిన్ను మాటి మాటికి స్మరిస్తూ స్మరిస్తూ నేను నీ పాదములకు నమస్కరించుచున్నాను. నన్ను ఎల్లప్పుడు రక్షించుము.

**విశేషాలు :**

**1) రుద్ర :** రుద్రులు పదకొండు మంది – అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు.

రుద్రుడు అష్టమూర్తులలో ఒక్కడు. శివునికి నామాంతరము. రుద్రుడు బ్రహ్మ పుత్రులలో ఒకడు. ఇతడు బ్రహ్మముఖములోనుంచి పుట్టాడు. బ్రహ్మ మొదట తాను పుట్టించిన సనకసనందనాదులు పరమయోగులై సృష్టికర్తలు కానందుకు బాగా కోపాన్ని వహించాడు. అప్పుడు ఆ కోపము రుద్రరూపములో అతనియొక్క భ్రూమధ్యములో నుంచి రోదనము చేయుచు పుట్టింది కనుక రుద్రుడు అను పేరు వచ్చింది.

**2) గౌరీ :** గౌర వర్ణము కలిగినది గౌరి. తెలుపురంగుకి గౌరమని పేరు. గూయతే కీర్త్యతే గౌరః – కీర్తన చేయబడేది కనుక తెలుపురంగు గౌరము. గౌరి కీర్తింపబడునది. తెలుపొక్కటేకాదు, ఎరుపు, పసుపురంగులని కూడా గౌర శబ్దానికి అర్థాలున్నాయి.

**3) ఖండపరశువు :** పరశురామ అవతారములో శ్రీమహావిష్ణువు గొడ్డలినే ఆయుధంగా చేసుకుని క్షత్రియులతో యుద్ధములు చేసి వారిని సంహరించాడు. కనుక విష్ణువుకు ఖండపరశువని పేరు. శివునికూడా శివ సహస్ర నామాలలో ఈ పరశు నామముంది. శివుడు, విష్ణువు ఒకరే కదా!

**4) వృత్తం :** ఈ శ్లోకం శార్దూలవృత్తంలో ఉంది (మసజసతతగ).

**5) స్మారం స్మారం : "శ్రావం శ్రావం వేద్యం దైవం నామం నామం ధార్యం దైవమ్ స్మారం స్మారం ధార్యం దైవం వారం వారం స్తుత్యం దైవమ్"** అని శ్రీ కావ్యకంఠ వాసిష్టగణపతిముని **"ఉమాసహస్రం"** లో అన్నారు. పదవ శతకం 40 స్తబకం. మాటి మాటికి విని తెలుసుకో దగినది దైవం. నిత్యం ప్రణామంతో ఆరాధించదగినది దైవం. స్మరణ చేస్తూ చేస్తూ ధారణతో పొందదగినది దైవం. అనేక రకాలుగా వరించి స్తుతింప దగింది దైవం. అందుకే చెఱువువారు కూడా "స్మారం స్మారం" ప్రయోగం చేశారు. చెఱువు వారిని, వారి సుబ్బలచ్మిని కూడా మరిచిపోలేని మేము వారిని "స్మారం స్మారం".



శ్లో॥ **గంగామూర్ధజ! కామనీయకనిధే! కల్యాణసంపత్ప్రద!**
**ప్రావారీకృతసింధురాజిన! దయాసింధో! సుబన్ధో మమ ।**
**దేవస్త్వ్య! మహానుభావ! మృడ! హే శ్రీకంఠ! విద్యేశ్వర!**
**స్మారం స్మారమహం నమామి పదయో స్తేమామవా నారతమ్ ॥** **7**

**ప్రతిపదార్థము :** గంగామూర్ధజ = గంగను తన తలపైని జటాజూటములో కలవాడా!; కామనీయకనిధే! = కమనీయతలకు (కోరదగినవాటికి) నిధి అయినవాడా!;

కల్యాణసంపత్ప్రద! = శుభకరములైన సంపదలను ఇచ్చువాడా!; ప్రావారీకృత సింధురాజిన! = ఉత్తరీయముగా చేయబడిన గజచర్మము కలవాడా!; దయా సింధో! = దయకు సముద్రమైనవాడు!; సుబన్ధో = చక్కటి బంధువా!; మమదేవ = నా దేవుడా!; స్తవ్య! = పొగడదగినవాడా!; మహానుభావ! = గొప్ప ప్రభావం కలిగిన వాడా!; మృడ! = భక్తులను సుఖింపచేయువాడా! తాను సుఖముగా ఉండువాడా!; హే శ్రీకంఠ! = కాలకూటమును భరించుట వలన కలిగిన నల్లని శోభ కంఠమందు కలవాడా!; విద్యేశ్వర! = విద్యకు ప్రభువా!; స్మారం స్మారమ్ = నిన్ను మాటి మాటికి స్మరిస్తూ; అహమ్ = నేను; తే పదయోః = నీ పాదములకు; నమామి = నమస్కరించు చున్నాను; మామ్ = నన్ను; అనారతమ్ = ఎల్లప్పుడు; అవ = రక్షించుము.

**తాత్పర్యము :** గంగను జటాజూటములో కలవాడా! అందమయిన నిధి వంటివాడా! శుభకరములైన సంపదలను ఇచ్చువాడా! ఉత్తరీయముగా చేయబడిన గజచర్మము కలవాడా! దయకు సముద్రమైనవాడా! చక్కటి బంధువా! నా దేవుడా! పొగడ్తలందుకొనే వాడా! గొప్ప ప్రభావం కలిగిన వాడా! భక్తులను సుఖింపచేయువాడా! నల్లని శోభ కంఠమందు కలవాడా! విద్యకు ప్రభువా! నిన్ను మాటి మాటికి స్మరిస్తూ నేను నీ పాదములకు నమస్కరించుచున్నాను. నన్ను ఎల్లప్పుడు రక్షించుము.

**విశేషాలు :**

**1. గంగామూర్ధజ :** గమ్‌గతౌ అని గంగా పదానికి ధాతువు. హరిపాదమువలన భూమిని పొందినది గంగ (హరి చరణాత్ గాం భూమింగతా); హరశిరస్సువలన భూమిని పొందినది గంగ (హరోత్తమాంగాత్ భూమింగతా) మూర్ధజము అంటే వెంట్రుక కనుక గంగను తన తలపైని జటాజూటములో కలవాడా అని అర్థం.

**2. కామనీయకనిధే! :** భోగ భాగ్యాలు కలిగించి సంపన్నులను చేసేవి నవ నిధులను 1. మహాపద్మ, 2. పద్మ, 3. శంఖ, 4. మకర, 5. కచ్ఛప, 6. ముకుంద, 7. కుంద, 8. నీల, 9. వర తన భక్తుడైన కుబేరునికి అనుగ్రహించినవాడు శివుడు. తనకొరకు ఉంచుకోకుండా తన భక్తులకు నిధులపై అధికారాన్ని కలిగించటం నిస్స్వార్థమయిన, అందమయిన ప్రక్రియయే కదా! అందుకే శివుడు కమనీయతలకు నిధి.

**3. మహానుభావ :** మహానుభావుడు అంటే గొప్పబుద్ధి కలవాడు, ఔదార్యం కలవాడు, గొప్ప సామర్థ్యం కలవాడు. మహా + అనుభావుడు. అనుభావం అంటే ప్రభావం,

తేజస్సు, అధికారం భావాలన్నింటిని యేది స్ఫురణకు తెస్తుందో అది అనుభావం అని చెబుతారు. అను + భూ + ఘ. (కృత్ప్రత్యయము). ఇది చిత్తజానుభావము, గాత్రజాను భావము, వాగారంభానుభావము, బుధ్యారంభానుభావము– అనినాలుగు విధాలు. చిత్తజానుభావము – పదిరకాలు. 1. భావము – నిర్వికారమయిన మనస్సు, 2. హావము – భావము కన్నులలో కలుగుట, 3. హేల – కన్నులలో నిలిచిన భావాన్ని ఇంచుకంత అభినయించుట, 4. శోభ – భావాన్ని అలంకారములతో అభినయించుట, 5. కాంతి – భావాన్ని మన్మథ విషయముగా చూపించుట, 6. దీప్తి – భావాన్ని భోగములందు ఉపయోగించుట, 7. ప్రాగల్భ్యము – ప్రయోగములలో నిస్సంశయ వృత్తి, 8. మాధుర్యము – వ్యాపారములు మృదువుగా చేయుట, 9. ధైర్యము – నిర్భయముగా ఉండుట, 10. ఔదార్యము – సర్వకాలములలో ఉదారంగా ఉండుట.

గాత్రజానుభావము కూడా 10 విధములు 1. లీల – ముద్దుమాటలు, 2. విలాసము – నగవద్దికలు కల అంగ విన్యాసములు, 3. విచ్ఛిత్తి – అలంకారమునకు తగిన చక్కదనము, 4. విభ్రమము – ఒక వస్తువును మరి ఒక వస్తువుగా తలచుట, 5. కిలికించితము – సంతోషము, భయము, సిగ్గు, చింత ఇవ్వన్నీ కూడిన భావము, 6. మోట్టాయితము – స్వాభిలాషా ప్రకటన, 7. కుట్టమితము – లోపల సంతోషంగా ఉన్నా పైకి దుఃఖము చూపించుట, 8. బిబ్బోకము – ఇష్టవస్తువులందు అయిష్టము కలుగుట, 9. లలితము – సుకుమార అంగ విన్యాసము, 10. విహృతము – అడిగిన ప్రశ్నకు క్రియతో ప్రత్యుత్తరం ఇచ్చుట.

వాగారంభానుభావము – 12 రకాలు 1. ఆలాపము – సంతోషపు మాటలు, 2. విలాపము – దుఃఖపు మాటలు, 3. సల్లాపము – ప్రశ్నోత్తరములు కల మాటలు, 4. ప్రలాపము – పనికిమాలిన మాటలు, 5. అనులాపము – చెప్పినమాటే మరల మరల చెప్పుట, 6. అపలాపము – ముందు చెప్పిన మాటను వెనుక తిప్పివేయుట, 7. సందేశము – స్నేహితునితో చెప్పుకొను మాటలు, 8. అతిదేశము – ఒకరు చెప్పిన మాటలోనే క్రమముగా చెప్పుట, 9. నిర్దేశము – నిరూపణము చేసి చెప్పుట, 10. అపదేశము – అర్థాంతరమును తెలియచెప్పుట, 11. ఉపదేశము – శిష్యులకు గురువు చెప్పెడి మాటలు, 12. వ్యపదేశము – ఇతరవ్యాజముగా చెప్పు మాటలు.

బుద్ధ్యారంభానుభావము – 1. రీతి, 2. వృత్తి, 3. ప్రవృత్తి అని మూడు విధములు (శ్రీ నాగభూషణకవి రసభావ నాయక సంప్రదాయము పుస్తకమునుండి)

శివునిలో కూడా ఇన్ని అనుభావాలుంటాయా? అని ప్రశ్న. ఆయన నిర్వికారుడు. కాని మనం విశ్వరూపుడైన ఆయనలో అన్నింటిని ఆపాదించి సంతోషిస్తుంటాం.

**4. విద్యేశ్వర :**

శివ మహాపురాణము ఏడు భాగాలు. అవి : 1. శ్రీ విద్యేశ్వర సంహిత, 2. రుద్ర సంహిత, 3. శతరుద్ర సంహిత, 4. కోటిరుద్ర సంహిత, 5. ఉమా సంహిత, 6. కైలాస సంహిత, 7. వాయువీయ సంహిత – ఈ ఏడు సంహితలలో శివుని ఎనభై ఎనిమిది అవతారములు, వాటికి సంబంధించిన కథలు ఉన్నాయి. వాటిలో విద్యేశ్వర సంహితను చెఱువు వారు ప్రయోగించిన విద్యేశ్వర పదము జ్ఞప్తికి తెస్తున్నది.

5. వృత్తం : ఈ శ్లోకం శార్దూల వృత్తంలో ఉంది (మసజసతతగ).

6. స్మారం స్మారమహం నమామి పదయోస్తే మామవానారతం (ఓ శివా! నిన్ను మాటి మాటికి స్మరిస్తూ నేను నీ పాదములకు నమస్కరించుచున్నాను. నన్ను ఎల్లప్పుడు రక్షించుము.) అను పాదం చెఱువు వారికి బాగా నచ్చిన పాదం కామోసు! అందుకే క్రితం శ్లోకంలో చెప్పిన ఈ పాదమే మళ్లీ ఈ శ్లోకంలో వచ్చి కూర్చుంది.



**శ్లో॥ శూలిన్నీశ శివాద్రి మందిర హరీశో?! దేవ దేవ ప్రభో**
**సర్వజ్ఞాంతకశాత్రవాన్ధకరిపో – భూతీడ్య!భూతేశ్వర ।**
**మేరు క్ష్మాధర కార్ముకాత్తకర! పారావార తూణీరక –**
**స్మారం స్మారమహం నమామి పదయో స్తేమామవానారతమ్ ॥ 8**

**ప్రతిపదార్థము :** శూలిన్ = శూలమను ఆయుధము కలవాడా! (శూలమస్యాస్తీతి శూలీ); ఈశ = ఐశ్వర్య యుక్తుడైన వాడా! (ఈష్టే ఈశః– ఐశ్వర్య యుక్తుడు); శివాద్రి మందిర = శుభములకు నిలయమైన కైలాసమను వెండికొండ ఇల్లుగా కలవాడా!; హరీశ = ఆంజనేయ స్వరూపుడవైన శివుడా!; దేవ దేవ = దేవుళ్లకు దేవుడా!; ప్రభో = గొప్పపుట్టుక కలవాడా! (ప్ర = ఎక్కువగా; భుః = సమర్థుడా!); సర్వజ్ఞ! = సమస్తము ఎరిగినవాడా! (సర్వం జానాతీతి సర్వజ్ఞః జ్ఞా అవబోధనే); అంతక శాత్రవా = యమునకు పగవాడా! (అంతక = అంత + ణ్వుల్. (కృత్ప్రత్యయము) నశింపచేయు వాడు.); అన్ధక రిపో = అంధకుడను రాక్షసునకు శత్రువా! (అంధకాసురస్య రిపుః); భూతీడ్య = ప్రాణులచే పొగడబడినవాడా!; భూతేశ్వర =భూతములకు ప్రభువా! (1. పృథివి,

2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము – అనునవి పంచ భూతములు. భూతములనగా దేవయోని సంభూతులు. వీరు శ్మశానవాసులు. వీరి నిగ్రహార్థమై రుద్రుడు శ్మశానములో ఉంటాడని ప్రసిద్ధి.). మేరు క్ష్మాధర కార్ముకాత్తకర = మేరు పర్వతమును విల్లులా పొందబడిన చేయి కలవాడా! (త్రిపురాసుర సంహారములో మేరు పర్వతమును విల్లులా ధరించినవాడని భావము); పారావార తూణీరక = సముద్రమును అమ్ములపొదిగా కలిగినవాడా! (పారావారము = పారమ్ ఆవృణోతి పారావారః – వృ వరణే – దరిని కప్పునది. అనగా దరి లేనిది) (తూణ్యతే కరైరితి తూణీరః – తూణ పూరనే – బాణములచేత పూరింపబడును కనుక అమ్ముల పొదికి తూణీరమని పేరు వచ్చింది); స్మారం స్మారమ్ = నిన్ను మాటి మాటికి స్మరిస్తూ స్మరిస్తూ; అహమ్ = నేను; తే పదయోః = నీ పాదములకు; నమామి = నమస్కరించు చున్నాను; మామ్ = నన్ను; అనారతమ్ = ఎల్లప్పుడు; అవ = రక్షించుము.

**తాత్పర్యము :** ఓ శివా! శూలమను ఆయుధము కలవాడా! ఐశ్వర్యము కలిగిన వాడా! శుభములకు నిలయమైన కైలాసమను వెండికొండ ఇల్లుగా కలవాడా! ఆంజనేయ స్వరూపుడవైన శివుడా! దేవుళ్లకు దేవుడా! గొప్పపుట్టుక కలవాడా! సమస్తము ఎరిగినవాడా! యమునకు శత్రువా! అంధకుడను రాక్షసునకు శత్రువా! ప్రాణులచే పొగడబడినవాడా! భూతములకు ప్రభువా! త్రిపురాసుర సంహారములో మేరు పర్వతమును విల్లులా ధరించినవాడా! సముద్రమును అమ్ములపొదిగా కలిగినవాడా! నిన్ను మాటి మాటికి స్మరిస్తూ స్మరిస్తూ నేను నీ పాదములకు నమస్కరించుచున్నాను. నన్ను ఎల్లప్పుడు రక్షించుము.

**విశేషాలు :**

**శూలి :** త్రిశూలము పైన మూడు కొనలు ఉంటాయి. సత్వ రజ స్తమో గుణములకు ఇది ప్రతీక. వీటి యొక్క ఏకత్వమే త్రిగుణాతీతం. అంటే పరమశివుడు త్రిగుణాతీతుడని తెలియచేసే ప్రతీక త్రిశూలము.

**అంధకాసురుడు :** కోరరాని కోరిక కోరేవరకు తనకు చావు ఉండదన్న విచిత్రమైన వరాన్ని బ్రహ్మ వలన పొందిన రాక్షసుడు అంధకాసురుడు. చివరకు పార్వతీదేవి కావాలనే కోరరాని కోరిక కోరుకొని శివుని వలన ప్రాణాలు కోల్పోయాడు.

**హరీశ :** హరి అంటే విష్ణువు; ఇంద్రుడు; యముడు; వాయువు; చంద్రుడు; సూర్యుడు;

సింహము; కిరణము; కోతి; పాము; కప్ప; గుఱ్ఱము; చిలుక – ఇన్ని అర్థాలున్నాయి. వీటిలో విష్ణువుకు ప్రభువు లేదా కోతులకు ప్రభువయిన ఆంజనేయుడు అని హరీశ పదానికి అర్థాలు వస్తున్నాయి. శివ పురాణాలలో శివుడు విష్ణువుకంటె గొప్పవాడని, విష్ణుపురాణాల్లో విష్ణువు శివునికంటె అధికుడని సూచించే పదాలు అనేకమున్నాయి. హిమాద్రిసుతే పాహిమాం వరదే పరదేవతే ॥ అను పల్లవి : సుమేరుమధ్య వాసిని శ్రీ కామాక్షి ॥ చరణము(లు): హేమగాత్రి పంకజనేత్రి మతంగాత్మజే సరోజభవ హరీశ సుర మునీంద్రనుతే ॥ (శ్యామశాస్త్రి) అని ఒక కీర్తనలో శ్యామ శాస్త్రి అమ్మవారు హరీశునిచేత నమస్కరింపదగినది అని చెప్పారు. అంటే శివునికంటె అమ్మవారు గొప్పదని భావం. 'శ్రీ హను మాను గురుదేవులు నాయెద..పలికిన సీతా రామకథ' అను సుందర కాండ పారాయణములో ఎంఎస్ రామారావు గారు "కోటగోడ అవలీలగ ప్రాకెను / కపికిశోరుడు లోనికి దుమికెను / శత్రుపతనముగ వామపాదమును / ముందుగ మోపెను ముందుకు సాగెను / ఆణిముత్యముల తోరణాలుగల / రమ్యతరమైన రాజవీథుల / వెన్నెలలో లంకాపురి శోభను / శోధనగా హరీశుడు గాంచెను" అని పాడుకొన్నారు. హరీశుడంటే ఆంజనేయుడని ఇక్కడ అర్థం. కనుక శివాంశ సంభూతుడయిన ఆంజనేయ స్వామిని శాస్త్రిగారు ఈ శ్లోకములో హరీశునిగా, శివునిగా పిలుచుకొన్నారని చెప్పుట బాగుండునని తోచుచున్నది.



**శ్లో॥ అజాయ విశ్వోద్భవనాశకర్త్రే**
**నీలాయ కంఠే విశదాయ కాయే ।**
**సత్యాయ నిత్యాయ కుమారపిత్రే**
**నమో నమస్తేఽస్తు నమో నమస్తే ॥** 9

**ప్రతిపదార్థము :** అజాయ = పుట్టుక లేనివాని కొరకు; విశ్వ = జగత్తుయొక్క (విశతి సర్వత్ర విశ్వం – విశ ప్రవేశనే); ఉద్భవ = పుట్టుకకు (ఉద్భవనముద్భవః– భూసత్తాయాం); నాశ = నాశనమునకు (నశ్యతే నాశః – ణశ అదర్శనే – నశించుట నాశము చావుకు ఇంకొకపేరు నాశనము); కర్త్రే = కారణమైన వానికొరకు; కంఠే నీలాయ = కంఠమునందు నల్లని మచ్చ కలవాని కొరకు (నీలః కంఠో యస్య నీల కంఠః– నల్లని మెడ కలవాడు); కాయే విశదాయ = శరీరమునందు స్పష్టమయిన తెల్లనిరంగు కలవానికొరకు! (చిత్తే విశతీతి విశదః విశ ప్రవేశనే. మనస్సునందు

ప్రవేశించునది.); సత్యాయ = సత్యమైన వానికొరకు (సత్సు సాధుషు భావం సత్యం- సత్పురుషులయందు పుట్టునది సత్యము); నిత్యాయ = నిత్యమైన వానికొరకు (నియతం భవతీతి నిత్యం - నియతమైనది - ఎడతెగని యునికి పేరు నిత్యము); కుమార = కుమారస్వామియొక్క (సదా బాలత్వాత్ కుమారః- ఎల్లప్పుడూ బాలుడుగా ఉండువాడు. కుత్సితాన్ మారయతీతి కుమారః - కుత్సితులను సంహరించువాడు. మృజ్ ప్రాణ త్యాగే. కౌ పృథివ్యాం మారయతి మన్మథవదాచరతీతివా - భూమియందు మన్మథుని వలెసుందరమైనవాడు. కౌ పృథివ్యాం మాం లక్ష్మీం రాతి దదాతీతి వా - భూమియందు సంపద ఇచ్చువాడు. రాదానే. సదా బ్రహ్మ చారిత్వా ధ్వా - ఎల్లప్పుడు బ్రహ్మచారి గనుక కుమారుడు); పిత్రే = తండ్రికి; నమో నమస్తేస్తు నమో నమస్తే = నమస్కారము. నమస్కారముండుగాక! నమస్కారము. ఓ శివా! నీకు నమస్కారము.

**తాత్పర్యము :** ఓ శివా! నీకు నమస్కారము. నువ్వు పుట్టుక లేనివాడివి. అంతట ప్రవేశించి అంతటా నిండియున్న వాడివి. పుట్టుకకు, నాశనమునకు కారణమైన వాడివి. కంఠమునందు నల్లని మచ్చ కలవాడివి. శరీరమునందు స్పష్టమయిన తెల్లనిరంగు కలవాడివి. సత్యమైన వాడివి. నిత్యమైన వాడివి. తండ్రివి. నీకు నమస్కారము.

**విశేషాలు :**

**1. అజాయ :** అజుడనగా పుట్టుక లేనివాడు - శివుడు తనకు తానే పుట్టిన వాడు కనుక ఒక దంపతులకు పుట్టినవాడు కాదని తాత్పర్యం - అజ శబ్దము నపుంసకలింగమైనప్పుడు పరబ్రహ్మవాచకం గూడ అవుతుంది. **బ్రహ్మవిత్బ్రహ్మైవభవతి** - బ్రహ్మమునెరిగినవాడు బ్రహ్మ అవుతాడు అనగా పునర్జన్మలు లేనివాడవుతాడని శ్రుతి . 'అజాయమానో బహుధా విజాయతే' అని వేదం అంటోంది. జన్మించ వలసిన అవసరం లేనివాడు అనేకమయిన జన్మలను పొందుతున్నాడు.మన జన్మలన్నీ శివ స్వరూపాలే కదా ! -

2. విశ్వ : ఈ విశ్వము అద్దములోని ప్రతిబింబము వంటిది. అంటే విశ్వము కల్పన. ఆత్మ అంతటా వ్యాపించి ఉన్నది. అనంత విశ్వము అంతటా ఉన్నది అనే దృష్టితో చూచే వానికి ఆత్మ కనబడదు. ఆత్మ దృష్టితో చూచేవాడికి విశ్వము కనిపించదు.

**ఆరావం బుదయించెఁ దారకముగ న్నాత్మాబ్ధవీధిన్మహా**
**కారోకారమకారయుక్తమగు నోంకారాభిధానంబు చె**

**న్నారున్ విశ్వ మనంగc దన్మహిమచే నానాదబిందుల్ సుఖ**
**శ్రీ రంజిల్లc గడంగు నీవదె సుమీ శ్రీకాళహస్తీశ్వరా!**

శ్రీ కాళహస్తీశ్వరా! ఆత్మకు ఆశ్రయము దహరాకాశము. (హృదయ కమలంలో ఉన్న చిదాకాశం.)అక్కడ ఒక సూక్ష్మతమధ్వని పుట్టింది..అదే అకార, ఉకార మకార అను మూడు అవయవములతో కలిసిన 'ఓం' కారము. దీనిని "తారకము" అని కూడా అంటారు.ఇంకొక పేరు "నాదము".ఓంకార మహిమచేతనే విశ్వము పుట్టింది. ఈ విశ్వాన్నే "బిందువు" అని కూడా అంటారు..మూలము నువ్వే.

వస్తువుకి ఆ వస్తువు చెప్పు పదానికి అభేదం. అలాగే ఓంకారానికి దానిచే చెప్పబడు శివునికి అభేదము. శివుడు నిరవయవుడు. శివునినుంచి సావయవ మగు విశ్వము పుట్టింది. విశ్వమే తన రూపముగా కలవాడు అని శివుని సహస్ర నామము. (విశ్వరూపః)

**3. ఛందస్సు :** ఈ శ్లోకములోని ఛందస్సు ఉపజాతి. అది ఇంద్ర వజ్రోపేంద్ర వజ్రల కలగలుపు – తతజగగ – జతజగగ.

గణ విభజన

జ త జ గగ

| U | U U | | U | U U

అ జా య వి శ్వో ద్భ వ నా శ క ర్త్రే

త త జ గగ

U U | U U | | U | U U

నీ లా య కం ఠే వి శ దా య కా యే



శ్లో॥ **శుద్ధాయ బుద్ధాయ నిరీశ్వరాయ**
**సర్వేశ్వరాయాద్రిసుతేశ్వరాయ ।**
**హరాయ నాగేశ్వర భూషణాయ**
**నమో నమస్తేఽస్తు నమో నమస్తే ॥** **10**

**ప్రతిపదార్థము :** శుద్ధాయ = అనంత జ్ఞానం, అనంత దర్శనం, అనంత చరిత్ర, అనంత సుఖం అనేవి శుద్ధాత్మ లక్షణాలు / గుణాలు కలవానికి; బుద్ధాయ = పరిపూర్ణ జ్ఞానం తెలిసినవానికి, జ్ఞాన స్వరూపునికి (బుధ అవగమనే); నిరీశ్వరాయ = తనకు ప్రభువు లేనివానికి (తనకంటే ఎవరూ గొప్పవారు లేరని భావం); సర్వేశ్వరాయ = సార్వభౌమునికి; అద్రిసుతేశ్వరాయ = పర్వత సుతయైన పార్వతీదేవికి ప్రభువైనవానికి! (ఫల మూల ద్వారమున నరులచేత భక్షింపబడునది – అద్రి. అద భక్షణే); హరాయ = ప్రళయకాలమున సర్వమును హరించువానికి, భక్తులపీడను హరించువానికి, అయస్కాంతము ఇనుమును ఆకర్షించునట్లు అందరు జీవులను ఆకర్షించువానికి (హృ హరణే); నాగేశ్వర భూషణాయ = పాములకు శ్రేష్ఠుడైన వాసుకిని అలంకారముగా కలిగినవానికి!; నమో నమస్తేస్తు నమో నమస్తే = నమస్కారము, నమస్కారముండుగాక! నమస్కారము, ఓ శివా! నీకు నమస్కారము.

**తాత్పర్యము :** అనంత జ్ఞానం, అనంత దర్శనం, అనంత చరిత్ర, అనంత సుఖం అనేవి శుద్ధాత్మ లక్షణాలు / గుణాలు కలవానికి,పరిపూర్ణ జ్ఞానం తెలియబడినవానికి, జ్ఞాన స్వరూపునికి, తనకు ప్రభువు లేనివానికి, సార్వభౌమునికి, పర్వత సుతయైన పార్వతీదేవికి ప్రభువైనవానికి ప్రళయకాలమున సర్వమును హరించువానికి, భక్తుల పీడను హరించువానికి, అయస్కాంతము ఇనుమును ఆకర్షించునట్లు అందరు జీవులను ఆకర్షించువానికి, పాములకు శ్రేష్ఠుడైన వాసుకిని అలంకారముగా కలిగినవానికి నమస్కారము. ఓ శివా! నీకు నమస్కారము.

**విశేషాలు :**

**శుద్ధము :** ఏ రకమైన మలినమూ సోకనిది శుద్ధము. శుద్ధాధ్వం అని శైవ సంప్రదాయంలో సాధనకు సంబంధించిన ఆరు అధ్వాలు ఉన్నాయి. అధ్వం అంటే మార్గం. ఆరు ఇవీ : 1. కళాధ్వం, 2. భువనాధ్వం, 3. తత్త్వాధ్వం, 4. వర్ణాధ్వం, 5. సదాధ్వం, 6. మంత్రాధ్వం. కళాధ్వంలో నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీత అని ఐదు విధాలైన కళలు ఉన్నాయి. భువనాధ్వంలో భద్రకాళి మొదలైన అనేక భువనాలు ఉన్నాయి. తత్త్వాధ్వంలో ప్రకృతి, పృథివి, బుద్ధి, మొదలైన 36 తత్త్వాలు ఉన్నాయి. వర్ణాధ్వంలో అం, ఆం, ఇం, ఈం మొదలు క్షం వరకు 51 వర్ణాలు ఉన్నాయి. పదాధ్వంలో మహాదేవ, సద్భావేశ్వర మొదలైన 81 పదాలు ఉన్నాయి. మంత్రాధ్వంలో సద్యోజాతం, వామదేవం, అఘోరం, తత్పురుషం, ఈశానం, హృదయం, శిరస్సు,

శిఖ, కవచం, నేత్రం, అస్త్రం అనే పదకొండు విధాలు ఉన్నాయి. (పారమార్థిక నిఘంటువు)

నాగేంద్రహారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ తస్మై నకారాయ నమఃశ్శివాయ
అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే

అను శివ, విష్ణు సంబంధమైన ప్రసిద్ధ శ్లోకాలలోనూ ఈ 'శుద్ధాయ' పద ప్రయోగం కనబడుతుంది.

**ఛందస్సు –** ఈ శ్లోకములోని ఛందస్సు ఉపజాతి. అది ఇంద్ర వజ్రోపేంద్ర వజ్రల కలగలుపు – తతజగగ – జతజగగ.

**నిరీశ్వరుడు :** మనకు రెండురకాల వ్యతిరేకార్థకాలు ఉన్నాయి. 1. కానిది 2. లేనిది. అజ్ఞానం అంటే విద్య కానిది. నిష్కారణం అంటే కారణం లేనిది.

విసర్గకు పరపదం శకార, చకారాలతో మొదలైతే నిః లోని విసర్గ శకార చకారాలుగా మారుతుంది. విసర్గకు పరపదం షకార, టకారాలు పరమయితే అది షకార, టకారాలుగా మారుతుంది. విసర్గకు సకార, తకారాలయితే అది సకారంగా మారుతుంది. విసర్గకు పరపదం క, ఖ, ప, ఫ అనే అక్షరాల్లో ఏదో ఒకదానితో మొదలయితే విసర్గకి షకారం ఆదేశ మవుతుంది. విసర్గకు పరపదం అచ్చులూ, అనునాసికాలతో పరమయితే ముందు విసర్గకి రేఫ (రకా రం) ఆదేశమౌతుంది. అందువలన నిః + ఈశ్వరుడు అన్నప్పుడు విసర్గకి రేఫాదేశం వచ్చి నిరీశ్వరుడు అని అయింది.



**శ్లో॥ కైలాసనామాఽద్రి వరోఽస్తి కశ్చి –**
**న్మహర్షిభిర్దేవగణైశ్చ సేవ్యః ।**
**తస్మింస్తు బిల్వద్రుమవేదికాయాం**
**సాహ్యస్థితాయ ప్రియయా నమస్తే ॥** 11

**ప్రతిపదార్థము :**కైలాసనామా = కైలాసమను పేరు కలిగిన; కశ్చిత్ = ఒకానొక; అద్రి

వరః = శ్రేష్ఠమయిన పర్వతమొకటి; అస్తి = ఉన్నది; తస్మిన్ = ఆ కైలాసములోని; బిల్వ ద్రుమ = బిల్వమను పేర్లు గలచెట్ల; వేదికాయామ్ = వేదికయందు; ప్రియయా = ప్రియురాలైన పార్వతీదేవితో; సాహ్యా = కూడా; స్థితాయ = ఉన్న, నిలుచున్న, నిశ్చయింపబడిన, ప్రతిజ్ఞ చేయబడిన వాడు (సంస్కృత – తెలుగు నిఘంటువు వావిళ్ల); మహర్షిభిః = గొప్ప ఋషులచేత; దేవ గణైః = అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్ర ప్రజాపతులు, అశ్వినీ దేవతలు, ద్వావాపృథ్వులు (ఆకాశము, నేల) అను దేవగణముల చేత; సేవ్యః = సేవింపదగినవాడయిన పరమశివునికి; నమస్తే = నమస్కారం.

**తాత్పర్యము :** కైలాసమను పేరు కలిగిన శ్రేష్ఠమయిన పర్వతమొకటి ఉన్నది. ఆ కైలాసములోని బిల్వద్రుమములవేదికయందు ప్రియురాలైన పార్వతీదేవితో ఉన్నవాడు, గొప్ప ఋషులచేత అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్ర ప్రజాపతులు, అశ్వినీ దేవతలు, ద్వావాపృథ్వులు (ఆకాశము, నేల) అను దేవగణముల చేత సేవింపదగినవాడయిన పరమశివునికి నమస్కారం.

**విశేషాలు :**

**1. మహర్షులు :** మరీచి, అత్రి, అఙ్గిరసుడు, పులస్త్య, పులహ, క్రతు, ప్రచేతస్, వసిష్ఠ, భృగు, నారద, ప్రజాపతి, దక్ష, ధర్మ, గౌతమ, కణ్వ, వాల్మీకి, వ్యాస, మను, విభాణ్డక మొ॥ ఋషులు.

**2. దేవగణాలు :** అష్ట వసువులు – ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు అని ఒక పట్టిక. వృషభుడు, నహుషుడు, జయుడు, అనిలుడు, విష్ణుడు, ప్రభాసుడు, ప్రత్యూషుడు, వరుణుడు అని ఇంకొక పట్టిక.

**ఏకాదశ రుద్రులు :** మొదటి పట్టిక: 1. వీరభద్రుడు, 2. శర్వుడు, 3. గిరీశుడు, 4. అజైకపాదుడు, 5. అహిర్బుధ్న్యుడు, 6. పినాకి, 7. స్థాణువు, 8. పశుపతి, 9. భవుడు, 10. ఉగ్రుడు, 11. త్విట్పతి / త్విషాంపతి.

రెండవ పట్టిక: 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శర్వుడు, 4. మృగవ్యాధుడు, 5. రంతి జుడు, 6. భిక్షకుడు, 7. అహిర్బుధ్న్యుడు, 8. పినాకి, 9. పాదుకేశ్వరుడు, 10. కాపాలికేయుడు, 11. భౌముడు.

మూడవ పట్టిక : 1. ఉగ్రుడు, 2. సోముడు, 3. శబరుడు, 4. మృగవ్యాధుడు, 5.

రంతిజుడు, 6. భిక్షకుడు, 6. అహిర్బుధ్న్యుడు, 7. పినాకి, 8. పాదుకేశ్వరుడు, 9. కాపాలికేయుడు, 10. భౌముడు. 11. అజుడు.

మరణ సమయంలో ఐదు జ్ఞానేంద్రియాలూ, ఐదు కర్మేంద్రియాలూ, మనస్సూ అనే మొత్తం పదకొండు ఇంద్రియాలూ ఏడిపిస్తాయి గనుక వాటిని ఏకాదశరుద్రులు అంటారు.

నాలుగవ పట్టిక: 1.అజుడు, 2. ఏకపాదుడు, 3. అహిర్బుధ్న్యుడు, 4. త్వష్ట, 5. రుద్రుడు, 6. హరుడు, 7. శంభుడు, 8. త్ర్యంబకుడు, 9. అపరాజితుడు, 10. ఈశానుడు, 11. త్రిభువనుడు.

ఐదవ పట్టిక : 1. అజైకపాత్, 2. అహిర్బుధ్న్యుడు, 3. విరూపాక్షుడు, 4. సురేశ్వరుడు, 5. జయంతుడు, 6. బహురూపుడు, 7. త్రయంబకుడు, 8. అపరాజితుడు, 9. వైవస్వతుడు, 10. సవిత్రుడు, 11. హరుడు.

**3. ద్వాదశాదిత్యులు :** అదితి సంతానం కనుక ఆదిత్యులు. వారు: మొదటి పట్టిక – వరుణుడు, సూర్యుడు, సహస్రాంశుడు, ధాత, తపనుడు, సవిత ృడు, గభస్తి, రవి, పర్జన్యుడు, త్వష్ట, మిత్రుడు, విష్ణువు. (దేవతలలో ముఖ్యులు ద్వాదశాదిత్యులని ఒక వాదం ఉంది.)

రెండవ పట్టిక ప్రకారం – అర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు. మూడవ పట్టిక – ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. నాలుగవ పట్టిక – మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్య, ఆదిత్య, సవితృడు (సవిత), అర్క, భాస్కరులు. ఈ పట్టికలలో చాలా పేర్లు అందులోనూ ఇందులోనూ కనిపిస్తాయి. ఒకటి రెండు పేర్లు తేడా ఉన్న పట్టికలు ఉన్నాయి. వాల్మీకి రామాయణం యుద్ధకాండలో రాముడికి అగస్త్యుడు ఉపదేశించిన 'ఆదిత్య హృదయం' స్తోత్రంలో ఈ పేర్లన్నీనూ, ఇవి గాక ఇంకా చాలానూ ఉన్నాయి. అన్నీ సూర్యుడి పేర్లే.

**4. ప్రజాపతులు :**

దశ–ప్రజాపతులు : సంకేత పదకోశము (రవ్వా శ్రీహరి) 2002 (అ.) నవబ్రహ్మలు (అ.), 10. వాయుదేవుడు (ఆ.) 1. మరీచి, 2. అత్రి, 3. అంగిరసుడు, 4. పులస్త్యుడు,

5. పులహుడు, 6. క్రతువు, 7. ప్రచేతసుడు, 8. వసిష్ఠుడు, 9. భృగువు, 10. నారదుడు. (మనుస్మృతి 1-35)

అష్టాదశ - ప్రజాపతులు : సంకేత పదకోశము (రవ్వా శ్రీహరి) : 1. కర్దముడు, 2. వికృతుడు, 3. శేషుడు, 4. సంశ్రయుడు, 5. బహుపుత్రుడు, 6. స్థాణుడు, 7. మరీచి, 8. అత్రి, 9. క్రతువు, 10. మహాబలుడు, 11. పులస్త్యుడు, 12. పులహుడు, 13. ప్రచేతసుడు, 14. దక్షుడు, 15. ఆంగీరసుడు, 16. వివస్వంతుడు, 17. అరిష్టనేమి, 18. కశ్యపుడు. (వా.రా. 3-14సర్గ)

ఏకవింశతి-ప్రజాపతులు : సంకేత పదకోశము (రవ్వా శ్రీహరి) 2002.

1. బ్రహ్మ, 2. స్థాణువు, 3. మనువు, 4. దక్షుడు, 5. భృగువు, 6. ధర్ముడు, 7. యముడు, 8. మరీచి, 9. అంగిరసుడు, 10. అత్రి, 11. పులస్త్యుడు, 12. పులహుడు, 13. క్రతువు, 14. వసిష్ఠుడు, 15. పరమేష్ఠి, 16. సూర్యుడు, 17. సోముడు, 18. కర్దముడు, 19. క్రోధుడు, 20. అర్వాకుడు, 21. ప్రీతుడు. (విద్యార్థికల్పతరువు)

5. వేదికా : వితర్ది.

**6. అష్ట బిల్వములు**

1. తులసి, 2. మారేడు, 3. వావిలి, 4. ఉత్తరేణు, 5. వెలగ (వీని పత్రములు) బిల్వపంచకము (5), 6. జమ్మి, 7. ఉసిరిక, 8. గరిక

**7. ఛందస్సు**

ఈ శ్లోకములోని ఛందస్సు ఉపజాతి. అది ఇంద్ర వజ్రోపేంద్ర వజ్రల కలగలుపు - తతజగగ - జతజగగ.

**8. కైలాస విశేషాలు :** కైలాస పర్వతం (మౌంట్ కైలాస్) సముద్ర మట్టానికి 21,778 అడుగుల (6,638 మీటర్లు) ఎత్తులో టిబెట్ భూభాగంలో ఉన్న హిమాలయా పర్వత శ్రేణుల్లో ఉంది.

ఒకవైపు సింహంగా (పార్వతి దేవి వాహనం), ఇంకోవైపు గుర్రంగా (హయగ్రీవ రూపం), మూడోవైపు ఏనుగుగా (విఘ్నేశ్వరుడు) నాలుగోవైపు నెమలిగా (కుమార స్వామి వాహనం) కైలాస పర్వతము కనిపిస్తుందని చూసి వచ్చినవారు చెబుతారు.

కైలాసపర్వతపాదపీఠంలో మానససరోవరం మరో అద్భుతం.

మానససరోవరం నుంచి కైలాస పర్వతాన్ని చూడవచ్చు. బ్రహ్మ తన మనస్సు నుంచి ఈ సరస్సును సృష్టించాడు. ఉదయం 3 నుంచి 5 గంటల మధ్యలో బ్రహ్మీ ముహూర్తంలో ఈశ్వరుడు ఈ సరస్సులో స్నానం చేస్తాడట. భక్తుల విశ్వాసం. కైలాసం మీదుగా సరస్సులోకి ఒక జ్యోతి ప్రవేశించటం మానససరోవర స్నానానికి వచ్చిన చాలా మందికి తెలిసిన విషయమే.



**శ్లో॥ హరాయ రుద్రాయ నమో నమస్తే**
**శివాయ భద్రాయ నమో నమస్తే ।**
**నవాయ పూర్ణాయ నమో నమస్తే**
**భవాయ భీమాయ నమో నమస్తే ॥ 12**

**ప్రతిపదార్థము :** హరాయ = ప్రళయ కాలమున సర్వమును హరించువానికి, భక్తుల పీడను హరించువానికి, అయస్కాంతము ఇనుమును ఆకర్షించునట్లు అందరు జీవులను ఆకర్షించువానికి (హృ హరణే); రుద్రాయ = సంసారదుఃఖము రుత్, దానిని పోగొట్టువాడు రుద్రుడు, ఆ రుద్రుని కొరకు; నమో నమస్తే = నమోనమః + తే = ఓ శివా! నీకు పూజ మరియూ నమస్కారము; శివాయ = శుభాలను ఇచ్చే శివుని కొరకు; భద్రాయ = శ్రేష్ఠుడైన వానికొరకు; నమోనమస్తే = ఓ శివా! నీకుపూజ మరియూ నమస్కారము; నవాయ = నుతింపదగిన వాడా! స్తోత్రార్హుడా! (అభిసూయత ఇత్యభినవః, నవశ్చ –ణు స్తుతౌ); పూర్ణాయ = సమస్తము నిండిన వాడా! శక్తి కలవాడా!; నమోనమస్తే = ఓ శివా! నీకు పూజ మరియూ నమస్కారము; భవాయ = అంతయూ తానయగువానికి (భవతి భవతే వా సర్వమితి భవః); భీమాయ = ముల్లోకములకు భయంకరుడైన వానికి (భీ భయే); నమోనమస్తే = ఓ శివా! నీకు పూజ మరియూ నమస్కారము.

**తాత్పర్యము :** భక్తుల పీడను హరించువానికి, సంసార దుఃఖము పోగొట్టువానికి, శుభాలను ఇచ్చే వానికి, శ్రేష్ఠుడైన వానికి, నుతింపదగిన వానికి, సమస్తము నిండిన వానికి, అంతయూ తానయగువానికి, ముల్లోకములకు భయంకరుడైన వానికి, ఓ శివా! నీకు పూజ మరియూ నమస్కారము.

**భాషా విశేషాలు :**

**1. రుద్ర :** రుద్రులు పదకొండు మంది. అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు,

త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు. రుద్రుడు అష్టమూర్తులలో ఒక్కడు. శివునికి నామాంతరము.

రుద్రుడు బ్రహ్మ పుత్రులలో ఒకడు. ఇతడు బ్రహ్మముఖములోనుంచి పుట్టాడు. బ్రహ్మ మొదట తాను పుట్టించిన సనకసనందనాదులు పరమయోగులై సృష్టికర్తలు కానందుకు బాగా కోపాన్ని వహించాడు. అప్పుడు ఆ కోపము రుద్రరూపములో అతనియొక్క భ్రూమధ్యములో నుంచి రోదనము చేయుచు పుట్టింది కనుక రుద్రుడు అను పేరు వచ్చింది.

ప్రళయ కాలములో ప్రాణులనేడిపించువాడు రుద్రుడు. అందరిలోను ప్రాణ రూపమున ఉండు వాడు రుద్రుడు. సంసార దుఃఖమురుత్. దానిని పోగొట్టువాడు రుద్రుడు.

**2. నమోనమః :** బ్రౌణ్య తెలుగు–ఇంగ్లీష్ నిఘంటువు 1903 “నమోనమః” కు – పూజ, అర్చన మరియు నమస్కారం, ప్రణామం అను అర్థాలను ఇచ్చింది. సమానార్ధకములు – భక్తి, విశ్వాసము, స్వామిభక్తి, దాసత్వము, పూజ, అర్చన, రాజభక్తి, విధేయత, ఆజ్ఞానువర్తన, వశవర్తన, వశీభూతత, పరాధీనత, పారతంత్ర్యము. ప్రసిద్ధమైన నమక మంత్రాలు నమో తో మొదలయి నమః తో ముగుస్తుంటాయి. “నమో వృక్షేభ్యో హరి కేశేభ్యః పశూనాంపతయేనమః” – ఆకుపచ్చరంగుగల కేశములుకలవాడు లేదా ఆకులరూపంలో కలిగిన సత్వ, రజః, తమో గుణములు ఆకులుగా కలిగిన సంసార వృక్ష రూపంలో ఉన్న పశువులకు ప్రభువయిన శివునికి నమస్కారము. (నమకం రెండవ అనువాకము). ఈ నమకాన్ని బాగా చదువుకొన్న చెఱువు వారు తన శ్లోకాన్ని కూడా అదే మంత్ర పద్ధతిలో నడిపించారు.

**3. శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు శివుడు. బ్రహ్మానంద స్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు.

**4. నవము :** ప్రణవ పదములోని నవ పదానికి శాస్త్రిగారు ఈ శ్లోకములో ప్రయోగించిన శివుని నుతిస్తూ ప్రయోగించిన నవ శబ్దానికి (నవాయ) దగ్గరి సంబంధముంది. ప్రణవ, పంచాక్షరీ మంత్రముల మహిమ – శివలోక వైభవమును వర్ణించు సందర్భములో శివమహాపురాణములోని పదిహేడవ అధ్యాయములో ఇలా ఉంది.

శ్లో॥ ప్రో హి ప్రకృతి జాతస్య సంసారస్య మహోదధేః ।
నవం నావాంతరమితి ప్రణవం వై విదుర్బుధాః ॥ 4

శ్లో॥ ప్రః ప్రపంచో న నాస్తి వో యుష్మాకం ప్రణవం విదుః ।
ప్రకర్షేణ నయేద్యస్మాన్మోక్షం వః ప్రణవం విదుః ॥ 5

ఈ ప్రకృతి నుంచి పుట్టిన సంసార మహాసముద్రానికి 'ప్రః' అని పేరు ఉంది. ఓంకారము దీనిని దాటించే నావ గనుక ప్రణవము (ప్ర + నవ) అని పేరు వచ్చిందని పండితులు చెబుతున్నారు (4).

ఓంకారమునకు ప్రణవమను పేరు ప్రః = ప్రపంచము; న = లేదు; వః = మీకు, అను అర్థమును అనుసరించి కలిగినది. ప్ర = నిశ్చయముగా; న = (మోక్షమునకు) నడిపించును; వః = మిమ్ములను, అను అర్థములో కూడ ఓంకారాన్ని ప్రణవమంటారు. (5). ప్రణవములోని నవ పదానికి పైన చెప్పిన అర్థాలు శివునికి కూడా సమన్వయిస్తాయి.



**శ్లో॥ వరాయ వర్యేషు వరావరాయ వై -**
**గణేశతాతాయ కపాలధారిణే ।**
**సురాసురాణాం వరదాయినేఽయినే -**
**నమో నమస్తేఽస్తు నమో నమోస్తు తే ॥ 13**

**ప్రతిపదార్థము :** వరాయ = శ్రేష్ఠుని కొరకు; వర్యేషు = ముఖ్యులైన వారియందు; వరావరాయ వై = శ్రేష్ఠాతిశ్రేష్ఠునకు; గణేశతాతాయ = వినాయకుని తండ్రికొరకు; కపాలధారిణే = కపాలమును ధరించిన వానికొరకు; సురా సురాణామ్ = దేవతలకు, రాక్షసులకు; వరదాయినే = వరములు ఇచ్చు వానికొరకు; అయినే = భక్తుల మనస్సులకు దగ్గరగా ఉండి, కార్యములను శీఘ్రముగా చేయించే వానికి; నమో నమస్తేస్తు = నమస్సులు. నమస్సులు ఉండుగాక!; నమో నమోస్తు తే = నీకు నమస్కారము.

**తాత్పర్యము :** శ్రేష్ఠుని కొరకు, ముఖ్యులైన వారియందు, శ్రేష్ఠాతిశ్రేష్ఠునకు, వినాయకుని తండ్రికొరకు, కపాలమును ధరించిన వానికొరకు; దేవతలకు, రాక్షసులకు, వరములు ఇచ్చు వానికొరకు, భక్తుల మనస్సులకు దగ్గరగా ఉండి, కార్యములను శీఘ్రముగా చేయించే వానికి నమస్సులు! స్తోత్రము చేయబడువాడా! ఓ శివా! నమస్కారము.

**విశేషాలు :**

1. "వై" అనునది సంస్కృతములో పాదపూరణము కొరకు; ముందరి పదాన్ని నిశ్చయమని నొక్కి చెప్పుట కొరకు వాడతారు. శివుడు శ్రేష్ఠాతిశ్రేష్ఠుడని నొక్కి చెప్పటానికి "వై" ను శాస్త్రిగారు ఈ శ్లోకంలో వాడారు.

2. శ్రీరాముడు శయనించిన భవనములను వివరించుచూ "ప్రాసాద వర వర్యేషు" అన్నాడు వాల్మీకి. (అయోధ్య కాండ88వ సర్గ 07వ శ్లోకం) వరశబ్ద ద్విరుక్తి శ్రేష్ఠతను ఎక్కువ చేసి చెప్పటానికి. వాల్మీకిని, శాస్త్రిగారు "వర్యేషు వరావరాయ " అను చోట అనుసరించారు. "వరదో వరః" అని శివసహస్రనామము కూడా శివుడిని వర శబ్దముతో సంబోధించింది.

3. ఈ శ్లోకం వంశస్థ వృత్తానికి చెందినది. వంశస్థ వృత్తములో12 అక్షరములు ఉంటాయి. లేదా 18 మాత్రలు. 4 పాదములు

4. ప్రతి పాదములోను జ , త , జ , ర గణములుంటాయి.
జ త జ ర
| U | U U | | U | U | U
వ రా య వ ర్యే షు వ రా వ రా య వై

5. తైత్తిరీయ సంహితను ఉదాహరిస్తూ Monier William's Sanskrit - English Dictionary, (2 nd Ed. 1899) నిఘంటువు "ఆయిన్" పదానికి coming or hastening near (ప్రవేశించువాడు, దగ్గరగా శీఘ్రముగా చేయించు) అను అర్థాలను ఇచ్చింది. శివుడు కూడా తనను నమ్ముకొన్న భక్తుల మనస్సులకు దగ్గరగా ఉండి , కార్యములను శీఘ్రముగా చేయించే వాడే కదా!



**శ్లో॥ దివ్యవపుర్ధర! దేవ! మహాత్మన్!**
**భవ్య! పరాత్పర! భావితభూమన్ ।**
**హైమవతీప్రియ! వైష్ణవబంధో**
**నౌమి సదా తవ పాదసరోజే ॥ 14**

**ప్రతిపదార్థము :** దివ్య వపుర్ధర! = ఓ శివా! ఒప్పునట్టి చక్కటి శరీరము కలవాడా!;

దేవ! = మా మనస్సులలో క్రీడించే వాడా! (దీవ్యతీతి దేవః –); మహాత్మన్! = పూజింప బడువాడా! గొప్పవాడా! (మహత్ + అత్మన్ = మహపూజాయాం– ); భవ్య! = పుట్టుటకు అర్హమైన శుభము కలవాడా! (భవనార్హం – భవ్యం); పరాత్పర! = శ్రేష్ఠుల కందరికి శ్రేష్ఠుడా!; భావితభూమన్ = పొందబడిన ఐశ్వర్యము కలవాడా! (భావ్యతేస్మ భావితం – భూప్రాపావాత్మనేపదీ); హైమవతీప్రియ! = హిమవంతుని కుమార్తె అయిన పార్వతికి ఇష్టమయిన వాడా!; వైష్ణవ బంధో = విష్ణు భక్తులకు బంధువా!; తవ = నీయొక్క; పాద సరోజే = పాద పద్మములయందు; సదా = ఎప్పుడూ; నౌమి = నమస్కరించు చున్నాను.

**తాత్పర్యము :** ఓ శివా! చక్కటి శరీరము కలవాడా! మా మనస్సులలో క్రీడించే వాడా! పూజింపబడువాడా! శుభము కలవాడా! శ్రేష్ఠుల కందకి శ్రేష్ఠుడా! పొందబడిన ఐశ్వర్యము కలవాడా! హిమవంతుని కుమార్తె అయిన పార్వతికి ఇష్టమయిన వాడా! విష్ణు భక్తులకు బంధువా! నీయొక్క పాద పద్మములకు ఎప్పుడూ నమస్కరించుచున్నాను!

**విశేషాలు :**

**1. ఛందస్సు**

భ భ భ గా

U | | U | | U | | U U

ది వ్య వ పు ర్ధ ర దే వ మ హా త్మన్

ఈ శ్లోకం దోధక వృత్తానికి చెందినది.

తోధక, తోదక, తోటక, తరంగక, బందు, భిత్తక అనే ఇతర పేర్లు దీనికి ఉన్నాయి.

11 అక్షరములు ఉండును. 4 పాదములు ఉండును.

ప్రతి పాదమునందు భ , భ , భ , గా(గగ) గణములుండును.

**2. దివ్య** అనునది ఒక విశేషణము.స్వర్గ సంబంధమైన, దేవతా సంబంధమయిన, ఆశ్చర్య కరమయిన అని దివ్య పదానికి అర్థాలు.

**3. "మహాత్మన్"** విశిష్టమయిన పదముల కూడిక. *High-souled, magnanimous, having a great or noble nature, high-minded, noble highly gifted, exceedingly wise Pancat.eminent, mighty, powerful, distinguished* అని *Monier*

William's Sanskrit-English Dictionary లో ఈ పదానికి అర్థాలున్నాయి. (2nd Ed. 1899)

జ్వాలోగ్రస్సకలామరాతి-భయదః క్ష్వేలః కథం వా త్వయా
దృష్టః కిం చ కరే ధృతః కర-తలే కిం పక్వ జంబూ-ఫలమ్ ।
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధ-ఘుటికా వా కంఠ-దేశే భృతః
కిం తే నీల-మణిర్విభూషణమయం శంభో మహాత్మన్ వద ॥

(శివానందలహరి32)

(ఓ శంభో! మహాత్మా! భయంకరమైన జ్వాలలతో కూడి దేవతలందరను ఎక్కువ భయమునకు గురిచేసిన హాలాహలమును నీవు ఎలా చూశావు? చేతితో ఎలా పట్టుకొన్నావు? అది ఒక నేరేడు పండా? గొంతులో ఎల వేసికొన్నావ్? అది ఔషధ గుళికా? లేక నీలమణి ఆభరణమా? చెప్పవయ్యా!) అను శ్లోకములో శివుడిని శంకరులు "మహాత్మన్" అని సంబోధించారు. చెఱువు వారిది కూడా ఇదే శంకర మార్గం.

**4. పరాత్పర :** ఈ పరాత్పర పదము సాహిత్యంలో సుప్రసిద్ధమైనది. పరాత్పర రఘువర నిన్ను నెరనమ్మితిర పరమదయాకర (మైసూర్ వాసుదేవాచార్య); శుద్ధ బ్రహ్మ పరాత్పర రామా కాలాత్మక పరమేశ్వర రామా( రామదాసు); పరమపురుష హరి పరమ పరాత్పర పరరిపుభంజన పరిపూర్ణ నమో (అన్నమయ్య); నమస్తే పార్వతీనాథ! దేవదేవ! పరాత్పర! (భగీరథుడు చేసిన 'శివస్తుతి').

**5. భూమన్ :**

జయానంద భూమన్ జయాపారధామన్
జయామోఘకీర్తే జయానందమూర్తే ।
జయానందసింధో జయాశేషబంధో
జయ త్వం సదా ముక్తిదానేశసూనో ॥

అని శంకర భగవత్పాదుల వారి శ్రీ సుబ్రహ్మణ్యభుజంగస్తవములో **'భూమన్'** శబ్దం ఎంత అందంగా ప్రయోగించబడిందో, చెఱువు వారి శ్లోకములోను భూమన్ ప్రయోగము అంత అందంగా ఉంది.

**6. వైష్ణవబంధో :** విష్ణుభక్తులకు బంధువా! అను చెఱువు వారి శివసంబోధన వారి అద్వైతదృష్టికి నిదర్శనం. ఆదిశంకరుల వారికి – "అంతశ్శాక్తః బహిశ్శైవః సభాయాం

వైష్ణవోత్తమః (హృదయం లోపల శక్తి. బయటకు శివుడు. సభలో విష్ణుభక్తులలో ఉత్తముడు) అని పేరు ఉండేదట! శ్రీరాముడు అగస్త్యమహర్షి ద్వారా " విరజాదీక్ష" ను స్వీకరించి, భస్మోద్ధూళితాం గుడై శివధ్యానంలో గడిపాడని "పద్మ పురాణం". శ్రీకృష్ణుడు ఉపమన్యుమహర్షివలన శివదీక్షను పొందినట్లు మహాభారతంలో ఉంది. ఇలా మన గ్రంథాలలో కొన్ని చోట్ల శివాధిక్యము, కొన్నిచోట్ల విష్ణ్వాధిక్యము ఉన్నది'. **"శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయం శివః"** అని శివ విష్ణువుల ఐక్యం ప్రతిదినమూ సంధ్యావందనంలో చెప్పుకుంటూ ఉంటాము. శివ విష్ణువుల మధ్య తేడాలేదు. హరిహరుడూ రామలింగడూ, రామేశ్వరుడూ, శంకరనారాయణుడూ, అనే పేరులుకూడా ఈ అభేదాన్ని చెబుతున్నాయి.

హరునిలో హరిc జూచి, హరియందు హరుc జూచి
వెది దేవతలు విస్మితులు, మునులెల్ల
రధిగతానంద భావావేశచేతస్కు
లెదవిచ్చి యుప్పొంగి, యెగిరి స్తోత్రము సేయ
భేదవాదములెల్ల బ్రిదిలిపోవగ సర్వ
మేదినియు నద్వైతమే బ్రతిధ్వనులీన

– శివుడిలో విష్ణువుని, విష్ణువులో శివుడిని చూసిన దేవతలు ఆశ్చర్యపోయారు. మునులు స్తోత్రాలు చేసారని పుట్టపర్తి వారి శివ తాండవము. ఈ అద్వైతము చెఱువు వారిలోనూ ఉంది.

**శ్లో॥ ఈశ్వరాయ జగతామధిశ్రియే**
**శంకరాయ కలుషాపహారిణే ।**
**భాస్వరాయ భవతే భవచ్ఛిదే**
**వందనాని కురుతేఽయమర్భకః ॥ 15**

**ప్రతిపదార్థము :** ఈశ్వరాయ = ఈశ్వరుని కొరకు; జగతామ్ = లోకములయొక్క; అధిశ్రియే = శోభకు, లక్ష్మికి పైన ఉన్నవానికొరకు (లోకములలోని శోభ కంటె మించిన శోభ శివునిలో ఉన్నదని భావం); శంకరాయ = సుఖమును కలుగజేయువానికొరకు; కలుషాపహారిణే = కలుష + అపహారిణే = పాపములను పోగొట్టువానికి; భాస్వరాయ = ప్రకాశించువానికి; భవతే = ఓ శివా! నీకొరకు; భవచ్ఛిదే = సంసారబంధాన్ని తెంచి వేసుకోవడం భవచ్ఛేదం – అలా తెంచుకొనేటట్లు చేసే నీ కొరకు; అయమర్భకః

= అయమ్ + అర్భకః = ఈ ఎనిమిదేళ్ల బాలుడు; వందనాని = నమస్కారములు; కురుతే = చేయుచున్నాడు.

**తాత్పర్యము :** ఈశ్వరుని కొరకు, లోకములయొక్క లోకములలోని శోభ కంటె మించిన శోభ కలవానికొరకు, సుఖమును కలుగజేయువానికొరకు, పాపములను పోగొట్టువానికి, ప్రకాశించువానికి, సంసారబంధాన్ని తెంచి వేయువానికొరకు, ఓ శివా! నీకొరకు ఈ ఎనిమిదేళ్ల బాలుడు నమస్కారములు చేయుచున్నాడు.

**విశేషాలు :**

1. ఈ శ్లోకము రథోద్ధత వృత్తానికి సంబంధించినది.

రథోద్ధతము లక్షణములు : మొత్తం 11 అక్షరములు. నాలుగు పాదాలు. ప్రతి పాదములో ర , న , ర , వ(లగ) గణాలుంటాయి.

**2. ఈశ్వర :** ఈశ = ఐశ్వర్యే – అనువిష్టేచ – ఈశ్ + వరచ్.

సర్వాంతర్యామి అయిన భగవంతుడు ఈశ్వరుడు. ఈపేరు సాధారణముగ సగుణబ్రహ్మ స్వరూపమును చెబుతుంది.

**3. అర్భకుడు.–** ఈ పదానికి సాధారణంగా శిశువు. దుర్బలుడు. మూఢుడు అను అర్థాలు ఉన్నాయి. ఋ = గతౌ ప్రాపణేపిచ – ఆర్యతే వృద్ధిం ప్రాప్యతే ఇతి – ఋ + కన్ – ధాతోః భకారః అంతాగమః నిపాతితః. (ఔణా.) వృద్ధినొందింపబడువాడు కనుక అర్భకుడు. ఆంధ్ర వాచస్పత్యము (కొట్ర శ్యామలకామశాస్త్రి) 1953 పదునాఱేండ్లకు లోబడిన పిల్లవాడు అను అర్థాన్ని అర్భక పదానికి ఇచ్చింది.

**4. అధిశ్రియే :** అధి అనునది ఒక ఉపసర్గ. దీనికి విడిగా ప్రయోగము లేదు. ఈ క్రింది అర్థాలను చెబుతుంది.

ఆధిక్యము – "అధిదంతము; అధిమాసము" అతిశయము. (అధీశ్వరుడు) పై భాగము. "అధిజిహ్వక; అధిత్యక." – వావిళ్ల నిఘంటువు 1949.

సంస్కృత మహాభాగవతములో అధ్యక్ష (అధి, అక్ష) పద ప్రయోగాన్ని వ్యాసుడు చాలా అందంగా ప్రయోగించాడు. న వయం భగవన్విద్మస్తవ దేవ చికీర్షితమ్ – కృతో మేఽనుగ్రహశ్చేతి యదధ్యక్షః ప్రభాషసే (శ్రీమద్భాగవతం తృతీయ స్కంథం పదహారవ అధ్యాయం – 16 వ శ్లోకం) ఓ విష్ణుదేవా! మీరేమి చేయాలనుకుంటున్నారో మాకు

తెలియుట లేదు. "మీరు ఒప్పుకుంటే మమ్మలిని అనుగ్రహించినట్లే" మీరు అధ్యక్షులు – అక్షం అంటే ఇంద్రియం. అక్షములకు అధి, అంటే ఇంద్రియాలకు అవతల – పైన ఉన్నవారు మీరు.

ఋగ్వేదము (మండలము6 – సూక్తము63)లో "అధిశ్రియే" అను ప్రయోగము కనబడుతోంది. మయూరమహాకవి సూర్యశతకములో "ఉజ్జృమ్భామ్భోరుహాణాం ప్రభవతి పయసాం యా శ్రియే నోష్ణతాయై" (39 వ శ్లోకం) అన్నాడు. ఈ అధి, శ్రీ శబ్దాల ప్రయోగాలను బాగా చదువుకొన్న శాస్త్రిగారు శివుని పరంగ "అధిశ్రియే" అని ప్రయోగించారు.

అంత చిన్న వయస్సులో అర్భకుడిని అని వినయంగా అంటూ వేదాలలో ఉన్న ప్రయోగాన్ని ప్రయోగించటం సామాన్య విషయం కాదు. నమో నమః.



**శ్లో॥ త్ర్యంబకాయ విభవేఽష్టమూర్తయే**
**శంభవే చ జటిలాయ శూలినే ।**
**స్థాణవే గిరిచరాయ నాణవే**
**వందనాని కురుతేఽయమర్భకః ॥ 16**

**ప్రతిపదార్థము :** త్ర్యంబకాయ = త్రి + అంబకాయ = మూడు కన్నులు కలవాని కొరకు (అంబకము అనగా కన్ను, బాణము. బాగా దూరము పోతుంది కనుక కన్నుకి, బాణానికి అంబకము అని పేరు వచ్చింది. అభి గతౌ); విభవే = కార్యసిద్ధిలో సమర్థమైనది విభవము (ధనము), విభవము కలవాని కొరకు; అష్టమూర్తయే = ఎనిమిది రూపములు కలవానికొరకు; శంభవే చ = సుఖము కలిగించువానికొరకు (సుఖరూపియైన వాని కొరకు); జటిలాయ = జడలుగల సన్యాసి కొరకు; శూలినే = శూలము ధరించిన వాని కొరకు; స్థాణవే = స్థిరమైనవాని కొరకు (ప్రళయమునందు ఉండువానికొరకు); గిరి చరాయ = కైలాసపర్వతమునందు తిరుగువానికి (భూమిని రక్షించేది గిరి. కాలేన గీర్యత గిరిః – అటువంటి కైలాస గిరిలో తిరిగేవాడు); నాణవే = న + అణవే = అణువు కాని వానికొరకు (మిక్కిలి చిన్నది అణువు. అణుత్వాత్ అణుః. అది కాని వాడు నాణువు.); అయమర్భకః = అయమ్ + అర్భకః = ఈ ఎనిమిదేళ్ల బాలుడు; వందనాని = నమస్కారములు; కురుతే = చేయుచున్నాడు.

**తాత్పర్యము :** మూడు కన్నులు కలవాని కొరకు, సంపద కలవాని కొరకు, ఎనిమిది రూపములు కలవానికొరకు, సుఖము కలిగించువానికొరకు, జడలుగల సన్న్యాసి కొరకు, శూలము ధరించిన వాని కొరకు, స్థిరమైనవాని కొరకు, కైలాస పర్వతమునందు తిరుగు వానికి, అణువు కాని వానికొరకు, ఈ ఎనిమిదేళ్ల బాలుడు నమస్కారములు చేయుచున్నాడు.

**విశేషాలు :**

1. ఈ శ్లోకము రథోద్ధత వృత్తానికి సంబంధించినది. నాలుగు పాదాలు. ప్రతి పాదములో ర , న , ర , వ(లగ) గణాలుంటాయి.

2. అష్టమూర్తుల వివరణ : 1. సూర్యుడు, 2. జలము, 3. పృథివి, 4. వాయువు, 5. వహ్ని, 6. ఆకాశము, 7. దీక్షిత బ్రాహ్మణుడు, 8. చంద్రుడు (ఇవి శంకరుని మూర్తులు). సంకేత పదకోశము (రవ్వా శ్రీహరి) 2002.

"సూర్యో జలం మహీ వాయుర్వహ్నిరాకాశమేవ చ
దీక్షితో బ్రాహ్మణః సోమ ఇత్యేతాస్తనవః" –విష్ణుపురాణము

1. శిలామయి, 2. దారుమయి, 3. లోహమయి, 4. లేప్య, 5. లేఖ్య, 6. సైకతి, 7. మనోమయి, 8. మణిమయి – ఇవి విగ్రహములో ఎనిమిది భేదములు.

"జాతవేదాః సప్తజిహ్వో హవ్యవాహస్తతః పరమ్, వైశ్వానరోఽశ్వోదర జస్తథా దేవముఖః పరః, కౌమారతేజ స్తదను మూర్తిర్విశ్వముఖోఽష్టమీ" – ఇవి ఎనిమిది అగ్నిమూర్తులు – శివతత్త్వరత్నాకరము164పే.

1. సదాశివుడు, 2. మహాదేవుడు, 3. కపాలి, 4. నీలలోహితుడు, 5. స్థాణువు, 6. సాంబుడు, 7. శంకరుడు, 8. దక్షిణామూర్తి.

"సదాశివో మహాదేవః కపాలీ నీలలోహితః, స్థాణుః సాంబః శంకరాఖ్యో దక్షిణామూర్తి సంజ్ఞితః, ఏతేఽష్టమూర్తయః" – శివతత్త్వరత్నాకరము 112పు.

1. శర్వుడు, 2. పశుపతి, 3. రుద్రుడు, 4. భవుడు, 5. ఈశ్వరుడు, 6. మహాదేవుడు, 7. భీముడు. 8. ఉగ్రుడు" శర్వః పశుపతిశ్చోగ్రో రుద్రశ్చ భవ ఈశ్వరః, మహాదేవో భీమ ఇతి మూర్తయోఽష్టౌ వసంతి హి"– శివతత్త్వరత్నాకరము 172 పు.

3. బ్రహ్మ యొక్క భ్రూమధ్యము నుండి వెలువడిన రుద్రుని యొక్క రూపములు అష్టమూర్తులు. ఈ అష్టమూర్తులకు వేర్వేరు పేర్లు, స్థానములు ఉన్నాయి.

నామము స్థానము లేక– రూపము భార్య పుత్రుడు
భవుడు జలము ఉష శుక్రుడు
శర్వుడు మహి సుకేశి అంగారకుడు
ఈశానుడు వాయువు శివ హనుమంతుడు
పశుపతి వహ్ని స్వాహ స్కందుడు
భీముడు ఆకాశము దిశ స్వర్గము
ఉగ్రుడు స్వధర్మనిష్ఠుడైన బ్రాహ్మణుడు దీక్ష సంతానుడు
మహాదేవుడు సోముడు రోహిణి బుధుడు
రుద్రుడు సూర్యుడు సువర్చల శనైశ్చరుడు

4. లలితా సహస్రనామాలలో ఆరువందల అరవైరెండవ నామము (662) 'అష్టమూర్తిః' ఈ శబ్దానికి వివిధ గ్రంథాలలో వివిధ వ్యాఖ్యలు ఉన్నాయి. (భాస్కరరాయల వ్యాఖ్యానం అందులో ఒకటి). గుణ భేదం చేత ఆత్మ ఎనిమిది రకాలు – జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానరూపాత్మ, మహాత్మ, భూతాత్మ. (యోగ శాస్త్రం). భూమి, ఆపస్సు (నీరు), అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం. అష్టమూర్తులు (భగవద్గీత) పారమార్థిక పదకోశం (పొత్తూరి వేంకటేశ్వరరావు) 2010. అష్ట మూర్తులుగా ఇన్నింటిని చెప్పినప్పటికీ 1. సూర్యుడు, 2. జలము, 3. పృథివి, 4. వాయువు, 5. వహ్ని, 6. ఆకాశము, 7. దీక్షిత బ్రాహ్మణుడు, 8. చంద్రుడు అను ఎనిమిది శివుని అష్టమూర్తులుగా ప్రసిద్ధి.

**5. నాణవే :** "నమః పాగ్ంమసవ్యాయ చ రజస్యాయ చ" అని నమక మంత్రము. (తొమ్మిదవ అనువాకం ఎనిమిదవ మంత్రము) కనిపించని పరమాణువులలో ఉన్నవాడును, కనిపించే దుమ్ము ధూళిలో ఉన్నవాడు – ఇద్దరూ శివుడే. అందుకే అణువు కానివానిగా నాణవే అని ప్రయోగించారు శాస్త్రి గారు.

అర్ధనారీశ్వరునిగా మోహము కలవానిగా శివుడు కనబడుతున్నప్పటికీ, యతులు, సంన్యాసులు అందుకోలేని దూరములో ఉన్నవాడని కాళిదాసు మాళవికాగ్నిమిత్ర నాటకములో వివరించాడు (పూర్తి వివరాలకు శ్రీ రావి మోహనరావు

గారు ప్రచురించిన నా "శ్రీ శివమంగళాచరణసురభి" పుస్తకములో 76వపేజీ). అందుచేతనే శివుని జటిలునిగా – సంన్యాసిగా చెఱువువారు ఇందులో వర్ణించారు. శివయ్య లీలలు అంతుబట్టనివి. ఆయన రూపాలు, నామాలు కూడా.



**శ్లో॥ బ్రహ్మమూర్ధముకుటాయ మృడాయ**
**ప్రాక్తనాయ పరమాయ నవాయ ।**
**పాండురాయ వటుకాయ శివాయ**
**బ్రాహ్మణాయ కరవాణి నమాంసి ॥ 17**

**ప్రతిపదార్థము :** బ్రహ్మ = ప్రజలను వృద్ధి బొందించు బ్రహ్మకు, (నవబ్రహ్మలు – భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, మరీచి. ); మూర్ధ ముకుటాయ = తలపయి కిరీటమువంటి వాడా! (దేనిచేత అలంకరింప బడునో అది మకుటము / ముకుటము); మృడాయ = భక్తులను సంతోష పెట్టువాని కొరకు; ప్రాక్తనాయ = పురాతనమైన వానికొరకు; పరమాయ = శ్రేష్ఠుడైన వానికొరకు; నవాయ = ఎప్పటికప్పుడు భక్తులకు కొత్తగా కనిపించువానికొరకు; పాండురాయ = తెల్లనిరంగు కలవానికొరకు (తెలుపురంగులో మనస్సు కుదిరిపోతుందట. అందుకే దానికి పాండురము అని పేరు); వటుకాయ = బ్రహ్మచారిస్వరూపము ధరించినవాని కొరకు; శివాయ = శివునికొరకు; బ్రాహ్మణాయ = వేదభాగవేత్తకొరకు (బ్రాహ్మణ స్వరూపునికొరకు); నమాంసి = నమస్కారములు; కరవాణి = చేయుదును(కరవాణి– కరవావ– కరవామ – కృ– ఉభయ)

**తాత్పర్యము :** ప్రజలను వృద్ధి బొందించు బ్రహ్మకు తలపయి కిరీటమువంటి వానికొరకు, భక్తులను సంతోష పెట్టువానికొరకు, పురాతనమైన వానికొరకు, శ్రేష్ఠుడైన వానికొరకు, ఎప్పటి కప్పుడు భక్తులకు కొత్తగా కనిపించువానికొరకు, తెల్లనిరంగు కలవానికొరకు, బ్రహ్మచారి స్వరూపము ధరించిన వాని కొరకు, శివునికొరకు, వేదభాగముల స్వరూపమైన వానికి (బ్రాహ్మణ స్వరూపునికొరకు), నమస్కారములు చేయుదును.

**విశేషాలు :**

1) బ్రహ్మ / బ్రహ్మము : వేదాంత వాఙ్మయం యావత్తు బ్రహ్మ, ఆత్మ అనే రెండు పదాలు కేంద్ర బిందువుగా విస్తరించింది. అందులో బ్రహ్మ అంటే కొన్ని నిర్వచనాలు,

బ్రహ్మ పదానికి పర్యాయ పదాలు, బ్రహ్మ / బ్రహ్మనామాలు పదాలకు అర్థ వివరణలు ఉన్నాయి.

"సాంగ వేదార్థ వాచస్పతి" శ్రీ ఉప్పులూరి గణపతి శాస్త్రి తమ "వేదసార రత్నావళి" ద్వితీయ భాగంలో బ్రహ్మస్వరూప లక్షణాలను చర్చించారు. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" (తైత్తిరీయోపనిషత్తు) అనే శ్రుతి వాక్యాన్ని ఉదహరించి ఇందులోని సత్యం, జ్ఞానం, అనంతం అనే పదాలు మూడున్నూ కూటస్థం, చిద్రూపం, అద్వితీయం అగు (మూడూ కలసి) బ్రహ్మను గురించి చెపుతున్నాయన్నారు.

ఐతే, ఈ ఒక్కొక్కటీ ప్రత్యేకంగా బ్రహ్మను గురించి చెబుతున్నాయనే ఒక వాదం ఉంది. (కౌటస్థమేవ సత్యత్వం స్ఫురణం జ్ఞానముచ్యతే / అనంత్యమేకతా చైవం బోధ్యతే బ్రహ్మ త్రై స్త్రిభిః) సత్య జ్ఞానాది శబ్దాలు సూచించే సత్యత్వాది ధర్మాలు బోధ రూపమైన బ్రహ్మకు ఉపలక్షకాలు (లక్షకం అంటే లక్ష్యార్థాన్ని తెలిపే శబ్దం) అవుతాయనీ, కనుక బోధకాలు అవుతాయనీ శాస్త్రిగారి వివరణ. "అసంగో హ్యాయం పురుషః"లాంటి శ్రుతి వాక్యాలకు ఇది విరుద్ధం కాదని ఆయన స్పష్టం చేశారు. విద్యారణ్య భాష్యంలో "పురుష భ్రమలు బహు విధాలు కనుక అన్ని భ్రమలను తొలగించడానికి చాలా లక్షణాలను చెప్పవలసివచ్చింది" అని చెప్పిన వాక్యాన్ని ఆయన ఇక్కడ తమ అభిప్రాయానికి సమర్ధనగా పేర్కొన్నారు.

భట్ట భాస్కర రుద్రాధ్యాయ భాష్యం ప్రకారం ఓమ్, స్వాహా, స్వధా, వషట్, నమః అనే ఐదూ బ్రహ్మ నామాలు. ఆత్మభువు, సుర జ్యేష్ఠుడు, హిరణ్య గర్భుడు, అబ్జయోని, వేధ, స్వయంభువు మొదలైన చాలా పేర్లు ఉన్నాయి. వేదం. జ్ఞానం. తత్త్వం. అధ్యాత్మం. మూల ప్రకృతి బ్రహ్మము. జగత్తు దేని నుంచి జన్మిస్తున్నదో, దేని చేత మనగలుగుతున్నదో, దేనిలో లయిస్తున్నదో అది బ్రహ్మతత్త్వం.

సమస్త జీవరాశిలో వ్యక్తమయ్యే చైతన్యం. సమస్త ప్రపంచానికి నిజరూపం ఏదో అది. శాస్త్రానికి కారణమైనదీ, తన అనుభూతికి శాస్త్రం కారణంగా కలిగినదీ సర్వశక్తి సంపన్నం. పరమాత్మ. రెండు కానిదీ, మనస్సుకూ, వాక్కుకూ అందనిదీ, సత్తామాత్రమైన ఆత్మ స్వస్వరూపం. అఖండ, అద్వితీయ సచ్చిదానంద పదార్థం. ఇది కాదు, ఇది కాదు... స్థూలం కాదు, సూక్ష్మం కాదు – ఇలా చెప్పడానికి ఆస్కారం కలిగిన లక్షణాలకు ఏది లక్షితమో ఆ ఔపనిషద్ తత్త్వం. క్షుత్తు, పిపాసలకు, ఇలాంటి

ఇతర సహజ లక్షణాలకు అతీతమై, సర్వత్రా నిండి ఉన్న ఆత్మ స్వస్వరూపం. కార్యం గానీ, కారణం గానీ కానిది. వివిధ మతాలకు ఏది లక్ష్యమో అది. విశ్వస్వరూపుడు, విశ్వాధారుడు. నిరుపాధిక చైతన్యం. వ్యష్టి, సమష్టి, స్థూల, సూక్ష్మ, కారణ రూపాలేవీ లేని శుద్ధ చైతన్యం. ఇలా ఎన్నో నిర్వచనాలు బ్రహ్మస్వరూపానికి ఉన్నాయి. (ఆధారం పారమార్థిక పదకోశం పొత్తూరి వేంకటేశ్వరరావు 2010)

చెఱువు వారు ఇటువంటి బ్రహ్మకు / బ్రహ్మమునకు కిరీటమువంటివానిగా శివుని పేర్కొన్నారు. కామేశ్వరుడు అని ఒకాయన ఉన్నాడు. మంత్రశాస్త్ర ప్రకారం కామేశ్వరుడు త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, శివులకుపైగా. నిష్క్రియుడుగా, నిస్సంగిగా ఉంటున్నాడు.

పరాశక్తియైన కామేశ్వరి కామేశ్వరుని వామభాగంలో ఎరుపురంగుతో ఉంటుందట. ఆధ్యాత్మిక సాంకేతికాలు ఒక పట్టాన తెగవు. బ్రహ్మ / బ్రహ్మము వేరు, విష్ణువు వేరు, శివుడు వేరు, అమ్మవారు వేరు – అని భావించినప్పుడు ఈ చిక్కులు. బ్రహ్మకంటె శివుడు గొప్పవాడు, బ్రహ్మకు కిరీటమువంటివాడు అని పేర్కొనుట భక్తిలోని ప్రాథమిక స్థాయి.

**తెల్లటి తెరమీద చలన చిత్రము ఆడుతున్నప్పుడు– చిత్రము వెనకాల ఉన్న తెలుపురంగును అన్వేషించే స్థాయి భక్తిలోని ఉదాత్తతకు గుర్తు.** ఉన్నది ఒకటే. ఏ మంత్రోపాసన చేస్తే, ఎలా భావిస్తే ఒకటే అయిన దేవత / దేవుడు ఆరూపంలో ప్రత్యక్షమవుతాడు (తుంది). అందుకే ఒకే దేవునికి/ దేవతకి వివిధమైన పేర్లు. క్రియలు. కథలు.

ఉదాహరణకి మూకపంచశతిలోని స్తుతి శతకములో శ్రీ కామాక్షీదేవీ శరీరపు రంగు నలుపు (తరుణి మజుషస్తాపింఛాభాస్తమః పరిపంథినః 23 వశ్లోకం). ఆర్యాశతకములో అమ్మవారి శరీర కాంతి కుంకుమఛాయ.( కాశ్మీర స్తబక కోమలాంగ గతా – మొదటి శ్లోకం). శంకర భగవత్పాదులవారి సౌందర్యలహరిలో అమ్మ రంగు బాలసూర్యుని వంటి ఎరుపురంగు (బాలాతపరుచిః – 16 వశ్లోకం). ఉన్న రంగు ఒకటే. ఆ సమయంలో ఆ మహనీయుల ఉపాసనకు తగినట్లుగా / భావనలకు తగినట్లుగా అమ్మ శరీర కాంతి మారింది. ఇది మనం గ్రహించాలి.

**2) పాండురము(తెల్లనిరంగు) :** పరమేశ్వరుని రంగు స్ఫటికములా ఉంటుందట.

స్ఫటికము నీళ్ళలో మునిగి ఉన్నప్పుడు అది ఉన్నదనికూడా తెలియదు. అందుకే శివునికి రూపమున్నా రూపము లేనివాడుగా భావింపబడుతున్నాడు. (అరూప రూపి).

3) ఈ శ్లోకం స్వాగత వృత్తంలో ఉంది. స్వాగత వృత్తంలోని ప్రతి పాదంలో 11 అక్షరములు ఉంటాయి. ప్రతి పాదములోను ర , న , భ , గా(గగ) గణములుంటాయి. అయితే ఈ శ్లోకములో పాదముల చివర గురువులకు బదులు లఘువులు ఉన్నాయి. ఇది సంస్కృత శ్లోక మర్యాద.



**శ్లో॥ అర్జునాయ వరదోఽసి ఖలుత్వం**
**యుద్ధ సిద్ధ విజయాయ పరీక్ష్య ।**
**అర్భకాయ వరదో భవ మహ్యం**
**నో పరీక్ష్య భవతే ప్రణతాయ ॥ 18**

**ప్రతిపదార్థము :** అర్జునాయ = పాండవులలో మూడవవాడైన అర్జునుని కొరకు; యుద్ధ సిద్ధ విజయాయ = రాబోయే కురుక్షేత్ర యుద్ధములో సిద్ధించబోయే విజయము కొరకు; పరీక్ష్య = పరీక్షించి; త్వమ్ = నువ్వు; వరదో2సి ఖలు = వరదః అసి ఖలు = వరములు ఇచ్చిన వాడివి అయ్యావు కదా! (శివుడు అర్జునునికి వరములు ఇచ్చాడని భావం); భవతే = నీకొరకు; ప్రణతాయ = ఎప్పుడూ నమస్కరించే వానికొరకు; మహ్యం అర్భకాయ = అర్భకుడనైన నా కొరకు; నో పరీక్ష్య = ఎటువంటి పరీక్ష పెట్టకుండా; వరదో భవ = వరములిచ్చేవాడివి అగుదువు కాక!

**తాత్పర్యము :** ఓ శివా! అర్జునుని కొరకు రాబోయే కురుక్షేత్ర యుద్ధములో సిద్ధించబోయే అతని విజయము కొరకు కిరాతుని రూపములో పరీక్షించి నువ్వు వరములు ఇచ్చావు. నీకు ఎప్పుడూ నమస్కరించే చిన్నవాడినైన నాకు ఎటువంటి పరీక్ష పెట్టకుండా వరములు అనుగ్రహించు.

**విశేషాలు :**

**1) ఛందస్సు :** ఈ శ్లోకం స్వాగత వృత్తంలో ఉంది. స్వాగత వృత్తంలోని ప్రతి పాదంలో 11 అక్షరములు ఉంటాయి. ప్రతి పాదములోను ర , న , భ , గా(గగ) గణములుంటాయి. అయితే ఈ శ్లోకములో 2, 4 పాదముల చివర గురువులకు బదులు లఘువులు ఉన్నాయి. "శ్లోకపాదాంతాలలోని లఘువులు వికల్పంగా గురువు

లవుతాయి. కాబట్టి గుర్వంతపాదాలలో ఆ లఘువులను గురువులుగానే స్వీకరించా"లని పెద్దలు, పండిత కవి శ్రీ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు గారు 17 వశ్లోకములోని నా స్వాగత వృత్త లఘు గురువుల వివరణను సమర్థించారు. (నాకు 19మే2016న వాట్సప్ లో పంపిన సందేశము).

2) ఖలు : నిశ్చయమును, నిషేధమును, తెలియగోరుటను, సమాధానమును తెలిపే పదమిది. (సంస్కృత-తెలుగు నిఘంటువు (వావిళ్ల) 1943)

3) వరదోఽసి : పదము చివర ఉన్న ఏ ఓ లకి హ్రస్వమైన అకారము పరమైనప్పుడు ఆ అకారము ఏ ఓలలో లీనమవుతుంది. అదృశ్యమైన అకారమునకు సూచనగా ఽ గుర్తు ఉంచుతారు. (ఏః పదాంతాదతి) "వరదో" లో చివర ఉన్న "ఓ"కారానికి "అసి"లోని అకారము పరమవుతోంది. కనుక అసిలోని మొదటి అకారము అదృశ్యమై ఆస్థానంలో ఽ గుర్తు ఉంచబడింది. ఽ గుర్తును అవగ్రహము అంటారు.

4) అర్జున : రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధము - పంచ కావ్యములు. ఇందులో కిరాతార్జునీయములో, అర్జునుడు తనను పరీక్షించటానికి కిరాతవేషములో వచ్చిన శివునితో యుద్ధము చేస్తాడు. పాశుపతాస్త్రమును వరముగా పొందుతాడు. శ్రీనాథుని హరవిలాసములో ఏడవ ఆశ్వాసము మొత్తము కిరాతార్జునీయము. శివమహాపురాణములో 41 వ అధ్యాయములో కూడా కిరాతార్జునీయము ఉన్నది. చెఱువు వారి శ్లోక పాదాలకు సంబంధించిన శంకరుని మాటలు శివమహాపురాణములో ఈ విధముగా ఉన్నాయి. తనతో యుద్ధము చేసి బాధపడుతున్న అర్జునుని శివుడు ఇలా ఓదార్చాడు.

న ఖిద్య పార్థ భక్తోఽసి మమ త్వం హి విశేషతః ।
పరీక్షార్థం మయా తేఽద్య కృతమేవం శుచం జహి ॥ 25శ్లో.

ఓఅర్జునా! దుఃఖించకుము. నీవు నాకు మహాభక్తుడివి. నేను నిన్ను పరీక్షించుటకు మాత్రమే ఈ నాడిట్లు చేసితిని. దుఃఖమును పోగొట్టుకో.

నాదేయం విద్యతే తుభ్యం యదిచ్ఛసి వృణీష్వ తత్ ॥ 29 శ్లో. నీకు ఈయరానిది లేదు. నీకు ఏది కావాలో, దానిని కోరుకో. తే శత్రుషు యశో రాజ్యస్థాపనాయ శుభం కృతమ్ (నీవు శత్రువులను జయించి కీర్తిని రాజ్యమును పొందుటకు శుభములనిచ్చు తపస్సు చేసావు.

మహాస్త్రం మయా దత్తం దుర్జయస్త్వం భవిష్యసి ।
అనేన సర్వశత్రూణాం జయకృత్యమవాప్నుహి ॥ 56 శ్లో.

నేను నీకు నా మహాస్త్రము పాశుపతాస్త్రము – ఇస్తున్నాను. దీనివల్ల నీవు దుర్జయుడవు అవుతావు. ఈ అస్త్ర ప్రభావముతో శత్రువలనందరినీ జయించు.

శివుడు అర్జునునికి కురుక్షేత్రయుద్ధంలో అడగకుండానే సహాయపడ్డాడు. "అర్జునుడు యుద్ధం చేస్తున్నప్పుడు అతనికంటె ముందుగా శివుడు తన శూలముతో అర్జునుడు చంపబోయే వారిని ముందుగా తానే చంపాడు. ఆయన శూలము నుంచి అనేక శూలాలు పుట్టి శత్రుసంహారం చేసాడు. అర్జునుని తపస్సుకు మెచ్చి పాశుపతము ఇచ్చిన పశుపతి తనివి తీరక తన భక్త పరాధీనతను నిరూపించుకున్నాడని వ్యాసమహర్షి అర్జునునికి చెబుతాడు. (తిక్కన ద్రోణపర్వము పంచమశ్వాసము 420–429 పద్యాలు). శివుని వరము అలాంటిది. గోరంత అడిగితే కొండంత ఇస్తాడు. అందుకే చెఱువు వారు నిర్మలమైన మనస్సుతో తనను పరీక్షించకుండా తనకు కూడా వరము ఇమ్మన్నారు. ఆ వరమేమిటో ఆ బాలకవి చెప్పలేదు. బహుశః ఆయుష్షుకు బదులు కీర్తిని కోరుకొని ఉంటారు. అందుకే భౌతిక శరీరాన్ని 53 ఏళ్ల వయస్సులో విడిచిపెట్టి తరతరాలు నిలబడే నిజాయితీ గల కీర్తిని శివానుగ్రహంతో వరంగా పొందారు.

**శ్లో॥ జరఠం కురుషేఽథ పండితం – యది శస్త్రాస్త్రవిమర్దనక్షమమ్ ।**
**తదపి త్వదనుగ్రహాదృతే – సుమహాంతోఽపి సదైవ చార్భకాః ॥ 19**

**ప్రతిపదార్థము :** జరఠమ్ = ముసలివాడిని; అథ పండితమ్ = పిమ్మట పండితునిగా; కురుషే = చేయుచున్నావు (కురుషే – కుర్వాథే – కురుధ్వే); యది = ఐనచో, పక్షాంతరము; శస్త్ర = ఆయుధము; అస్త్ర = మంత్ర ప్రయోగాదులవలన శక్తినొంది శత్రు సంహారము చేయు బ్రహ్మాస్త్రాదికము; విమర్దన = చందనము లోనగువాని పూయుట, కస్తూరి లోనగువాని నూఱుట; క్షమమ్ = సమర్థమైనది, తగినది; తదపి = తత్ + అపి = అయినప్పటికీ; త్వదను గ్రహాదృతే = త్వత్ + అనుగ్రహాత్ + ఋతే = నీ అనుగ్రహము వలన లేకపోయినచో; సుమహాంతోఽపి = సుమహాంతః + అపి = బాగా గొప్పవారయినప్పటికీ; సదైవచ – సదా + ఏవచ = ఎల్లప్పుడు కూడా; అర్భకాః = దుర్బలులు (అగుచున్నారు).

**తాత్పర్యము :** ఓ శివా! ముసలివాడిని పండితునిగా చేయుచున్నావు. నీ అనుగ్రహము ఉంటే శస్త్రాస్త్రాలు (మంత్ర సహితమైనది అస్త్రము. మంత్ర రహితమైనది శస్త్రము) తగిలినప్పటికీ అవి చందనము మొదలయినవి అతని శరీరానికి పూసినట్లుగా తలపిస్తున్నావు. నీ అనుగ్రహము లేకపోతే బాగా గొప్పవారయినప్పటికీ ఎల్లప్పుడు దుర్బలులు (అగుచున్నారు).

**విశేషాలు :**

1) ఛందస్సు : ఈ శ్లోకం వియోగినివృత్తంలో ఉన్నది.
ఒకటి, మూడవ పాదములలో స , స , జ , గ గణములు,

స స జ గ

| | U | | U | U | U

జ రఠం కు రు షే ధ పం డి తం
రెండు , నాలుగు పాదములలో స , భ , ర , వ(లగ) గణములు

స భ ర వ

| | U U | | U | U | U

య ది శ స్త్రా స్త్ర వి మ ర్ద న క్ష మం

కాళిదాసు రతీదేవి పడ్డ ఆవేదనను, విరహాన్ని ఈ వియోగిని వృత్తములోనే ఒక సర్గకు సరిపడా వ్రాసాడు.

2) అథ : అథ అనునది ఒక అవ్యయము.

1. మంగళము, 2. పిమ్మట, 3. ఆరంభము, 4. ప్రశ్నము, 5. అంత, 6. అంగీకారము, 7. అధికారము, 8. చెదరినవాని నొకటిగా ప్రోగుచేయుట– యను సముచ్చయార్థకమును తెలుపును. 9. మాదల, 10. ఉదాహరణము, 11. అధికారార్థకము, అదనము, 12. స్తుత్యర్థకము, 13. మెడను సమముగా జేయుట. (ఆంధ్ర వాచస్పత్యము కొట్ర శ్యామలకామశాస్త్రి 1953) ఇన్ని అర్థాలలో అథను ప్రయోగిస్తారు.

3) శస్త్రములు : శస్త్రములు ఇరవై – 1. మండలాగ్రము, 2. కరపత్రము, 3. వృద్ధిపత్రము, 4. నఖశస్త్రము, 5. ముద్రిక, 6. ఉత్పలపత్రకము, 7. అర్ధదారము, 8. సూచి, 9.

కుశపత్రము, 10. అటీముఖము, 11. శరారీముఖము, 12. అంతర్ముఖము, 13. ఆర, 14. వేతస పత్రకము, 15. బడిశ, 16. శంకువు, 17. ఏషణి, 18. ప్రకూర్చకము, 19. కుఠారిక, 20. వ్రీహీముఖము. (సుశ్రుతసంహిత) సంకేతపదకోశము

4) అస్త్రములు : ఇవి మొత్తం 53.

అశని (శుష్కాశని, ఆర్ద్రాశని), అసిరత్నము, ఆగ్నేయాస్త్రము, ఐంద్రాస్త్రము (వజ్రాస్త్రము), ఐషీకము, కంకణము, కంకాలము, కాందర్పము, కాపాలము, క్రౌంచాస్త్రము, గద (శిఖరిగద, మోదకిగద), గభస్త్యస్త్రము, గాంధర్వాస్త్రము, చక్రము (దండచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము), తామసము, తేజఃప్రదము, తేజోపకర్షణము, త్వాష్ట్రికము, దమనము, దర్పము, నందనాస్త్రము, నారాయణాస్త్రము, పాశము (ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము), పైనాకాస్త్రము, పైశాచము, ప్రమథాస్త్రము, ప్రశమనము, ప్రస్వాసనము, బ్రహ్మశిరోస్త్రము, బ్రహ్మాస్త్రము, మానవాస్త్రము, మాయావంతము, ముసలము, మోహనము, మౌసలము, వాయువ్యాస్త్రము, వారుణాస్త్రము, విద్యాధరాస్త్రము, విలాపనము, శక్తి, శిఖరాస్త్రము, శిలేషు మానవాస్త్రము, శైవశూలము, శోషము, సంతాపనము, సంవర్తనము, సత్యాస్త్రము, సర్వమాయాదమనము, సుధామనము, సోమాస్త్రము, సౌమనస్యము, సౌరము, హయశిరము. (53) : (ఆంధ్ర వాచస్పత్యము కొట్ర శ్యామలకామశాస్త్రి 1953)

5) **మహాన్ మహత్స్వేవ కరోతి విక్రమమ్** అని ఒక సంస్కృత న్యాయం. గొప్పవాడుడు గొప్పవానియందే తన ప్రభావము చూపిస్తాడట. చెరువు వారి కవిత్వము కూడా అటువంటిదే. . కొవ్వూరులో వారు చేసిన సంస్కృత శతావధానము అనేకమంది గొప్పవాళ్ల చేత తలలూపించింది. శివానుగ్రహంతో చెఱువు వారు అవధాన విద్యా వాచస్పతి అయ్యారు. శివుడు చెఱువు వారిని గొప్పవాడిని చేసి గొప్పవాళ్ల మనస్సుల్లో నిలిచిపోయేటట్లు చేసారు.

**శ్లో॥ పరమేశ్వర! పార్వతీపతే! – శివ !శూలిన్! త్రిపురాసురాంతక! ।**
**శతసాంజలి వందనాని తే – పదయోర్మామవ చంద్రశేఖర! ॥ 20**

**ప్రతిపదార్థము :** చంద్రశేఖర! = చంద్రుని శిరోభూషణముగ కలవాడా!; పరమేశ్వర! = పరమ + ఈశ్వర! = గొప్పవాడివయిన ఓ శివ ప్రభూ!; పార్వతీపతే! = పార్వతీదేవికి భర్తా!; శివ = శుభాలను అనుగ్రహించువాడా!; శూలిన్ = శూలమను ఆయుధము

కలవాడా! (శూలమస్యాస్తీతి శూలీ); త్రిపురాసురాంతక = త్రిపుర + అసుర + అంతక = త్రిపురాసురులను సంహరించినవాడా!; తే పదయోః = నీపాదములకు; శతసాంజలి = శతసా + అంజలిః = వందసార్లు చేతులు రెండు సార్లు కలిపి పట్టుటతో; వందనాని = నమస్కారములు చేయుచున్నాను; మామవ = మామ్ + అవ = నన్ను రక్షించు.

**తాత్పర్యము :** చంద్రుని శిరోభూషణముగ కలవాడా! గొప్పవాడివయిన ఓ శివ ప్రభూ! పార్వతీదేవికి భర్తా! శుభాలను అనుగ్రహించువాడా! శూలమను ఆయుధము కలవాడా! త్రిపురాసురులను సంహరించినవాడా! నీపాదములకు వందసార్లు – చేతులు రెండు సార్లు కలిపి పట్టుటతో నమస్కారములు చేయుచున్నాను. నన్ను రక్షించు.

**విశేషాలు :**

1) చంద్రశేఖర : చన్ద్ర the moon, and శేఖర a crest; whoes crest is the moon. *(Wilson Sanskrit-English Dictionary 2nd Ed. 1832)*

2) ఛందస్సు : ఈ శ్లోకం వియోగినివృత్తంలో ఉన్నది. ఒకటి, మూడవ పాదములలో స , స , జ , గ గణములు.

3) పరమేశ్వర : ఇదివరకటి రోజుల్లో నాటకాలు ప్రారంభించే ముందు 'పర బ్రహ్మ పరమేశ్వర పురుషోత్తమ సదానంద' అనే ప్రార్థనతో మొదలు పెట్టేవారు. ఈ కీర్తనను రాసినది చందాల కేశవదాసు (జూన్ 20, 1876 – జూన్ 14, 1956). పరమేశ్వరుని రకరకాల విశేషణాలతో స్మరించుకోవటం ఈ జాతి అలవాటు.

4) పార్వతీ : హిమవంతునికి మేరువుకూతురైన మనోరమయందు (మేనా?) పుట్టిన రెండవ కుమార్తె పార్వతి. ఈమె యొక్క అక్క గంగాదేవి. మొదటి జన్మములో ఈమె దక్షుని కూతురు అయిన సతీదేవి. పార్వతి ఒకసమయమున శివునితో కలిసి ఉన్న సమయములో ఉండగా దేవతలు విఘ్నము కలిగించారు. అందువల్ల దేవతలకు వారికి భార్యల యందు పుత్రసంతానము లేనట్లు శపించింది.

ఆ రుద్రునికి రేతస్సు జాఱి భూమియందు పడింది. పార్వతి తన దేహమున ఉండవలసిన తన భర్త రేతస్సును భూమిధరించినందున భూమికి అనేకమంది భర్తలు కలుగునట్లు శాపము ఇచ్చింది.

**5) శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు

శివుడు. బ్రహ్మానందస్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు.

**6) త్రిపురాసురులు :** 1. విద్యున్మాలి, 2. తారకాక్షుడు, 3. కమలాక్షుడు. వీరు తారకుని కుమారులు (సంకేత పదకోశము రవ్వా శ్రీహరి 2002). తారకాసురుని కొడుకులు అగు కమలాక్షుడు, విద్యున్మాలి, తారకాక్షుడు అనువారు త్రిపురాసురులు. వీరు గొప్ప తపస్సు చేసి శివుని అనుగ్రహమువలన ఇనుముతోను బంగారుతోను వెండితోను చేయబడిన మూడు తిరిగే పట్టణాలను పొంది లోకములను పాడుచేసేవారు. అప్పుడు విష్ణువు ఒక పాషండుని అవతారము ఎత్తి నారదుని తనకు శిష్యునిగా చేసికొని ఈ త్రిపురాసురులకును వీరి కాపులకును శివునియందు భక్తి తొలగుటకు తగిన విషయములు చెప్పాడు. అటుపిమ్మట త్రిపురాసురులును, వీరి కాపులును శివద్వేషులు అయిరి. అందులకు శివుడు ఆగ్రహించి వీరితో యుద్ధముచేసి వీరిని చంపాడు. వీరు చనిపోయిన తర్వాత ప్రమథ గణములతో చేరారు. (పురాణనామచంద్రిక యెనమండ్రం వెంకట రామయ్య 1879).

**8) అంజలి :** చేమోడుపు, చేతులు రెండును కలిపి పట్టుట, నమస్కారము. దేవబ్రాహ్మణ గురువుల నమస్కరించునపుడును వినయసూచనమునందును దీనికి వినియోగము. దేవతలకు నమస్కరించునపుడు శిరసునందును, గురువుల ముఖమునను, బ్రాహ్మణులకు వక్షఃస్థలములను చేమోడ్పు కూర్పవలెను. ద్వి, త్రిశబ్దములతో ద్విగుసమాసము చేసినపుడు అకారాంత మగును. ద్వ్యంజలము, త్ర్యంజలము మొ. (వావిళ్ల నిఘంటువు 1949 )



**శ్లో॥ శ్రీదాద్రిమందిర! సురస్తుత! కృత్య! శూలిన్!**
**హేమాద్రికార్ముక! హిమాద్రిసుతాకళత్ర! ।**
**విద్రావితాసుర! సురద్రుమవద్వితీర్ణ!**
**భద్రప్రదానపురుష! ప్రణమామి పాహి ॥ 21**

**ప్రతిపదార్థము :** శ్రీదాద్రి = శ్రీద + అద్రి = సంపదను ప్రసాదించు కుబేరుని పర్వతమయిన కైలాసమును (శ్రీ = సంపద, ద = ఇచ్చువాడు); మందిర! = ఇల్లుగా కలిగినవాడా! (మాదతే సుప్యతేఽత్ర మందిరం. దీనియందు నిద్రింపబడును,

సంతోషింపబడును కనుక ఇంటిని మందిరము అంటారు); సురస్తుత = దేవతలచే కొనియాడబడు వాడా! (శుభం రాంతి బ్రువంతీతి వా సురాః– శుభమును చెప్పువారు సురలు); కృత్య = 1. సృష్టి, 2. స్థితి, 3. సంహారము, 4. తిరోభావము, 5. అనుగ్రహ కరణము ("పంచవిధం తత్ కృత్యం సృష్టిః స్థితిసంహృతీ తిరోభావః తద్వదనుగ్రహ కరణమ్") అను అయిదు పనులు చేయువాడా!; శూలిన్ = శూలమను ఆయుధము కలవాడా! (శూలమస్యాస్తీతి శూలీ); హేమాద్రి = హేమ + అద్రి = త్రిపురాసుర సంహార సందర్భంలో బంగారు కొండ మేరువును (అద్రి = ఫల మూల ద్వారమున నరుల చేత భక్షింపబడునది. అద భక్షణే); కార్ముక = విల్లుగా కలిగినవాడా! (కర్మణే ప్రభవతి కార్ముకం – యుద్ధ కర్మ కొరకు సమర్థమైనది); హిమాద్రి = మంచుకొండ; సుతా కళత్ర = కుమార్తె అయిన పార్వతీదేవిని భార్యగా కలిగినవాడా! (కల్యత ఇతి కళత్రం. కల సంఖ్యానే. ఎన్నబడునది కనుక భార్యకు కళత్రమని పేరు); విద్రావితాసుర = విద్రావిత + అసుర = యుద్ధభూమి నుండి పారిపోయిన రాక్షసులు కలవాడా!; సురద్రుమ వద్వితీర్ణ = సురద్రుమవత్ + వితీర్ణ = దేవతల కల్ప వృక్షమువలె కోరినది ఇచ్చువాడా!; భద్ర ప్రదాన పురుష = శుభములతో కూడిన గొప్పదానములను ప్రసాదించు పరమాత్మా!; ప్రణమామి = నమస్కరించుచున్నాను; పాహి = రక్షించుము.

**తాత్పర్యము :** ఓ పరమశివా! సంపదను ప్రసాదించు కుబేరుని పర్వతమయిన కైలాసమును ఇల్లుగా కలిగినవాడా! దేవతలచే కొనియాడబడు వాడా! 1. సృష్టి, 2. స్థితి, 3. సంహారము, 4. తిరోభావము, 5. అనుగ్రహ కరణముఅను అయిదు పనులు చేయువాడా! శూలమను ఆయుధము కలవాడా! త్రిపురాసుర సంహార సందర్భంలో బంగారు కొండ మేరువును విల్లుగా కలిగినవాడా! మంచుకొండ కుమార్తె అయిన పార్వతీదేవిని భార్యగా కలిగినవాడా! యుద్ధభూమి నుండి పారిపోయిన రాక్షసులు కలవాడా! దేవతల కల్పవృక్షమువలె కోరినది ఇచ్చువాడా! శుభములతో కూడిన గొప్పదానములను ప్రసాదించు పరమాత్మా! నీకు నమస్కరించుచున్నాను. నన్ను రక్షించుము.

**విశేషాలు :**

**1) ఛందస్సు :** ఈ శ్లోకము వసంతతిలక వృత్తములో ఉంది. వసంత తిలక వృత్తానికి ఉద్ధర్షిణీ, ఔద్ధర్షిణి, కర్ణోత్పలా, మధుమాధవీ, శోభావతీ, సింహోన్నతా, సింహోద్ధతా,

మదనము అనే ఇతర పేర్లు ఉన్నాయి. గణములు త-భ-జ-జ-గ-గ, 14 అక్షరములు లేదా21 మాత్రలు ఉంటాయి. "మాతః సమస్త జగతాం మధుకైటభారేః" మొదలైన ప్రసిద్ధ శ్లోకాలు వసంతతిలక వృత్తంలో ఉన్నాయి.

**2) హేమాద్రి కార్ముక :** కొన్ని లక్షల సంవత్సరాలలో ఒక్కసారి మాత్రమే ఈ బంగారము, వెండి, ఇనుములతో చేసిన మూడు పురములు ఒకే సరళరేఖలోకి రావాలి. అలా ఒకే రేఖలో ఉన్నప్పుడు, చంద్రుడు పుష్యమీ నక్షత్రములో ఉండాలి. అభిజిత్ లగ్నం ఉండాలి. ఆకాశంలో పుష్కలావర్త మేఘం నుండీ వర్షం పడుతుండాలి. అప్పుడు దైవగణములలో అందరికన్నా గొప్పవాడు లోకంలో ఎవరూ ఉపయోగించని ఒక కొత్తరథం ఎక్కి ఒకే ఒక్క బాణం వేస్తే, అప్పుడు మాత్రమే తాము చనిపోతామని తారకాసురుని ముగ్గురు కుమారులు తారకాక్షుడు, కమలాక్షుడు, విద్యున్మాలి. అని కోరుకుంటారు.

అందుకే వారిని సంహరించటానికి భూమి రథంగా, సూర్యచంద్రులు ఆ రథానికి చక్రాలుగా, నాలుగు వేదములు గుర్రాలుగా మేరు పర్వతము ధనుస్సుగా, ఆదిశేషుడు వింటినారిగా సాక్షాత్తు విష్ణువు బాణముగా, అగ్నిదేవుడు ఆ బాణము యొక్క శిఖగా సిద్ధమవ్వగా, పరమశివుడు ఆ రథాన్ని అధిరోహించి త్రిపురాసుర సంహారం చేస్తాడు.

**3) హిమాద్రి సుతా కళత్ర :** కీర్తిలక్ష్మీకళత్రుడు, విశ్వంభరాకళత్రుడు వంటిది ఈ "హిమాద్రి సుతా కళత్ర" ప్రయోగం.

**4) ముగింపు :** చెఱువు సత్య నారాయణ శాస్త్రి గారి తాతగారయిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారు పడక కుర్చీలో కూర్చొని ఉండగా, వారి ఇంటికి వచ్చిన వారికి శాస్త్రిగారిగా కాక, ఒక పెద్ద ముత్తైదువగా కనబడ్డారట. ఆ పడకకుర్చీలో కూర్చున్న ముత్తైదువను శాస్త్రి గారి గురించి ఒకావిడ అడిగిందట. శాస్త్రి గారు లేచిపోయి, "ఏమి! నేను శాస్త్రిని కనబడటము లేదా!!" అని అడిగారట. అమ్మవారి ఉపాసన పదే పదే చేయడం వలన శాస్త్రి గారు అమ్మగా మారిపోయే అదృష్టం పొందారు. వారు శరీరం విడిచిపెట్టినప్పుడు, ఆయన శరీరం అగ్నిలో సంస్కారము చేస్తున్నప్పుడు బాలాత్రిపురసుందరీ అమ్మవారు ఆయన శరీరం లోనుంచి బయటకి వెళ్ళిపోవడం అక్కడ ప్రత్యక్షంగా చూసినవారు చాలా మంది ఉన్నారు. ఫొటోలు కూడా వార్తా

పత్రికల్లో వచ్చాయి. అటువంటి శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారి దగ్గర చదువుకొని వారి అనుగ్రహానికి నోచుకొని ఎనిమిదేళ్ల వయస్సులో చేసిన చెఱువువారి శివ స్తుతి ఇది.



**శ్లో॥ ఉన్మత్తపుష్పసుహితాయ హితాయ తుభ్య -**
**మున్మత్తమన్మథహరాయ హరాయ నౌమి ।**
**ఆయుః ప్రయచ్ఛ పరమం పరిపాలయాస్మాన్**
**సర్వత్ర దేహి విజయం వినయం చ విద్యామ్ ॥ 22**

**ప్రతిపదార్థము :** ఉన్మత్త = ఉమ్మెత్త; పుష్ప = పూవునకు; సుహితాయ = తృప్తినొందిన వానికి; హితాయ = హితము చేయువానికి; తుభ్యమ్ = నీకొరకు (తుభ్యమ్ / తే- యువాభ్యామ్ / వామ్, యుష్మభ్యమ్ / వః - యుష్మత్ శబ్దము చతుర్థీవిభక్తి); ఉన్మత్త = వెఱ్ఱెత్తిన; మన్మథ = మన్మథుని (బుద్ధిని కలవరము చేయువాడు మన్మథుడు); హరాయ = హరించినవానికొరకు; హరాయ = హరుని కొరకు; నౌమి = నమస్కరించుచున్నాను (ను పరస్మై- స్తుతించుట నౌమి - నువః - నుమః - న పరస్మై. లట ఉత్తమ పురుష); ఆయుః = ఆయువు (రూ. ఆయుస్సు. కడచిపోవునది.); ప్రయచ్ఛ = ఇమ్ము; పరమమ్ = శ్రేష్ఠమైన రీతిలో నన్ను; సర్వత్ర = అన్నిచోట్ల; పరిపాలయ = పరిపాలించుము. (పాలయ / పాలయతాత్ - పాలయత; పాలరక్షణే పరస్మై లోట్ మధ్యమ); అస్మాన్ = మమ్ములను (మామ్ / మా - ఆవామ్ / నౌ, అస్మాన్ / నః - అస్మత్ శబ్దము ద్వితీయావిభక్తి); విజయమ్ = మిక్కిలి గెలుపును; వినయం చ = అణకువను; విద్యామ్ = జ్ఞానమును; దేహి = ఇమ్ము.

**తాత్పర్యము :** ఉమ్మెత్త పూవులంటే ఇష్టమైనవానికి, హితము చేసేవానికి, వెఱ్ఱెత్తిన మన్మథుని (బుద్ధిని కలవరము చేయువాడు మన్మథుడు) బూడిద చేసిన వానికి శివునికి నమస్కరించుచున్నాను. ఓ శివా! నాకు ఆయువును ఇమ్ము. శ్రేష్ఠమైన రీతిలో నన్ను అన్ని చోట్ల పరిపాలించుము. నాకు మిక్కిలి గెలుపును, అణకువను, జ్ఞానమును ఇమ్ము.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకము వసంతతిలక వృత్తములో ఉంది. గణములు త-భ-జ-

జ-గ-గ, 14 అక్షరములు లేదా21 మాత్రలు ఉంటాయి. (ఉక్తావసంత తిలకా తభజాజగౌగః)

**2. ఉమ్మెత్త :** "మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు" ఎక్కడయినా పారిజాతపుష్పములలో ఉండే తేనె త్రాగడానికి అలవాటు పడిపోయిన తుమ్మెద ఎక్కడో ఉన్న ఉమ్మెత్తపువ్వు మీద వాలుతుందా? కాని శివ దేవుని దృష్టి ఈ ఉమ్మెత్త పూల మీదనే వాలుతుంది. శివునికి ఏ పూలతో పూజిస్తే ఏ ఫలితమో శివమహాపురాణములో ఇలా చెప్పబడింది.

**ముక్తికామో భవేద్యో వై దర్భైశ్చ పూజనం చరేత్ ।**
**లక్షసంఖ్యా తు సర్వత్ర జ్ఞాతవ్యా ఋషిసత్తమ ॥ 25శ్లో**

**ఆయుఃకామో భవేద్యో వై దూర్వాభిః పూజనం చరేత్ ।**
**పుత్రకామో భవేద్యో వై ధత్తూరకుసుమైశ్చరేత్ ॥ 26శ్లో**

**రక్తదండశ్చ ధత్తూరః పూజనే శుభదః స్మృతః ।**
**అగస్త్యకుసుమైశ్చైవ పూజకస్య మహద్యశః ॥ 27శ్లో**
**(శివమహాపురాణము చతుర్దశాధ్యాయము)**

ముక్తిని కోరువాడు శివుని దర్భలతో పూజించవలెను. ఓ మునిశ్రేష్ఠా! ఈ పూజలనన్నిటిని లక్ష సంఖ్యలో చేయవలెనని యెరుంగుము(25). ఆయుర్దాయమును కోరువాడు శివుని దూర్వలతో పూజించవలెను. పుత్రుని కోరువాడు ధత్తూర పుష్పములతో పూజించవలెను (26). ఎఱ్ఱని కాడగల ధత్తూర (ఉమ్మెత్త) పుష్పములతో పూజించినచో శుభములు కలుగునని చెప్పబడెను. అగస్త్య (అవిసె) పుష్పములతో పూజించువానికి గొప్ప కీర్తి కలుగును (27).

**3. ఉన్మత్త :** చెఱువు వారు ఉన్మత్త శబ్దాన్ని చక్కటి శ్లేషతో ఈ శ్లోకంలో ప్రయోగించారు. దక్షుడు శివుని నిందిస్తూ చెప్పిన భాగవతపద్యంలో (4-43-సీ.) శివుని ఉన్మత్త ప్రియుడన్నాడు. శివుడూ పిచ్చివారికి ఇష్టుడు. అంటే ఉన్మత్తాకారంలో మెలగే సిద్ధులకు ఇష్టుడని భావం. జ్ఞానులు పిల్లల్లా పిచ్చివాళ్లలా ఉంటారని అర్థం. (బాలోన్మత్త పిశాచవత్) ఉమ్మెత్తను తింటే పిచ్చి పట్టుతుందని సాధారణంగా చెపుతుంటారు. శివుడు ఉన్మత్త శేఖరుడు. అంటే ఉమ్మెత్త పూవులను శిరసులో ధరించిన వాడని ఒక అర్థం. పిచ్చివాళ్ళలో గొప్పవాడని మరొక అర్థం. ఈ ఉన్మత్తశేఖరుని స్తుతి శ్లోకంలో ఉన్మత్తునిగా మన్మథుని

విశ్లేషించారు చెఱువు వారు.

**4. ప్రయచ్ఛ :** ప్రయచ్ఛ – సంస్కృతంలో ఉన్న అందమైన ధాతు ప్రయోగాల్లో ఒకటి. సంస్కృత సాహిత్యంలో చాల చోట్ల ఈ ప్రయచ్ఛకు సంబంధించిన ప్రయోగాలున్నాయి. ఉదా॥ "శిరశ్ఛేదేऽపి శతం న దదాతి వింశతి పఞ్చకం తు ప్రయచ్ఛతీతి శాకటకన్యాయః" అని ఒక న్యాయం. ఒక బండిలాగువాడు నా తల తీసినప్పటికి నూఱు రూపాయలీయను, అయిదు ఇరవైలు ఇస్తానని వాదించాడట. ప్రపంచమునకు మిథ్యాత్వమును చెప్పను. అసత్వాన్ని (అభావత్వమును) చెప్పెదనని అన్నట్లు. ఇక్కడ మూర్ఖ సంభాషణలో ప్రయచ్ఛ పదం వాడారు. వినా వేంకటేశమ్ అను ప్రసిద్ధ శ్లోకములో భక్తి భావంలో "ప్రయచ్ఛ" వాడబడినది.

**5. విద్యలు :** త్రి–విద్యలు – 1. భగవద్గీత, 2. ఉపనిషత్తులు, 3. బ్రహ్మసూత్రములు.

చతుర్–విద్యలు – 1. ఆన్వీక్షకి (ఇందు విజ్ఞానము తెలుపబడును), 2. త్రయి (ఇందు ధర్మాధర్మములు తెలుపబడును), 3. వార్త (ఇందు అర్థానర్థములు తెలుపబడును), 4. దండనీతి (ఇందు నయానయములు తెలుపబడును).

"ఆన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ ।
విద్యా హ్యేత్యాశ్చతస్రః స్యుర్లోకసంస్థితిహేతవః"
– కామందకనీతిసారము 2–2.

1. తర్కశాస్త్రము, 2. వేదవిద్య, 3. అర్థశాస్త్రము, 4. సామాది దండవీతి.

షట్–విద్యలు : 1. ఆకర్షణము, 2. స్తంభనము, 3. మారణము, 4. విద్వేషము, 5. ఉచ్చాటనము, 6. మోహనము.

ఏకాదశ–విద్యలు : 1. వ్యాకరణము, 2. గాంధర్వ వేదము, 3. సాముద్రికము, 4. వైద్యము, 5. అస్త్రవిద్య, 6. యోగశాస్త్రము, 7. భక్తిశాస్త్రము, 8. రుద్రయామలాది తంత్ర శాస్త్రము, 9. శాబరాది మంత్రశాస్త్రము, 10. స్వరోదయము, 11. సర్వవిధకథలు.

చతుర్దశ–విద్యలు : చతుర్వేదములు, షడ్వేదాంగములు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము), 11. మీమాంస, 12. న్యాయము, 13. పురాణము, 14. ధర్మశాస్త్రము

"అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః,

పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతాశ్చతుర్దశ" విష్ణుపురాణం 3-6-27

షోడశ-విద్యలు : 1. సత్యవిద్య, 2. దహర విద్య, 3. వైశ్వానర విద్య, 4. పంచాగ్ని విద్య, 5. షోడశకళా విద్య, 6. ఉద్గీథ విద్య, 7. శాండిల్య విద్య, 8. పురుష విద్య, 9. పర్యంక విద్య, 10. అక్షర విద్య, 11. సంవర్గ విద్య, 12. మధు విద్య, 13. ప్రాణ విద్య, 14. ఉపకోసల విద్య, 15. సద్విద్య, 16. భూమ విద్య (అపరోక్ష జ్ఞానము).

ద్వాత్రింశత్-విద్యలు : చతుర్వేదములు, చతురుపవేదములు (ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, తంత్రములు), షట్ అంగములు, 15. మీమాంస, 16. తర్కము, 17. సాంఖ్యము, 18. వేదాంతము, 19. యోగము, 20. ఇతిహాసములు, 21. పురాణములు, 22. స్మృతులు, 23. నాస్తికమతము, 24. అర్థశాస్త్రము, 25. కామశాస్త్రము, 26. శిల్పము, 27. అలంకారము, 28. కావ్యములు, 29. దేశభాష, 30. అవసరోక్తి, 31. యావనమతము, 32. దేశాధిప్రచలిత ధర్మములు. (శుక్రనీతిసారము 4-3-27)

1. వృక్షవిద్య, 2. పశువిద్య, 3. మనుష్యవిద్య, 4. సంసేచనవిద్య, 5. సంహరణ విద్య, 6. స్తంభనవిద్య, 7. ధృతివిద్య, 8. భస్మీకరణవిద్య, 9. సంకటివిద్య, 10. పార్థక్యవిద్య, 11. తరీవిద్య, 12. నౌవిద్య, 13. నౌకావిద్య, 14. అశ్వవిద్య, 15. పథివిద్య, 16. ఘంటాపథవిద్య, 17. సేతువిద్య, 18. శకుంతవిద్య, 19. విమానవిద్య, 20. వాసోవిద్య, 21. కుట్టీవిద్య, 22. మదిరవిద్య, 23. ప్రాసాదవిద్య, 24. దుర్గవిద్య, 25. కోటవిద్య, 26. ఆకరవిద్య, 27. యుద్ధవిద్య, 28. ఆపణవిద్య, 29. రాజవరాలయవిద్య, 30. నగర రచనావిద్య, 31. వనోపవనవిద్య, 32. దేవాలయవిద్య.

విద్యలు (చతుర్దశ) : వేదాలు నాలుగు, వేదాంగాలు ఆరు, పురాణం, న్యాయశాస్త్రం, మీమాంసాశాస్త్రం, ధర్మశాస్త్రం మొత్తం పద్నాలుగు. వీటికి నాలుగు ఉపవేదాలు (అయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థశాస్త్రం) కలుపుకొంటే అష్టాదశ విద్యలు.

**6. వినయము :** 'నదులారా! మీరు వరదలతో వేగంగా ప్రవహించేటప్పుడు, కొండలపైనుంచి దూకేటప్పుడు పెద్ద పెద్ద చెట్లను పడగొట్టేస్తారు. ఊళ్ళకు ఊళ్ళు ముంచెత్తుతారు. కాని అల్పమైన తుంగ మొక్కలను మీరెందుకు కదిలించలేకపోతున్నారు?' అని ఒకసారి సముద్రుడు నదులను అడుగుతాడు. 'మేము వేగంగా ప్రవహించేటప్పుడు కొండలు, చెట్లు అహంకారంతో మాకు అడ్డుగా నిలబడతాయి. అందువల్ల మా బలాన్ని

చూపించి వాటిని కిందపడగొడతాం. ప్రబ్బలి, తుంగవంటి మొక్కలు వినయంతో తలవంచుతాయి. కనుక మేము వాటిమీదుగా ప్రవహిస్తాం. మేము వెళ్ళిన తరువాత అవి తలలు ఎత్తి మునుపటిలా బతుకుతాయి. అని గంగానది సముద్రుడితో చెబుతుంది.

భీష్ముడు ధర్మరాజుకు శత్రువు బలవంతుడైతే బలహీనుడు ఎలా తప్పించుకోవాలో చెబుతూ ఈ కథ చెబుతాడు.

అందుకే వినయము 1. స్వాభావికము, 2. కృత్రిమము. రెండు రకాలని చెబుతారు. సందర్భానుగుణంగా శత్రువుల దగ్గర చూపించేది కృత్రిమ వినయం. పెద్దల దగ్గర, గురువుల దగ్గర చూపించేది స్వాభావికమైన వినయం.

**ముగింపు :** నాకు మాత్రమే విజయాన్ని విద్యను ప్రసాదించమని కవి కోరుట లేదు. మాకు (అస్మాన్) అంటున్నాడు. "సహనౌ భునక్తు" స్థాయిలో తనతో పాటు అందరికి శివానుగ్రహము కోరిన చెఱువు వారు సర్వదా, సర్వథా స్తుతి పాత్రులు.

**శ్లో॥ కంఠే కాలం వపుషి ధవళం లోహితం కేశపాశే**
**భూషాస్థానే భుజగభరితం చంద్రసాంద్రం కిరీటే ।**
**దారార్ధాంగం భవహర మజం సర్వ దేశ ప్రభుం త్వాం**
**శాంతం దాంతం శరణ మగమం పాహిమాం దేవ దేవ ॥** **23**

**ప్రతిపదార్థము :** దేవ దేవ = దేవతలకు దేవతవయిన ఓ శివా !; కంఠే = నీ కంఠమునందు (కణతి ధ్వనతి కణ్ఠః– కణ శబ్దే – పలుకునది కనుక కుత్తుకకు కంఠ మని పేరు); కాలమ్ = నలుపురంగు కలవాడవు (కాలయతి మన ఇతి కాలః– కలకిల క్షేపే. మనస్సును ప్రేరేపించునది కనుక నలుపు రంగుకు కాలమని పేరు); వపుషి = శరీరమునందు (ఉప్యతే ప్రాక్కర్మభిరితి వపుః టువప్ బీజ సంతానే. పూర్వ కర్మలచేత పుట్టింపబడునది కనుక శరీరమునకు వపువు అని పేరు); ధవళమ్ = తెలుపురంగు కలవాడవు (ధావతి శుద్ధ్యతి ధవళః. ధావు గతిశుద్ధ్యోః. దీనిచేత పదార్థము శుద్ధి పొందును కనుక తెలుపు రంగునకు ధవళము అని పేరు వచ్చింది.); కేశపాశే = సిగయందు; లోహితమ్ = ఎఱుపురంగు కలవాడవు; భూషాస్థానే = అలంకారముల స్థానములో; భుజగభరితమ్ = పాములతో నిండింది; కిరీటే = కిరీటమునందు (లలాటోపరి క్షిప్యత ఇతి కిరీటం. క విక్షేపే. నొసటి మీద పెట్టబడునది కనుక కిరీటము); చంద్రసాంద్రమ్ = సిగపై చంద్రునిచే దట్టమైన సాంద్రత గలవాడవు; దారార్ధాంగమ్

= దార + అర్ధ + అంగమ్ = శరీరములో సగభాగములో భార్య కలిగినవాడివి; భవహరమ్ = సంసారబంధాన్ని త్రెంచువాడవు; అజమ్ = పుట్టుక లేనివాడు, శాశ్వతమైన వాడు (నజాయతే); సర్వ దేశ ప్రభుమ్ = సమస్త దేశాలకు అధిపతివి అయిన; త్వామ్ = నిన్ను; శాంతమ్ = శాంతుని; దాంతమ్ = తపఃక్లేశమును ఓర్చుకొను వానిని; శరణమ్ ఆగమమ్ = శరణుజొచ్చితిని; మామ్ = నన్ను; పాహి = రక్షించుము.

**తాత్పర్యము :** దేవతలకు దేవతవయిన ఓ శివా! నీ కంఠమునందు నలుపురంగు ఉన్నది. నీ శరీరమునందు తెలుపు రంగు ఉన్నది. నీ సిగయందు ఎఱుపు రంగు ఉన్నది. నీ అలంకారముల స్థానము పాములతో నిండింది. నీ కిరీటము చంద్రునిచే దట్టమైనది. నీ శరీరములో సగభాగము భార్య ఉన్నది. నువ్వు సంసారబంధాన్ని తెంచువాడివి. పుట్టుక లేనివాడివి. శాశ్వతమైన వాడివి. సమస్త దేశాలకు అధిపతివి. శాంతుడివి. తపః క్లేశమును ఓర్చుకొను వాడివి. అంతుదొరకని వాడివి. అటువంటి నువ్వు నన్ను రక్షించుము.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోక ఛందస్సు మందాక్రాంతము .ఈ శ్లోక ఛందస్సుకే "శ్రీధరా" అనే ఇంకొక పేరు ఉంది. అత్యష్టి ఛందమునకు చెందిన 18929 వ వృత్తమిది. ఇందులో 17 అక్షరములు ఉంటాయి. 27 మాత్రలు ఉండును.

మాత్రా శ్రేణి: U U U - U I I - I I I - U U I - U U I - U U
మిశ్రగతి శ్రేణి (4–5) : U U - U U I - I I I I - U U I - U U - I U U

ఇందులో 4 పాదములు ఉంటాయి.ప్రతి పాదములో మ , భ , న , త , త , గా(గగ) గణములుంటాయి.

సంస్కృత ఛందస్సులో అతి సుందరమైన, అతి కష్టమైనవృత్తాలలో మందాక్రాంత మొకటి. ఈ మందాక్రాంత వృత్తము ఎంత అందమయినదో, వ్రాయటానికి అంత కష్టమైనదంటారు. కవిత్వంలో చేయితిరిగిన కాళిదాసు ఈ మందాక్రాంతాన్ని మేఘసందేశ కావ్యంలో అందంగా అనేక శ్లోకాలలో నడిపించాడు. ప్రసిద్ధమయిన శాంతాకారం భుజగశయనం ఈ మందాక్రాంత వృత్తంలో వ్రాయబడింది.

**2. కంఠచామీకరన్యాయము :** బంగారుగొలుసును కంఠములో ఒకడు వేసుకొన్నాడట. మరచిపోయి "అయ్యో! నాగొలుసు పోయినది" అని ఏడుస్తూ వెదకుకొనే సందర్భంలో

ఈ కంఠచామీకరన్యాయము వాడతారు. – అదిగో, నీగొలుసు నీమెడలోనే ఉందిరా!" – అని ఇతరులు చూపిస్తే చూసి "ఉన్నది" అని తృప్తి పడతాడు. తనలోనే ఆత్మను తెలిసికోలేక తికమకబడేవాడు గురూపదేశముతో ఆత్మజ్ఞానము పొంది తృప్తి పొందుతాడని అసలు కథ. కంఠే కాలం అని మొదలయిన ఈ శ్లోకం అటువంటి ఆత్మజ్ఞాన రహదారిలో దీపం.

**3. రంగులు :** శివుని నీలకంఠుడు అని చెబుతుంటాం. ఈ నీల అంటే అర్థమేమిటి? నీలమనా? నలుపు అనా? నలుపు అని స్పష్టంగా అర్థం స్వీకరించాలి. నీలినీడలు– అంటే నల్లని ఛాయలు. నీలి కురులు అంటే నల్ల వెంట్రుకలు; నీలకంఠుడు అంటే నల్లని మచ్చ గల శివుడు. నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి / ఘన కిరీటము తల గల్గువాడు (భాగవతం.1–14) అని పోతన్నగారి ప్రయోగం. రాములవారి నల్లని శరీరానికి పెట్టిన గొప్ప కిరీటం నల్లని కొండ మీదన్న సూర్యుని లాగా మెరిసిపోతుందని అర్థం. ఈ పద్ధతిలోనే చెఱువు వారు శివుని కంఠములోని మచ్చ నల్లటి రంగులో ఉందని వ్రాసారు.

**ముగింపు :** చెట్టు మొదట్లో పోసిన నీరు – కొమ్మలకు, ఆకులకు, కాయలకు అందుతాయి. అలాగే శివారాధన చేస్తే అందరు దేవతల అనుగ్రహం పొందవచ్చని మన ప్రాచీన గ్రంథాలు చెబుతున్నాయి. ఈ చెఱువు వారి లింగోద్భవ స్తుతి కూడా మనస్సు పెట్టి చదివితే అటువంటి సర్వదేవతానుగ్రహ ఫలితాన్ని ఇస్తుంది.



**శ్లో॥ ద్రుతవిలంబితభక్తిసమాశ్రయా –**
**ద్ద్రుతవిలంబితసత్ఫలదాఽవ మామ్ ।**
**హర! శివాద్య! భవాంతకసంహర!**
**మహిత! భవ్యతనో! పశునాయక! ॥ 24**

**ప్రతిపదార్థము :** ద్రుత = త్వరితము మరియూ (ద్రుతమ్ = ద్రవంత్యనేనేతి ద్రుతం. ద్రు గతౌ– దీనిచేత పరుగెత్తుదురు); విలంబిత = జాగు చేయబడిన; భక్తి = భక్తి యొక్క; సమాశ్రయాత్ = అతిశయమైన ఆశ్రయము వలన; ద్రుత విలంబిత = తొందరగాను, ఆలస్యము గాను; సత్ఫలద = మంచి ఫలితాలను అందించువాడా!; హర = భక్తుల పీడను హరించువాడా! ప్రళయ కాలమున సర్వమును హరించువాడా!

(హృ హరణే); శివ = శుభాలను ఇచ్చేవాడా!; ఆద్య = మొదటివాడా! (ఆదౌ భవ ఇత్యాద్యః); భవ = అంతయూ తానయగువానికి (భవతి భవతే వా సర్వమితి భవః); అంతక = యముని (అంతం నాశం కరోతీతి ఇత్యంతకః – డుకృఞ్ కరణే– నాశనము చేయువాడు); సంహర! = నిగ్రహించువాడా!; మహిత = మహితమను పేరు కలిగిన శూలము కలిగినవాడా! గొప్పవాడా!; భవ్యతనో! = శుభమైన (యోగ్యమైన, సత్యమైన) శరీరము కలవాడా!; పశునాయక = పశువులనగా జీవులు, వారిని సంసార బంధము వలన రక్షించువాడా!; మామ్ = నన్ను; అవ = రక్షించుము.

**తాత్పర్యము :** ఓ శివా! తొందరగా ఫలితాలు రావాలనుకొని లింగాకారంలో నీ పూజ చేయు భక్తులకు వెంటనే ఫలితాలు అనుగ్రహిస్తావు. జాగుచేస్తూ నీ విగ్రహాకారంలో భక్తిని ప్రకటించే భక్తులకు ఆలస్యంగా ఫలితాలు అందచేస్తావ్. నువ్వు భక్తుల పీడను హరించువాడివి. మహితమను పేరు కలిగిన శూలము కలిగినవాడివి. శుభమైన శరీరము కలవాడివి. జీవులను సంసార బంధము నుండి రక్షించువాడివి. నన్ను రక్షించుము.

**విశేషాలు :**

**1. ద్రుతవిలంబితము :** ఈ శ్లోకం ద్రుతవిలంబితము నకు చెందినది. ఈ ఛందస్సుకే సుందరీ, హరిణప్లుతా అనే ఇతర నామములు కూడా ఉన్నాయి. వృత్తం రకానికి చెందినది. జగతి ఛందమునకు చెందిన 1464 వ వృత్తమిది. ఇందులో 12 అక్షరములు ఉంటాయి.

మాత్రా శ్రేణి: I I I - U I I - U I I - U I U
మిశ్రగతి శ్రేణి (3–4) : I I I - U I I - U I - I U I – U
మిశ్రగతి శ్రేణి (5–4) : I I I U - I I U - I I U I – U

4 పాదములు ఉంటాయి. ప్రతి పాదములోను న, భ, భ, ర గణములుంటాయి. ద్రుత విలంబిత వృత్తాన్ని శంకర భగవత్పాదులు శివానందలహరిలో ఇలా అందంగా ప్రయోగించారు.

సదుపచార విధీష్వనుబోధితాం
సవినయాం సహృదం సదుపాశ్రితామ్ ।
మమ సముద్ధర బుద్ధిమిమాం ప్రభో
వరగుణేన నవోఢవధూమివ ॥ – శివానందలహరి (78)

బుధుల సేవ రీతి కొలది యెరుగు దేను (సహృదయము నిండునట్లుగా మంచిగా పండితులకు సేవ చేసే రీతి నాకు తెలుసు. ఓ శివా! వధువు గుణాన్ని వరుడు పెంచునట్లుగా నా బుద్ధిని పెంచవయ్యా!)

**2. ద్రుత విలంబితము :** ద్రుతవిలమ్బితము అంటే శీఘ్రము మరియూ నెమ్మదిగా ఉండే కదలిక. ఈ అర్థంలో ద్రుత విలంబితమను వృత్తపు పేరును ద్రుత విలంబిత శ్లోకంలో చెఱువువారు చక్కటి అర్థంతో పొదిగారు.

శివమహాపురాణం విద్యేశ్వరసంహిత నాలుగు, అయిదు అధ్యాయాలు నమ్మిన భక్తుడికి సులభంగా, తొందరగా ముక్తిని ప్రసాదించే శక్తి శివునికి ఉందని చెబుతున్నాయి. ఆ శివుడు నిరాకారుడిగానూ, సాకారుడిగానూ ఉంటాడు. నిరాకారుడిగా ఉన్న ఆ స్వామికి గుర్తు శివలింగం. దీనిని అర్చించినవారు, సాకారాన్ని అర్చించిన వారికంటె శీఘ్రంగాను, అత్యధికంగాను ఫలితాలు అందుకొంటారు.

శివానుగ్రహము తొందరగా లభించాలంటే లింగార్చన చేయాలని మహాభారతం చెబుతోంది. శివుడిని విగ్రహాకారంలో పూజచేసిన అశ్వత్థామ కంటె లింగాకారంలో పూజ చేసిన కృష్ణార్జునులు అత్యధిక బలవంతులవుతారు. (తిక్కన ద్రోణపర్వము- పంచమాశ్వాసము 419 వచనము) ఏరకంగా శివారాధన చేసినా కోరికలు నెరవేరుతాయి. కాకపోతే తొందరగా, అత్యధికంగా ఫలితాలు రావాలంటే శివుని లింగాకారపూజ చేయాలని భావం. దీనినే చెఱువువారు "ద్రుత విలంబిత భక్తి" అన్నారు.

విలంబిత, ద్రుతమ, మధ్యములనెడి లయ విశేషాలు వరుసగా తత్త్వ, ఓఘ, ఘనములను పేర్లతో పిలుస్తారు. స్థానము నుండి చ్యుతమైన స్వరము తన స్థానము నతిక్రమించినచో సామగానమును చేసేవారు విస్వరమంటారు. వీణాగానము చేసేవారు విరక్తమందురు. అభ్యాసము కొఱకు ద్రుత వృత్తిని, ప్రయోగము కొఱకు మధ్యమావృత్తిని, శిష్యోపదేశము కొరకు విలంబిత వృత్తినాశ్రయించాలని నారద పురాణములో ఈ ద్రుతము మొదలైన పదాలను వివరించారు. (నారద పురాణము. యాబదియవ అధ్యాయము, అభ్యాసార్థే ద్రుతాం వృత్తిం ప్రయోగార్థే తు మధ్యమామ్. 100 శ్లో శిష్యాణాముపదేశార్థం కుర్యాద్వృత్తం విలంబితామ్ 101 శ్లో) నటరాజు అయిన శివుని లయ విశేషాలను సూచించే ద్రుతాది పదాలను కూడా చెరువు వారు

ప్రయోగించిన ద్రుత విలంబిత సమాసం భంగ్యంతరంగా తెలియచేస్తోంది.

**3. భక్తి :** అర్చన (1. రంగవల్లి, 2. చందనము, 3. అక్షతలు, 4. పుష్పము, 5. ధూపము, 6. దీపము, 7. నైవేద్యము, 8. తాంబూలము.) పూజ మొదలైనవి చేయడం ద్వారా వ్యక్తమయ్యే భావనను భక్తి అంటారు. భక్తి అంటే సేవా భావం అనే అర్థం కూడా ఉంది. "భజతమంతః కరణస్య భగవదాకారం", "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" అని భక్తికి నిర్వచనాలు ఉన్నాయి.

బాహ్య భక్తి, అనన్య భక్తి, ఏకాంత భక్తి అని భక్తి మూడు రకాలు అని కొందరన్నారు. భాగవత వాత్సల్యం, భగవంతుని పూజించే చిత్తవృత్తి, అర్చన, భగవిద్విషయాల పట్ల ఆసక్తి, భాగవత కథాశ్రవణేచ్ఛ, స్వర నేత్ర అంగవికారం, దైవస్మరణ, అమాంస భక్షణం – అని భక్తిని ఎనిమిది విధాలుగా ఇంకొందరు చెప్పారు. 1. శ్రవణం (హరికథలు, పురాణాదులను వినడం), 2. కీర్తనం, 3. స్మరణం (దైవనామాన్ని స్మరిస్తుండటం), 4. పాదసేవనం (సద్గురు సేవ), 5. అర్చనం, 6. వందనం, 7. దాస్యం, 8. సఖ్యం, 9. ఆత్మనివేదనం. (శ్లో॥ శ్రవణం, కీర్తనం, విష్ణోః, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యమాత్మనివేదనం.) అని భక్తి తొమ్మిది విధాలని భాగవతం చెప్పింది.

భక్తిభూమికలు 11. (భూమిక = ప్రదేశము, రచన) అవి 1.మహాత్ముల సేవ, 2. వారి దయాపాత్రత, 3. వారి ధర్మములయందు శ్రద్ధ, 4. హరిగుణశ్రవణము, 5. ప్రేమాంకురోత్పత్తి, 6. స్వరూప ప్రాప్తి, 7. ప్రేమవృద్ధి, 8. పరమానంద స్ఫురణము, 9. భాగవత ధర్మమునందు నిష్ఠ, 10. తనయందా గుణములు ప్రాకట్యము, 11. ప్రేమయొక్క పరాకాష్ఠ. (భక్తిరసాయనము)

**4. సమాశ్రయము :** సమాశ్రయము అంటే పూర్తిగా ఆధారపడిపోవటం. సమ్ (అతిశయము) అను ఉపసర్గతో ఆశ్రయము అను పదాన్ని కలిపితే సమాశ్రయము ఏర్పడుతోంది.

**5. అంతక సంహార :** మార్కండేయ వృత్తాంతంలోను, శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం లోను యముడు శివునిచేత భంగపాటు పడిన సందర్భాలు ప్రసిద్ధాలు. ఈ సమాసంలో యమునికంటె శివుడు గొప్పవాడని చెప్పుట మాత్రమే తాత్పర్యం. దేశంలో ఎక్కడా లేనివిధంగా ఒకే పానవట్టం మీద కాలుడు – శివుడు (యముడు, శివుడు) వెలసిన

ఏకైక క్షేత్రం కాళేశ్వరం. కాలుని (యమధర్మరాజు) కోసం నిర్మించబడిన నగరంలో ఈశ్వరుడు వెలసినందున ఈ క్షేత్రం కాళేశ్వరంగా పిలుస్తారు. ఆలయంలో యమకోణం ఉంది. ఇందులో నుండి బయటకి వస్తే యమదోషం పోతుందంటారు.

**6. శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు శివుడు. బ్రహ్మానంద స్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు. ఆ శివుడు విలంబితము (ఆలస్యము) కాకుండా ద్రుతము గానే (వెంటనే) మనలను అనుగ్రహించాలని కోరుకొందాం. ఎందుకంటే మనం కూడా శివుని లింగాకార పూజ చెఱువువారి శ్లోకాలలో చేస్తున్నాం కదా!



**శ్లో॥ వందే సర్వధురంధర – మిందీవరబంధుకంధరాభ్యర్ణమ్ ।**
**సుందరరూపమధీశమ్ – వందారుం పాతు మాం సదా సోఽయమ్ ॥ 25**

**ప్రతిపదార్థము :** సర్వధురంధరమ్ = ఈ సంసారములోని అందరి జీవుల బరువులను మోసెడివానికి (వహప్రాపణే– ధురం వహతీతి); ఇందీవర = నల్లకలువకు (1.ఇంది అనగా లక్ష్మి. ఆమెచేత వరింపబడినది. 2.ఇంద్రియములను సంతోషము చేత కప్పునది); బంధు = చుట్టమయిన నల్లని మచ్చ; కంధర = మెడ (ధృ ధారణే – శిరస్సును ధరించునది); అభ్యర్ణమ్ = దగ్గనున్నవానికి (అర్థ గతౌ యాచనేచ– అభ్యర్థత ఇత్యభ్యర్ణః – పొందబడునది); సుందరరూపమ్ = అందమైన రూపముగలవానికి (సున్దరమ్ = దృజ్ ఆదరే. బాగా సంతోష పెట్టునది); అధీశమ్ = సమస్తసామంతుల చేత సేవింపబడిన రాజుకు (ఈశ ఐశ్వర్యే); సోఽయమ్ = సః + అయమ్ = అట్టి ఉదాత్తునికి, శివునికి; వందారుమ్ = గోత్రనామములు చెప్పి పాదములు సోకి మొక్కుచున్నాను (వది అభివాదనస్తుత్యోః – మ్రొక్కుస్వభావము కలవాడు); వందే – నమస్కరించుచున్నాను; మామ్ = నన్ను; సదా – ఎప్పుడు; పాతు = రక్షించుగాక! (పారక్షణే).

**తాత్పర్యము :** ఈ సంసారములోని అందరి జీవుల బరువులను మోసెడివానికి, నల్లకలువకు చుట్టమయిన నల్లని మచ్చ మెడదగ్గ నున్నవానికి, అందమైన రూపముగలవానికి, సమస్త సామంతుల చేత సేవింపబడిన రాజుకు, శివునికి, నేను గోత్రనామములు చెప్పి పాదములు సోకి మొక్కుచున్నాను. నమస్కరించుచున్నాను. అతడు నన్ను ఎప్పుడు రక్షించుగాక!

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం ఆర్యా వృత్తములో ఉన్నది. (ఆర్యా వృత్తము ఇంచుమించుగా మన కంద పద్యము వంటిదే.)

ఆర్యా వృత్త లక్షణములు : ఒకటి రెండు పాదాలను కలిపి పూర్వార్ధము అంటారు. మూడు నాలుగు పాదములు ఉత్తరార్ధమని అంటారు. చతుర్మాత్ర గణాలు ఏడుండాలి. ఆపైన గురువు ఉండాలి. చతుర్మాత్రా గణాలు అంటే నాలుగు మాత్రల కాలములో పలికే గణాలు (4 చిటికెల కాలము) అని అర్థం. బేసిని – అంటే విషమస్థానంలో జగణం వాడరాదు. అనగా1, 3, 5, 7 గణాలలో "జగణం" ఉండకూడదు. 6 వ గణం లో తప్పనిసరిగా "జగణం" లేక "నలము" ఉండాలి. ఉత్తరార్ధంలో ఆరవగణంగా ఒక్క లఘువు మాత్రమే ఉండాలి. ఎనిమిదవ గణంగా పూర్వ ఉత్తరార్థాలలో గురువుండాలి. పూర్వార్ధంలో ఆరవ గణములో తొలి లఘువు తర్వాత యతి. ఏడవ గణములో నలముంటే ఆరవ గణము ముగిసిన తర్వాత యతి. ఉత్తరార్ధంలో (అయిదవ గణంగా నలముంటే) నాల్గవ గణము తర్వాత యతి.

UU UUI UII
వందే సర్వ ధు రంధర
UU IIU IUI UU U
మిందీ వర బం ధు కంధ రాభ్య ర్ణం

UII UII UU
సుందర రూప మ ధీశమ్
UU UU I U I U U U
వందా రుం పా తుమాం స దాసో యం

**2. ధురంధర :** ధురంధర పదాన్ని నేర్పు కలవాడా అను అర్థంలో కొందరు కవులు ప్రయోగించారు. సాగర మేఖలా మహీభరణ ధురంధర! (పోతన భాగవతం 4–974) సముద్రములే మేఖలా సరిహద్దులుగా గల భూమండలమును పాలించుటలో మిక్కిలి నేర్పు గల వాడా! "గీర్వాణాంధ్ర గిరాం ధురంధర మతి స్నిగ్ధ ప్రచారోచ్యతే" అని తన శతావధానములో చెళ్ళపిళ్ళ వారు తన మీసాలను వర్ణించే సందర్భంలో ధురంధర పదాన్ని నేర్పు గల అను అర్థంలో ప్రయోగించారు. కొందరు కవులు బరువును

మోయువాడా అను అర్థంలోనే ప్రయోగించారు. విశ్వభువనైక ధురంధర! (పారిజాతాపహరణము – ముక్కు తిమ్మన తృతీయాశ్వాసము 39 పద్యం). ధురంధర శబ్దానికి నేర్పుగల, బరువు మోయు అను రెండు అర్థాల్లోను ప్రయోగాలున్నాయని సారాంశం.



**శ్లో॥ ఆర్యా సంగతమార్యం – సూర్యాన్తర్భాసమానమసమానమ్ ।**
**ఆర్యా గీత్యా సంస్తౌ – మ్యార్యం హ్యార్యేషు మాం సదా కుర్యాత్ ॥ 26**

**ప్రతిపదార్థము :** ఆర్యా = పూజ్యురాలగు పార్వతి; సంగతమ్ = మనస్సును పొందిన వానిని; సూర్యాన్తః = సూర్య + అన్తః = సూర్యుని లోపల; భాసమానమ్ = ప్రకాశించుచున్న; అసమానమ్ = సాటి లేని; ఆర్యమ్ = పూజ్యుని శివుని; ఆర్యా గీత్యా = ఆర్యాగీతితో; సంస్తౌమి = స్తుతించుచున్నాను; ఆర్యేషు = పూజ్యులయందు; మామ్ = నన్ను; ఆర్యమ్ = గౌరవనీయునిగా; సదా = ఎప్పుడు ఆ శివుడు; కుర్యాత్ హి = చేయుగాక!

**తాత్పర్యము :** పూజ్యురాలగు పార్వతి మనస్సును పొందిన వానిని, సూర్యుని లోపల ప్రకాశించుచున్న సాటిలేని పూజ్యుని, శివుని, ఆర్యాగీతితో స్తుతించుచుచున్నాను. పూజ్యులయందు నన్ను గౌరవనీయునిగా ఎప్పుడు ఆ పరమశివుడు చేయుగాక!

**నిఘంటు విశేషాలు :**

1. సంగతమ్ : సంగచ్ఛతే మన ఇతి సంగతమ్ – సంపూర్వో గమ్ గతావితి ధాతుః – మనస్సును లెస్సగా పొందునది.

2. ఆర్య : ఆరాత్ పాప కర్మభ్యో యాతీత్యార్యః – పాపకర్మములకు దూరముగా బోవువాడు. ఆరణీయః అభిగమ్యో వా ఆర్యః – పూజ్యుడైనందున అందరి చేతను సేవింపదగినవాడు.

3. ఆర్యా : శ్రేష్ఠత్వాత్ ఆర్యా – శ్రేష్ఠురాలు (అమరకోశము– గురుబాల ప్రబోధిక)

4. సంస్తౌమి : ష్టుఞ్ స్తుతౌ – అదాది గణము) సమ్ (ఉపసర్గ) + స్తౌమి లట్ కర్తరి ప్రయోగము ఉత్తమపురుష ఏకవచనము.

5. కుర్యాత్ : డుకృఞ్ కరణే – తనాది గణము పరస్మై పది విధి లిఙ్

**విశేషాలు :**

**ఆర్యాగీతి :** ఈ శ్లోకం ఆర్యా గీతిలో ఉంది. చెఱువు వారే ఆ విషయాన్ని శ్లోకంలో స్పష్టంగా చెప్పారు. ఆర్యావృత్త పూర్వార్ధలక్షణమే పూర్వార్ధంలోనూ, ఉత్తరార్ధంలోనూ ఉంటే దాన్ని ఆర్యాగీతి అంటారు. దానికి పూర్వార్ధంలోనూ, ఉత్తరార్ధంలోనూ ఒక గురువును కలిపితే అది తెలుగు కందం. (డా. సూరం శ్రీనివాసులుగారు వాట్సప్ లో పంపిన సందేశం 29-05-2016)

ఆర్యా వృత్త లక్షణాలు 25వ శ్లోకవివరణలో పొందుపరచబడినాయి. మన తెలుగులోని కందమునకు ఆర్య యందలి ఆర్యాగీతికిని గణములలో ఎట్టి భేదము లేదు. ఆర్యాగీతులు పాడుకొనే లక్షణం ఇదివరకటి ప్రజా జీవనంలో ఉండేది.

మాత్రసంచి తలాడగా, మార్గవేది
నొక్క డార్యలు, గీతు లొండొకడు, దా సు
భాషితంబులుగా, దోడి బ్రాహ్మణౌఘ
ముబుసుపోకకు జదువ బరున్న వేళ.(ఆముక్తమాల్యద ద్వితీయాశ్వాసము)

భుజానికి అటూ యిటూ వేలాడే మూటలతో ఉండే మాత్ర సంచిని తలగడగా పెట్టుకొని పరదేశ బ్రాహ్మణుడు కూడా నడుం వాల్చాడు. తోటి వారు వచ్చిన శ్లోకాలు చదవడం మొదలుపెట్టారు. ఒకరేమో ఆర్యలు చదువుతూ ఉంటే మరొకరు ఆర్యా గీతలు పాడుతున్నారు.

**సూర్యాన్తః :** ఉదయించే సూర్యుని బ్రహ్మగా మధ్యాహ్న సూర్యుని విష్ణువుగా; సాయంకాల సూర్యుని శివునిగా వివరిస్తారు. ఆరోగ్యము కావాలనుకొని ప్రతిరోజూ చాలా మంది చదువుకొనే "నమః సవిత్రే జగదేక చక్షుషే జగత్ప్రసూతస్థితినాశ హేతవే త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించి నారాయణ శంకరాత్మనే" అని ప్రసిద్ధమైన సూర్యస్తుతి శివాత్మకునిగా సూర్యుని చెబుతోంది. శివుని అష్ట మూర్తులలో సూర్యుడు కూడా ఒకటి.

**ముగింపు :** ఆర్య పదమును చెఱువువారు ఈ శ్లోకములో అయిదు సార్లు అందంగా ప్రయోగించారు. పూజ్యులయందు తనను గౌరవనీయునిగా చేయమని శివుని బాలకవిగా కోరుకొన్నారు. వారి కోరిక నెరవేరింది.



**శ్లో॥ అభవ! కమలవిలసితపదయుగ్మే**
**జటిల! కమలవిలసితపదజాలైః ।**
**స్తుతిమనిశమకరవమను గృహాణ**
**ప్రణయహృదయకమలవిలసితాప్త్యా ॥ 27**

**ప్రతిపదార్థము :** అభవ! = పుట్టుకలేనివాడా! ఓ శివా!; కమల = కమలములవలె; విలసిత = ప్రకాశించు; పదయుగ్మే = పాదముల జంట కలవాడా!; జటిల! = ఓ జడలు గల సన్న్యాసీ! శివా!; కమల విలసిత = కమలవిలసితమను ఈ వృత్తమునందున్న; పదజాలైః = పదముల సమూహములతో; స్తుతిమ్ = నీ స్తోత్రమును; అనిశమ్ = ఎల్లప్పుడు; అకరవమ్ = చేయుదును; ప్రణయ = ప్రేమతో వికసించిన; హృదయ కమల = హృదయ కమలము నందు; విలసితాప్త్యా = విలసిత + ఆప్త్యా = ప్రకాశించు స్నేహముతో, కలిమితో; అను గృహాణ = అనుగ్రహించుము.

**తాత్పర్యము :** కమలములవలె ప్రకాశించుపాదముల జంట కలవాడా! ఓ జడలు గల సన్న్యాసీ! శివా! కమలవిలసితమను ఈ వృత్తమునందున్న పదముల సమూహములతో నీ స్తోత్రమును ఎల్లప్పుడు చేయుదును. ప్రేమతో వికసించిన నీ హృదయ కమలము నందు ప్రకాశించు స్నేహముతో నన్ను అనుగ్రహించుము.

**ఇతర విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం కమలవిలసిత ఛందస్సుకు చెందినది. ఈ పద్య ఛందస్సుకే సురుచిర, ఉపచిత్ర, సుపవిత్ర అనే ఇతర నామములు కూడా కలవు. వృత్తం రకానికి చెందినది. శక్వరి ఛందమునకు చెందిన 4096 వ వృత్తము. 14 అక్షరములు ఉండును. 16 మాత్రలు ఉండును.

మాత్రా శ్రేణి: I I I - I I I - I I I - I I I - U U చతుర్మాత్రా శ్రేణి: I I I I - I I I I - I I I I - U U షణ్మాత్రా శ్రేణి: I I I I I I - I I I I I I - U U మిశ్రగతి శ్రేణి (3–4) : I I I - I I I I - I I I - I I U - U మిశ్రగతి శ్రేణి (4–3) : I I I I - I I I - I I I I - I U - U మిశ్రగతి శ్రేణి (3–5) : I I I - I I I I I - I I I - I U U మిశ్రగతి శ్రేణి (5–4) : I I I I I - I I I I - I I I U – U

4 పాదములు ఉండును. ప్రతి పాదములో న , న , న , న , గా(గగ) గణములుండును

గణ విభజన

న న న న గా

| | | | | | | | | | | | U U

అ భ వ క మ ల వి ల సి త ప ద యు గ్మే

న న న న గా

| | | | | | | | | | | | U U

జ టి ల క మ ల వి ల సి త ప ద జా లైః

న న న న గా

| | | | | | | | | | | | U U

స్తు తి మ ని శ మ క ర వ మ ను గృహా ణ

న న న న గా

| | | | | | | | | | | | U U

ప్ర ణ య హృ ద యక మ ల వి ల సి తా ప్త్యా

**2. అభవ :** "మఱచి యజ్ఞాన కామ కర్మముల దిరుగు
వేదనాతురులకు దన్నివృత్తి జేయ
శ్రవణ చింతన వందనార్చనము లిచ్చు
కొకు నుదయించి తండ్రు నిన్ గొంద భవ! (1-197-తే.)

అనుచోట "అభవ" అను ప్రయోగము కృష్ణ పరంగా భాగవతంలో కనబడుతోంది.

"విను; నీ కపరాధుఁడ నగు
నను దండించు టది దండనము గాదు మది
న్నను రక్షించుటగా మన
మున దలతును దేవ! యభవ! పురహర! రుద్రా! (4-159-క.)

అనుచోట అదే భాగవతములో "అభవ" పదప్రయోగము శివపరంగా కూడా కనబడుతోంది.

దీక్షితారు వారు శ్రీ మూల-ఆధార చక్ర వినాయక అను తన కీర్తనలో "అభవ ప్రసిద్ధ గజ గ్రీవ" అని వినాయకుని అభవునిగా కీర్తించారు.

ఇలా అనేకమంది దేవుళ్ల పరంగా ఒకటే అభవ పదం కనబడుతోంది. దీనినిబట్టి ఉన్నది ఒకటే అను భావన దృఢం కావాలి. “ఏకంసత్విప్రా బహుధా వదంతి” అని వేదం, “అన్ని నీ వనుచు అంతరంగమున తిన్నగాను వెదకి తెలిసికొంటిని” అని త్యాగరాజు – ఇదే విషయాన్ని నొక్కి చెప్పారు.

**3. కమల :** కమల అను పదానికి జింక అను అర్థం కూడా ఉంది. పోకూరి కాశీపతి (1892–1974) ‘సారంగధరీయం’లోని (త్ర్యర్థి కావ్యం) మొదటి పద్యములో “సారంగ ధరుండు మత్కృతి పతిన్ సామోదునిం జేయుతన్” అన్నాడు. శివుడు సారంగ ధరుడు. సారాణి అంగాని యస్య సః సారంగః– మంచి అవయవములు కలిగిన జింకను సారంగము అంటారు. జింకను ధరించినవాడు శివుడు. అందుకే కమల విలసిత పదయుగ్మే అను చోట జింక చేత విలసిల్లు పదములు కలవాడా!” అను అర్థం కూడా సమన్వయించుకోవచ్చు. శివుడు పట్టుకొన్న జింక నాలుగు కాళ్లు చతుర్వేదాలకు ప్రతీక అని చెబుతారు.

**ముగింపు :** కమలము మృదువైనది. కమల విలసితము అను ఈ వృత్తములోని పదప్రయోగశైలి కూడా చెఱువు వారి హృదయమంత మృదువైనది. వారి మృదువైన ఆత్మీయతను వ్యక్తిగతంగా కూడా అనుభవించిన ఈ హృదయము – కమల పద విలసితమైన చెఱువు వారి ప్రతిభను కొనియాడకుండా ఎలా ఉండగలదు?!



**శ్లో॥ భవమజమవితారం సర్వలోకైకనాథం**
**జటిలమభవమాద్యం సర్వదా తారమీశమ్ ।**
**హరమమరపతిం త్వాం వందనీయం నమామి**
**త్వమవ పృథుకమేనం సత్యనారాయణం మామ్ ॥ 28**

**ప్రతిపదార్థము :** భవమ్ = అంతయూ తానేయగువానిని; అజమ్ = పుట్టువు లేనివానిని (న జాయతే నోత్పాద్యతే యః); అవితారమ్ = రక్షకుని(అవితృ); సర్వ లోకైక నాథమ్ = సర్వ లోక + ఏక నాథమ్ = అన్నిలోకములకు ఒకే ఒక దిక్కయిన వానిని (ప్రభువయిన); జటిలమ్ = జడలు గల సన్న్యాసిని; అభవమ్ = శాశ్వతుని (శంకరనారాయణ తెలుగు–ఇంగ్లీష్ నిఘంటువు); ఆద్యమ్ = మొదటి వానిని; తారమ్ = మహాదేవుని (హలాయుధ కోశము); సర్వదా = ఎల్లప్పుడు; ఈశమ్ = ఐశ్వర్య

యుక్తుడైనవానిని; హరమ్ = ప్రళయ కాలమున సర్వమును హరించువానికి, భక్తుల పీడను హరించువానికి, అయస్కాంతము ఇనుమును ఆకర్షించునట్లు అందరు జీవులను ఆకర్షించువానిని (హృ హరణే); అమర పతిమ్ = దేవతలకు ప్రభువైనవానిని; త్వామ్ = నిన్ను (దకారాంత పుంలింగ యుష్మత్ శబ్దము ద్వితీయా విభక్తి ఏక వచనమ్); త్వమ్ = దేహేంద్రియాలకు అతీతమైన, సాక్షీభూత చైతన్యమే త్వం పదార్థం. త్వంపద వాచ్యార్థుడు జీవుడు, లక్ష్యార్థుడు పరమాత్మ. అటువంటి పరమాత్మ అయిన నిన్ను; వందనీయమ్ = వందనమునకు అర్హుడైనవానిని; నమామి = నమస్కరించున్నాను; మామ్ = నన్ను (దకారాంత పుంలింగమ్ అస్మత్ శబ్దము ద్వితీయా విభక్తి ఏక వచనము); పృథుకమ్ = పిల్లవాడినగు (అధికముగా మొరపెట్టువాడు పృథుకుడు. కై శబ్దే. అమరకోశము); సత్యనారాయణమ్ = సత్యనారాయణుని; ఏనమ్ = వీనిని (మకారాంత పుంలింగ శబ్దము ఇదమ్ శబ్దం ద్వితీయా విభక్తి ఏక వచనము); అవ = రక్షించుము.

**తాత్పర్యము :** ఓ శివా! నువ్వు అంతయూ తానేయగువాడివి. పుట్టువు లేనివాడివి, రక్షకుడివి, అన్ని లోకములకు ఒకే ఒక దిక్కయినవాడివి, జడలు గల సన్యాసివి. పుట్టుక లేనివాడివి. మొదటి వాడివి. మహాదేవుడివి, ఎల్లప్పుడు ఐశ్వర్యయుక్తుడైనవాడివి, భక్తుల పీడను హరించువాడివి. దేవతలకు ప్రభువైనవాడివి. దేహేంద్రియాలకు అతీతమైన, సాక్షీభూత చైతన్యమే త్వం పదార్థం. ఆ త్వంపద వాచ్యార్థుడు జీవుడు, లక్ష్యార్థుడు పరమాత్మ. అటువంటి పరమాత్మ అయిన నీకు – వందనమునకు అర్హుడైన నీకు – నమస్కరించున్నాను. నన్ను– పిల్లవాడినగు – వీనిని – సత్యనారాయణుని రక్షించుము.

**విశేషాలు :**

**ఛందస్సు :** ఈ శ్లోకం మాలిని వృత్తానికి చెందినది. మాలినీ ఛందస్సుకే నాందీముఖీ అనే ఇతర నామము ఉంది. అతిశక్వరి ఛందమునకు చెందిన 4672 వ వృత్తము. 15 అక్షరములు, 22 మాత్రలు ఉంటాయి. 4 పాదములు ఉంటాయి. ప్రతి పాదములోను న , న , మ , య , య గణములుంటాయి.

శంకర భగవత్పాదులు తన అవతారం పూర్తవుతున్న సమయంలో ఐదు శ్లోకాలు చెప్పారు. వీటికే 'సోపాన పంచకం' అని పేరు. ఇందులో మూడవ శ్లోకములో " వాక్యార్థశ్చ విచార్యతాం । శృతిశిరఃపక్షస్సమాశ్రియతాం" అన్నారు. "తత్త్వమసిమహా

వాక్యముయొక్క జీవబ్రహ్మలకు అభేదమనే అర్థము ఎప్పుడూ విచారింపబడుగాక" అని ప్రబోధము. అనగా త్వం పదానికి తత్పదానికి వాచ్యార్థము లేమిటి? వాచ్యార్థములగు జీవేశ్వరులకు ఉన్న తేడా నిజమయిన తేడానా? లేక ఉపాధులద్వారా వచ్చిన తేడా అని విచారించాలి.

ఒకే ఆకాశం రెండుపాత్రలలో రెండు ఆకాశములయింది. రెండుపాత్రలుపోతే ఆకాశం ఒకటే. అలాగే మాయ అంతఃకరణలు అనే ఉపాధులద్వారా జీవుడని ఈశ్వరుడని తేడా వచ్చింది. జ్ఞానంతో ఆ ఉపాధులను తీసివేస్తే జీవేశ్వరులు అఖండ సచ్చిదానంద స్వరూపులు. ఇది తెలిసినట్లే ఉంటుంది. ఒక్కరోజులో అంతుచిక్కదు. విచారించి తెలుసుకొంటుంటే స్వామి దయతో అంటుకొంటుంది. ఎనిమిదేళ్ల చిన్న వయస్సులో చెఋవు వారికి ఈ "త్వంపదార్థాన్వేషణ" మొదలయింది. అందుకే ఈ శ్లోకంలో త్వం పదప్రయోగము చేసారు.

"అహరహర్గర్వః పరిత్యజ్యతాం" ప్రతిరోజు, నేను జ్ఞానిని, కృతార్థుడను అనే అహంకారము, విడిచిపెట్టబడుగాక అని కూడా శంకరులు ఈ సోపాన పంచక శ్లోకంలో చెప్పారు. ఆ బోధను అనుసరించి ప్రయోగింపబడినదే చెఋవు వారి శ్లోకంలోని పృథుక పదం. ఎంత పెద్ద వయస్సు వచ్చినా తండ్రి ముందు ఎంత వారయినా చిన్నవారే. శివయ్య మన తండ్రి. ఆయన ముందు చిన్నపిల్లవాడిని. నన్ను రక్షించు అని మోకరిల్లటం – గర్వాన్ని తగ్గిస్తుంది. జ్ఞాన సముపార్జనకు కూడా దారితీస్తుంది ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే శివయ్యను గూర్చి శాస్త్రిగారు చిన్నతనంలో వ్రాసిన ఈ శ్లోకాలు సార్వ జనీనాలు, సార్వకాలికాలు అని. అంతకంటె రచనకు గొప్పతనం ఏముంటుంది?



**శ్లో॥ సింహవాహాపతే! స్వర్గగేహప్రభు**
**స్తుత్య! మాం సర్వదా సత్యనారాయణమ్ ।**
**త్వత్పదాంభోజయుగ్మద్విరేఫాయితం**
**భక్తియుక్తిం విధేయం విధేహి ప్రభో ॥** **29**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ ప్రభూ! శివా; సింహవాహాపతే = సింహము వాహనముగా గల పార్వతీదేవికి భర్తయైనవాడా!; స్వర్గ గేహ ప్రభు = స్వర్గము ఇల్లుగా గల ఇంద్రునికి ప్రభువైన వాడా!; స్తుత్య = స్తుతింపదగిన వాడా!; త్వత్పదాంభోజ = త్వత్ + పద +

అంభోజ = నీ పాదములనెడి పద్మముల; యుగ్మ = జతకు; ద్విరేఫాయితమ్ = ద్వి రేఫ + ఆయితమ్ = రెండు రేఫములు కల తుమ్మెదగా సిద్ధమైనవాడిని; భక్తియుక్తిమ్ = సేవా బుద్ధితో కూడినవాడిని; విధేయమ్ = వినయము కలిగినవాడిని అగు; మామ్ = నన్ను; సత్యనారాయణమ్ = ఈ సత్యనారాయణుని; సర్వదా = ఎప్పుడూ; విధేహి = ధరింపుము.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! శివా! సింహము వాహనముగా గల పార్వతీదేవికి భర్తయైనవాడా! స్వర్గము ఇల్లుగా గల ఇంద్రునికి ప్రభువైన వాడా! స్తుతింపదగిన వాడా! నీ పాదములనెడి పద్మముల జతకు రెండు రేఫములు కల తుమ్మెదగా సిద్ధమైనవాడిని. సేవా బుద్ధితో కూడినవాడిని, వినయము కలిగినవాడిని, ఈ సత్యనారాయణునిలో ఎప్పుడూ నీలో నిలుపుకొనుము.

**విశేషాలు :**

**ఛందస్సు :** ఇది స్రగ్విణీ (లక్ష్మీధర, పద్మినీ) వృత్తం. జగతి ఛందమునకు చెందిన 1171 వ వృత్తమిది. 12 అక్షరములు ఉంటాయి. 20 మాత్రలు 4 పాదములు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగులో ప్రతి పాదములో 7 వ అక్షరము యతి స్థానము. ప్రతి పాదములో ర , ర , ర , ర గణములుంటాయి.

ప్రభు :

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

(పరమేశ్వరుడు జీవులకు కర్తృత్వంకాని, కర్మలుకాని, కర్మఫలాపేక్ష కాని కలగజేయడం లేదు. ప్రకృతులూ, ప్రారబ్ధాలూ కర్తృత్వాదులకు కారణాలవుతాయి. 05-14) అని భగవద్గీత ప్రభువైన పరమేశ్వరుని కృత్యాన్ని నిర్వచించింది. (ప్రభవతీతి ప్రభుః)

**సింహవాహ :** నవదుర్గలలో ఒకరయిన కాత్యాయనీ దేవి సింహవాహన. (ప్రథమం శైలపుత్రీ చ ద్వితీయం బ్రహ్మచారిణీ। తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్। పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతి చ। సప్తమం కాలరాత్రీతి మహాగౌరీతి చాష్టమమ్ । నవమం సిద్ధిదాత్రీ చ నవదుర్గాః ప్రకీర్తితాః । ఉక్తాన్యేతాని నామాని బ్రహ్మణైవ మహాత్మనా ।) (ఏనుగులు మొదలైన మృగాలను హింసించునది కనుక సింహము అని పేరు వచ్చింది. హిసి హింసాయాం)

**విధేహి :** దా ఉభయ – ఉంచుట – లోట్ మధ్యమ పురుష ఏకవచనము.

**స్వర్గ గేహ :** లెస్సగా సుఖము అనుభవింపబడునది స్వర్గము.(సుష్ఠు అర్జ్యతే అస్మిన్నితి స్వర్గః.) పురుషుని చేత సంపాదింపబడిన ధనమును గ్రహించునది గేహము. (గ్రహ ఉపదానే)



**శ్లో॥ సర్వలోకస్తవోత్థానురాగాఽపిత**
**స్వేష్ట! సర్వేశ దేవీశ దేవేశ భో! ।**
**కర్తృతా, భోక్తృతా, దాతృతాఽదాతృతాఽ**
**యుర్మఖైః పాల్యతామర్భకోఽయం త్వయా ॥ 30**

**ప్రతిపదార్థము :** భో = ఓ; సర్వేశ = సర్వ + ఈశ = అన్నింటికి అధిపతి; దేవీశ = దేవి + ఈశ = పార్వతీదేవికి పతీ!; దేవేశ = దేవ + ఈశ = దేవతలకు అధిపతీ!; సర్వలోక = సమస్త జనులయొక్క, స్తవ = స్తుతులచే, ఉత్థ = పుట్టిన, అనురాగ = అనురక్తిచే, ఆపిత = పొందింపబడి, స్వ + ఇష్ట = తమ కోరికలు గలవాడా!; కర్తృతా = ఏదైనా ఒక కార్యాన్ని సంకల్పించి చేయడం; భోక్తృతా = దాని ఫలితం ఎలాంటిదైనా అనుభవించడం; దాతృతా = దానము చేయు గుణము; అదాతృతా = ఇవ్వని గుణమును; ఆయుర్మఖైః = అయువులనెడి యజ్ఞములతో; త్వయా = నీచేత; అయమ్ = ఈ; అర్భకః = అర్భకుడు; పాల్యతామ్ = పాలింపబడుగాక! రక్షింపబడుగాక (పాల రక్షణే).

**తాత్పర్యము :** ఓ శివా! సర్వేశ! పార్వతీదేవికి పతీ! దేవతలకు అధిపతీ! జనుల స్తుతులవలన అనురక్తిని పొంది, వారి అభీష్టములను నేరవేర్చువాడవు నీవు. ఏదైనా ఒక కార్యాన్ని సంకల్పించి చేయడం, దాని ఫలితం ఎలాంటిదైనా అనుభవించడం, దానము చేయు గుణము, ఇవ్వని గుణమును, అయువులనెడి యజ్ఞములతో నీచేత ఈ అర్భకుడు రక్షింపబడుగాక.

**విశేషాలు :**

1. భో, భో!

ఒకప్పుడు పండితులు సభలలో ప్రసంగించేటప్పుడు ఈ శబ్దాన్ని సభలో ఉన్నవారిని సంబోధించడానికి ఉపయోగించే వారు. ఓ, ఓయి అని అర్థం. “నమస్సభాభ్యస్సభాపతి–

భ్యశ్చవోనమః"(నమకం మూడవ అనువాకం 16వ మంత్రము) సభలో ఉన్నవారికి) సభకు అధ్యక్షుడైన శివునికి నమస్కారమని ఈ మంత్రార్థం. ఎనిమిదేళ్ల చిన్న వయస్సులోనే నమకచమకాలను తనలో జీర్ణించుకొన్న శాస్త్రిగారు సభకు, శివునికి అభేదము కనుక – "భో" అను సంబోధనను ఆయనకు ఉపయోగించారు.

**2. అనురాగము :** అనురాగ మనురాగేణ ప్రత్యేష్టవ్యః అని ఒక సంస్కృతన్యాయము. తాను అనురాగమును జూపి ఇతరుల అనురాగము తాను పొందవలెను. "ఇచ్చి పుచ్చుకొ" మ్మన్న ధోరణిలో ఈ న్యాయము ఉంది. భగవంతునికి, భక్తునికి మధ్య కూడా ఇదే న్యాయము. ఆయన అనురాగము ఇస్తుంటాడు. భక్తుల అనురాగమును స్వీకరిస్తుంటాడు. అందుకే చెఱువువారు ఈ సమస్త ప్రపంచము స్వామినుండి పుట్టిన అనురక్తిని ఒక రూపంగా పొందబడినది అని వర్ణించారు.

**3. స్వేష్ట :** ఇది సమస్త పదముగా స్వీకరించి కాపెలర్ సంస్కృత – ఆంగ్ల నిఘంటువులో హృదయమునకు దగ్గరగా ఉండు వాడా! అను అర్థము ఇవ్వబడినది.

**4. కర్తృతా :** కర్మ కర్తా చ దేహీ చ ఆత్మా భోజయితా సదా । భోగో విభవభేదశ్చ నిష్కృతి ర్ముక్తి రేవచ. దేహి కర్మములు చేయువాడు; అంతర్యామి – కర్మలను భవింపజేయువాడు; సుఖ–దుఃఖములే భోగ్యములు; ఇవి పరమేశ్వర వైభవములోని భేదములు; నిష్కృతి యనగ ముక్తి యని భావము. (శ్రీదేవీ భాగవత మహాపురాణమందలి నవమ స్కంధమున నారద నారాయణ సంవాదమున ఇరువదెనిమిదవ అధ్యాయము 13 వశ్లోకం) సాధారణంగా కర్త, భోక్త – ఇలాంటి పదాలన్నీ భగవంతునికి సంబంధించినవి. ఆ గుణములతో తనను రక్షించమని చెఱువువారు శివుని వేడుకొన్నారు.

**5. ఆయుర్మఖము :** ఆయువు కోరుకొను యజ్ఞము. ఈ ఆయుష్కామన యజ్ఞాన్ని అరవై సంవత్సరములు పూర్తి అయిన తల్లితండ్రులకు పిల్లలు చేసే షష్టి పూర్తిలో జరిపిస్తుంటారు. ఆయుః + కామన + యజ్ఞము – ఆయుః అనగా ఆయువు, కామన అనగా కోరి చేసే యజ్ఞము. నిండు నూరేళ్ళు ఆయువును ప్రసాదించమని పరమాత్మను కోరుకోనుచు చేసే శ్రేష్టమైన కర్మే "ఆయుష్కామన యజ్ఞము". ఇది బిడ్డలచే జరిపించుకొను అదృష్టము ఇచ్చువాడు పరమేశ్వరుడు. పరమశివుడు ఎందుకో చెఱువు వారి ఈ కోరికను తీర్చలేదు. 60 ఏళ్లు నిండక మునుపే తన దగ్గరకు రప్పించుకొన్నాడు.

**6. అర్భకుడు :** ఈ పదానికి సాధారణంగా శిశువు. దుర్బలుడు. మూఢుడు అను

అర్థాలు ఉన్నాయి. ఋ = గతౌ ప్రాపణేపిచ – ఆర్యతే వృద్ధిం ప్రాప్యతే ఇతి – ఋ + కన్ – ధాతోః భకారః అంతాగమః నిపాతితః. (ఔణా.) వృద్ధినొందింపబడువాడు కనుక అర్భకుడు. ఆంధ్ర వాచస్పత్యములో (కొట్ర శ్యామలకామశాస్త్రి) పదునాండ్లకు లోబడిన పిల్లవాడు అను అర్థాన్ని అర్భక పదానికి ఇచ్చారు.

**7. ఛందస్సు :** ఈ శ్లోకం స్రగ్విణీ (లక్ష్మీధర , పద్మినీ) వృత్తంలో ఉంది. జగతి ఛందమునకు చెందిన 1171 వ వృత్తమిది. 12 అక్షరములు ఉంటాయి. 20 మాత్రలు 4 పాదములు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగులో ప్రతి పాదములో 7 వ అక్షరము యతి స్థానము. ప్రతి పాదములో ర , ర , ర , ర గణములుంటాయి.



**శ్లో॥ నమాంసి శిరసా తనోమి పదయో**
**స్త్రిణేత్ర తవ మాం కురుష్వ సుధియమ్ ।**
**న లోప ఇయతా తవాఽస్తి భగవన్**
**మమాఽపి కృతితా భవేదిహ పరమ్ ॥** **31**

**ప్రతిపదార్థము :** త్రిణేత్ర = సూర్య చంద్ర అగ్ని అను మూడు నేత్రములు కలవాడా!, శివుడా!; తవ = నీయొక్క; పదయోః = రెండు పాదములయందు; శిరసా = శిరస్సుతో; నమాంసి = నమస్సులు; తనోమి = వ్యాపింపచేయుచున్నాను; మామ్ = నన్ను; సుధియమ్ = పండితునిగా; కురుష్వ = చేయుము; ఇయతా = ఇంతమాత్రం (దీని) చేత; తవ = నీకు; లోపః = లోటు, న + అస్తి = లేదు, భగవన్ = స్వామీ!; మమ = నాకు; ఇహ = ఈ లోకంలో; పరమ్ + అపి = పరలోకంలో కూడా; కృతితా = సార్థక్యము; భవేత్ = చేయుము.

**విశేషాలు :**

**1. త్రిణేత్ర :** రషాభ్యాం నోణః సమాన పదే. అను సూత్రము అనుసరించి న స్థానములో ణ వచ్చి త్రినేత్ర అను పదము త్రిణేత్ర అయింది.

**2. తనోమి :** తను విస్తారే పరస్మైపది తనోమి – తనువః / తన్వః – తనుమః / తన్మః

**3. కురుష్వ :** ఆత్మనేపది లోట్ మధ్యమ పురుష ఏకవచనము కురుష్వ – కుర్వాథామ్ – కురుధ్వమ్

**4. భవేత్** (విధ్యర్థము లిజ్) భవేత్ – భవేతామ్ – భవేయుః

**5. భగవన్ :** భగ శబ్దానికి యోని అనే గాక ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన చాలా అర్థాలు ఉన్నాయి. అవి కలిగినవాడు భగవంతుడు / భగవానుడు. సమగ్ర ఐశ్వర్యం కలిగినవాడు. సమస్త భూతముల జ్ఞానం కలిగిన వాడు. ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తెలిసినవాడు.

**6. ఇహపరమ్ :** మనీషాపంచకము తర్వాత శంకర భగవత్పాదులు శివునితో ఇలా అన్నారు.

శ్లో॥ దేహ బుద్ధ్యాతు దా సోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః ।
ఆత్మ బుద్ధ్యాత్వ మేవాహ, మితి మే నిశ్చితా మతిః ॥

(ప్రభూ! దేహాన్నిబట్టిచూస్తే నేను నీకు దాసుడిని. దేహములో గల యీ జీవునిబట్టి చూస్తే నేను నీ అంశాన్ని. ఓ ప్రభూ. వాస్తవముగ ఆత్మ తత్త్వమునుబట్టి చూస్తే నువ్వే నేను. ఇది మానిశ్చయము) అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము ఈ మూడింటిని వరుసగా అద్భుతంగా పేర్కొన్న ఈ శ్లోకపు పాదులోనుంచి మొలిచినదే చెఱువు వారి పై శ్లోకం. స్వామీ! ఇహలోకంలో ఈ దశలలో ప్రయాణం చేయటానికి, ఆ జ్ఞానాన్ని జీర్ణింపచేసుకోవటానికి ప్రయత్నిస్తుంటాను. కాని పరములో మూడవ దయిన విశిష్టమయిన అద్వైత పూర్ణానుభవము కలిగించి కృతార్థునిగా చేయవలసిన బాధ్యత నీదే అని చెఱువు వారి వేడికోలు.

**7. ఛందస్సు :** ఈ శ్లోకం జలోద్ధతగతి చందస్సులో ఉంది. ఇది జగతి ఛందమునకు చెందిన 1886 వ వృత్తము. 12 అక్షరములు ఉండును. 16 మాత్రలు ఉండును. 4 పాదములు ఉండును. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగులో ప్రతి పాదములో 8 వ అక్షరము యతి స్థానము. ప్రతి పాదములో జ, స, జ, స గణములుండును.



**శ్లో॥ శాంతం దాంతం పాపదూరం సుభీమం**
**భర్గం దేవం భక్తహృత్ సౌహృదస్థమ్ ।**
**గూఢం యోగిప్రాణసంధార్యమాణం**
**శాస్తారం త్వాం భక్తిపూర్వం నమామి ॥ 32**

**ప్రతిపదార్థము :** శాంతమ్ = శాంతి కలవానిని; దాంతమ్ = ఇంద్రియ నిగ్రహము కలవానిని; పాపదూరమ్ = పాపములకు దూరముగా ఉండువానిని (అనగా పాపరహితుని); సుభీమమ్ = భయానకరసము కలవానిని; భర్గమ్ = శివుని; దేవమ్ = దేవుని; భక్తహృత్ = భక్త హృదయములలో; సౌహృదస్థమ్ = స్నేహభావముతో ఉండువానిని; గూఢమ్ = రహస్యమైనవానిని; యోగి = యోగాభ్యాసము చేయు వారి; ప్రాణ = గాలిని; సంధార్యమాణమ్ = నిలువరించుటకు శక్తి నిచ్చువానిని; శాస్తారమ్ = శాసించువానిని; త్వామ్ = నిన్ను (దకారాంత పుంలింగ యుష్మత్ శబ్దము ద్వితీయా విభక్తి ఏక వచనమ్); భక్తిపూర్వమ్ = భక్తి పూర్వకముగా; నమామి = నమస్కరించు చున్నాను.

**తాత్పర్యము :** ఓ శివా! నువ్వు శాంతి కలవాడివి. ఇంద్రియ నిగ్రహము కలవాడివి. పాపరహితునివి. భయానక రసము కలవాడివి. భక్తుల హృదయములలో స్నేహ భావముతో ఉండువాడివి. రహస్యమైనవాడివి. యోగాభ్యాసము చేయు వారి గాలిని నిలువరించుటకు శక్తి నిచ్చువాడివి. శాసించువాడివి. అటువంటి నీకు భక్తి పూర్వకముగా నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం శాలిని ఛందస్సులో ఉంది. వృత్తం రకానికి చెందినది. త్రిష్టుప్పు ఛందమునకు చెందిన 289 వ వృత్తమిది. 11 అక్షరములు 20 మాత్రలు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగు ప్రతి పాదమునందు 7 వ అక్షరము యతి స్థానము. ప్రతి పాదములో మ, త, త, గా (గగ) గణములు వరుసగా వస్తాయి.

**2. శాంతం :** శాంతమంటే కామక్రోధాదులు లేకపోవడం, నిర్వేద స్థాయీభావమైన శాంత రసం, విక్షేపాది వికారాలు లేకుండా, సర్వోపద్రవ రహితంగా వెలిగే ఆత్మ. "నయత్ర దుఃఖం న సుఖం న చిన్తా న ద్వేష రాగౌ న కాచిద్ ఇచ్ఛా । రసః స శాన్తః కథితో మునీంద్రైః" " అను శాస్త్ర వాక్యము కూడా ఈ అర్థమునే బలపరచుచున్నది.

**3. దాంతం :** బ్రహ్మచర్యాది తపఃక్లేశము నోర్చు తనము, ఇంద్రియ నిగ్రహము.

**4. పాపదూరం :** పాప కర్మలు 18 . అవి వరుసగా 1.హింస (ప్రణతిపాత్). 2. ఝూట్ (అబద్ధాలు చెప్పడం). 3. చోరి (దొంగతనం). 4. మేథూన్ (వ్యభిచారం). 5.

పరిగ్రహ (సంపదను దురాశతో పెంచుకోవడం). 6. క్రోధం. 7. మానం (పొగరు/ దురహంకారం). 8. మాయ (వంచన/ భ్రాంతి/ భ్రమ). 9. లోభం (అత్యాశ). 10. రాగ (వ్యామోహం). 11. ఈర్ష్య. 12. కలహం (గొడవ పడటం). 13. అభ్యాఖ్యయనం (దోషారోపణ). 14. పైశున్యం (ఉబుసుపోక మాటలు). 15. రతి-అరతి (ఇష్టాయిష్టాలు). 16. పర-పరివాదం (ఆక్షేపించడం/ విమర్శించడం). 17. మాయా-మృషావాదం. (స్వార్థదృష్టితో తప్పుడు వాదం చేయడం.) 18. మిథ్యాత్వం (తప్పు నమ్మకాలు).

శివానుగ్రహము కలిగితే మనము ఈ పాపాలకు దూరంగా ఉంటామని కవి అభిప్రాయం. పాపమును కీడు అను అర్థంలో వాల్మీకి రామాయణం ప్రయోగించింది. మంథర కైకేయితో చెబుతున్న మాటలివి. “తస్మాన్న లక్ష్మణే రామః పాపం కిఞ్చిత్కరిష్యతి। రామస్తు భరతే పాపం కుర్యాదితి న సం శయః ॥” లక్ష్మణుని విషయంలో రాముడు ఎటువంటి కీడు కలిగించడు. భరతుని విషయంలో ఎటువంటి కీడయినా చేస్తాడు. ఇందులో సందేహం లేదు. (అయోధ్య కాండ ఎనిమిదవ సర్గ 32 వశ్లోకం)

**5. భర్గుడు :** కామకాలాదులను కాలపాకమును పొందించువాడు కనుక శివునకు భర్గుడు అని పేరు వచ్చింది. భర్జతే కామకాలాదీనితి భర్గః భృజి భర్జనే

**6. సుధార్యమాణం :** ఒక క్రమపద్ధతిలో గాలిని పీల్చడం, వదలడం ప్రాణాయామంలో ముఖ్యం. కొన్ని పద్ధతులు ఇవి. పాప క్షయం కోసం గాలిని లోపలకు పీల్చి వ్యాహృతి, ప్రణవ శిరోయుక్తంగా మూడుసార్లు గాయత్రి మంత్రాన్ని జపించడం. (వ్యాహృతులు అంటే భూః, భువః, సువః అనే శబ్దాలు. ప్రణవ శిరోయుక్తంగా అంటే ఓంకారంతో ప్రారంభించడం.)

చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు కలిపి నాసిక ఒక వైపు మూయడానికీ, బొటన వ్రేలు నాసిక రెండవ వైపు మూసివేయడానికి ఉపయోగిస్తూ, ఒకసారి నాసిక ఎడమవైపు నుంచీ, తరువాత కుడివైపు నుంచీ గాలి పీలుస్తూ రెండవ వైపునుంచి గాలి వదలే మరొక పద్ధతి ఉంది. ఇలా మార్చి మార్చి గాలి పీల్చే పద్ధతిలో మాత్రల కాల పరిమితిని ఉపయోగించవచ్చు.

1-4-2 నిష్పత్తిలో గాలిని లోపలికి పీల్చి, కుంభించి, వదలడం. పదహారు మాత్రల కాలం పీల్చడం, అరవైనాలుగు మాత్రల కాలం గాలిని లోపల బంధించడం, ముప్పది రెండు మాత్రల కాలం వదలడం ఒక పద్ధతి.

కొందరు ప్రణవాన్నీ, మరికొందరు ఇతర బీజాక్షరాలనూ, మంత్రాలనూ జపిస్తూ గాలిని పీల్చి వదలడం చేస్తుంటారు. గాలిని పీల్చడం, వదలడం వరకు ఎవరు ఎంత సేపు చేయగలిగితే అంతే చేయవచ్చు. కుంభించే విషయంలో గురువు పర్యవేక్షణ చాలా అవసరం. మేలు జరగకపోగా కీడు జరిగే ప్రమాదం ఉంది. ప్రాణాయామం గురు ముఖంగా నేర్చుకోవడం సదా శ్రేయస్కరం. కుంభకాది దశలలో యోగులకు శివుడు ఆ శక్తిని అనుగ్రహిస్తాడని, అందుకే సంధార్యమాణమని చెఱువు వారు ప్రయోగించారు.



**శ్లో॥ అజినం వసానమమరైర్వినుతం**
**యనన్తమాదిరహితం పరమమ్ ।**
**ప్రవదంతి వేదనివహా విబుధా -**
**స్తమహం వ్రజామి శరణం గిరిశమ్ ॥** 33

**ప్రతిపదార్థము :** వేదనివహాః = వేదసమూహములూ; విబుధాః = పండితులూ; యమ్ = ఎవనిని; అజినమ్ వసానమ్ = తోలు, (చర్మము) వస్త్రముగా కలవాడు (వస + శానచ్ ప్రత్యయము); అమరైః = దేవతలచే; వినుతమ్ = కొనియాడబడినవాడు; అనంతమ్ = అంతము లేనివాడు; ఆదిరహితమ్ = మొదలు లేని; పరమమ్ = శ్రేష్ఠుడని; ప్రవదంతి = చెప్పుచున్నారో; తమ్ = ఆ; గిరిశమ్ = శివుని; అహమ్ = నేను; శరణమ్ = రక్షకునిగా; వ్రజామి = శరణు కోరుచున్నాను

**తాత్పర్యము :** చర్మము వస్త్రముగా కలవానిని, దేవతలచే కొనియాడబడువానిని, మొదలు లేనివానిని, వేద సమూహములచే, పండితులచే పరమాత్మ అని, శ్రేష్ఠుడని చెప్పబడువానిని, కైలాసమందు శయనించువానిని పరమశివుని నేను రక్షకునిగా ధ్యానించుచున్నాను, వేడుచున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం ప్రమితాక్షర చందస్సుకు చెందినది. ఇది వృత్తం రకానికి చెందినది. జగతి ఛందమునకు చెందిన 1772 వ వృత్తము. 12 అక్షరములు. 16 మాత్రలు. ప్రతి పాదములో స, జ, స, స గణములుండును. తెలుగులో ప్రతి పాదములో 9 వ అక్షరము యతి స్థానము.

**2. అజినమ్ :** (అజ గతి క్షేపణయోఃఅజ్యతే క్షిప్యతే ఇతి అజినం – వేయబడునది అని ఒక అర్థం. ధూలి మొదలయిన వానిని కప్పివేయునది కనుక అజినమని చర్మానికి ఇంకో పేరు. అజతి ధూళ్యాదిమ్ ఆవృణోతి యత్) ఏనుగు గర్వానికి ప్రతీక. ఏనుగు చర్మం ధరించుట ద్వారా గర్వమును గెలిచిన వానిగా శివుని గుర్తించాలి.

**3. అమరాః :** మృజ్ ప్రాణ త్యాగే. చావని వారు కనుక అమరులు; మరణము ఎవరికి లేదో వారు అమరులు.

**4. గిరిశుడు :** శివుడు గిరిశుడు. గిరీశుడు. గిరికి – కైలాసానికి ప్రభువు కనుక గిరీశుడు. గిరిలో – కైలాసములో శయనించువాడు కనుక గిరిశుడు. (శీఙ్ స్వప్నే).



**శ్లో॥ హర భవ దేవ భీమ పరమేశ్వర హే**
**భవ హర శూలహస్త సురవర్గపతే ।**
**స్మరహర వామదేవ దహనేంద్రియ భో**
**మృడ శివ చంద్ర శేఖర పరేశ నమః ॥ 34**

**ప్రతిపదార్థము :** హర = భక్తుల పీడను హరించువాడా! ప్రళయ కాలమున సర్వమును హరించువాడా! (హృ హరణే); భవ = అంతయూ తానయగువానికి (భవతి భవతే వా సర్వమితి భవః); దేవ = మా మనస్సులలో క్రీడించే వాడా!; భీమ = భయంకరరూపము కలవాడా! భయానకరసము కలవాడా!; పరమేశ్వర = ఓ పరమాత్మా! శివా!; హే భవ హర = సంసార బంధాన్ని తెంచి వేసుకోవడం భవచ్ఛేదం. అలా తెంచుకొన్నవాడు భవచ్ఛిత్తు. అలా సంసార బంధాలు తెంపివేసే ఓ శివా!; శూలహస్త = త్రిశూలము హస్తమందు కలవాడా! (శూలమస్యాస్తీతి శూలీ); సురవర్గపతే = దేవతల వర్గమునకు అధిపతీ!; స్మరహర = మన్మథుని హరించిన వాడా!; వామదేవ = శ్రేష్ఠుడైన దేవుడా! ఎడమ ప్రక్కను ధరింపబడిన భార్య కలవాడా! స్త్రీచే ప్రకాశించువాడా! వక్రత్వము గల దేవుడా!; దహనేంద్రియ = దహింపబడిన ఇంద్రియములు కలవాడా!; భో మృడ = ఓ భక్తులను సుఖింపచేయువాడా! తాను సుఖముగా ఉండువాడా!; శివ = శుభాలను ఇచ్చేవాడా!; చంద్రశేఖర = చంద్రుని శిరోభూషణముగ కలవాడా!; పరేశ = పరమునకు (ముక్తికి) అధిపతివయిన ఓ శివా!; నమః = నమస్కారము.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** నజభజలగ ఈ గణాలు గల వృత్తం పేరు ప్రమద. "నజభజలా గురుశ్చ భవతి ప్రమదా" ఛందోమంజరీ పుట 99. శక్వరీచ్ఛందస్సులో 7088 వ వృత్తం. (ఈ వివరాలు నాకు తెలియచేసినవారు ప్రముఖ పండితులు డా॥ సూరం శ్రీనివాసులు గారు).

**2. శూలి :** త్రిశూలము పైన మూడు కొనలు ఉంటాయి. సత్వ రజ స్తమో గుణములకు ఇది ప్రతీక. వీటి యొక్క ఏకత్వమే త్రిగుణాతీతం. అంటే పరమశివుడు త్రిగుణాతీతుడని తెలియచేసే ప్రతీక త్రిశూలము.

**3. సురవర్గము :** సురంతీతి సురాః – ఐశ్వర్యయుక్తులు కనుక సురలు. సుష్ఠురాజంత ఇతి వా సురాః – లెస్సగా ప్రకాశించువారు సురలు (దేవతలు). వృజ్యతే విజాతీయైరితి వర్గః – విజాతీయుల చేత వర్జింపబడునది వర్గము. (సజాతీయ వస్తువుల కూటమి)

**4. స్మరః :** స్మరయతి ఉత్కంఠయతీతి స్మరః. కాముకులను కామినులను తొందర పెట్టువాడు. స్మృ ఆధ్యానే.

**5. దహనేంద్రియ :** ఇంద్రియాలను రకరకాలుగా లెక్కించారు.

పంచ–ఇంద్రియములు : జ్ఞానేంద్రియములు 1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వ, 5. నాసిక.

కర్మేంద్రియములు : 1. వాక్కు, 2. హస్తములు, 3. పాదములు, 4. పాయువు, 5. ఉపస్థ.

షట్–ఇంద్రియములు : (అ.) బుద్ధీంద్రియములు (5), 6. మనస్సు (ఆ.) 1. చక్షుస్సు, 2. శ్రోత్రము, 3. ఘ్రాణము, 4. జిహ్వ, 5. కాయము, 6. మనస్సు.

సప్త–ఇంద్రియములు : త్వగింద్రియము, కర్మేంద్రియములు (5), మనస్సు – భామతి (2);

దశ–ఇంద్రియములు : జ్ఞానేంద్రియములు (5), కర్మేంద్రియములు (5) (చూ. పంచ ఇంద్రియములు (అ.), (ఆ.));

ఏకాదశ–ఇంద్రియములు : దశ ఇంద్రియములు (10), 11. మనస్సు;

ద్వాదశ–ఇంద్రియములు : కర్మేంద్రియములు (5), జ్ఞానేంద్రియములు (5) (చూ. పంచ–ఇంద్రియములు), 11. మనస్సు, 12. బుద్ధి.

చతుర్దశ–ఇంద్రియములు : కర్మేంద్రియములు (5), జ్ఞానేంద్రియములు (5) (చూ. పంచ ఇంద్రియములు), చతురంతఃకరణములు (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము)

ఈ ఇంద్రియాలను నిగ్రహించేవాడు అని దహనేంద్రియ పదములోని అంతర్యము.



**శ్లో॥ కైలాసపర్వతదరీకృతాలయం**
**వహ్నిప్రభూతలలితాపతిం ప్రభుమ్ ।**
**లింగోద్భవం లలితయా నమామ్యహం**
**కార్యక్షమారుహవివృద్ధయే శివమ్ ॥ 35**

**ప్రతిపదార్థము :** కైలాసపర్వత = కైలాస పర్వతములోని; దరీకృత + ఆలయమ్ = పర్వతబిలమును (గుహను) ఆలయముగా చేసుకొన్నవానిని; వహ్ని = అగ్నిలో; ప్రభూత = పుట్టిన; లలితాపతిమ్ = లలితాదేవికి భర్తయయిన వానిని; ప్రభుమ్ = ప్రభువును; లింగోద్భవమ్ = లింగ + ఉద్భవమ్ = లింగాకారములో జన్మించి పెరిగినవానిని; శివమ్ = శివుని; కార్య = కార్యమనెడి; క్షమారుహ = చెట్టుయొక్క; వివృద్ధయే = ఎదుగుదలకొరకు; లలితయా = లలితా వృత్తముతో; శివమ్ = శివుని; నమామ్యహమ్ = నమామి + అహమ్ = నేను నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** కైలాస పర్వతములోని గుహను ఆలయముగా చేసుకొన్నవానిని, చిదగ్నిలో పుట్టిన లలితాదేవికి భర్తయయిన వానిని, ప్రభువును, లింగాకారములో జన్మించినవానిని, శివుని, కార్యవృక్షమును పెంచి పోషించుకొనుటకొరకు లలితా వృత్తముతో నేను నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం లలిత వృత్తం రకానికి చెందినది. జగతి ఛందమునకు చెందిన 1397 వ వృత్తమిది. 12 అక్షరములు 18 మాత్రలు ఉండును. ప్రతి పాదములో త, భ, జ, ర గణములుండును.

**2. కైలాసము :** హిమవత్పర్వతము యొక్క వెనుక భాగములో ఉండు ఒక కొండ పేరు కైలాసము. "కేళీనాం సమూహః కైలం తేన ఆస్యతే స్థీయతే ఇతి కైలాసః ఆస ఉపవేశనే" – కేళి సమూహము కైలము. దానిచేత ఉండబడునది కైలాసము అని ఒక అర్థం. "కే శిరసి శివయో ర్లాసో నృత్య మస్మిన్నితి వా కైలాసః" – శిఖర భాగమందు పార్వతీ పరమేశ్వరుల నాట్యము కలది కైలాసమని ఇంకొక అర్థం. "కేలయోర్జల భూమ్యోః ఆసనం స్థితిః యస్య కేలాసః స్ఫటికం – తస్యాయం కైలాసః" – జల భూముల యందు ఉండునది గనుక కేలాసము. అనగా స్ఫటికము. దాని సంబంధమైనది కైలాసమని మరొక అర్థం.

**3. దరీకృతం ఆలయం :** దరీకృతాలయం విశిష్టప్రయోగం. ఆయన దరిని ఆలయంగా చేసుకోలేదు. ఆలయాన్ని దరిగా చేశాడట. సర్వవ్యాపి కాబట్టి తానున్న చోటికి ప్రాకృతికంగా ఆ పేరు పెట్టాడని అర్థం. "కందరం యస్య చాధ్యాస్తేస్వయం తవ మాహేశ్వరః /కందరం యస్య చాధ్యాస్తేస్వయం తవ మాహేశ్వరః" (ఇరవై మూడవ అధ్యాయము 19 వ శ్లోకం) స్వయముగా మహేశ్వరుడే నీ గిరి కందరమును (గుహ) ఆశ్రయించి ఉన్నాడని స్కాంధ మహాపురాణము చెప్పింది. దీర్యతే దరీ – ద విదారణే – భేదింపబడినది – గృహాకారమైన పర్వత బిలము దరి. "వృత్రుడు దేవతోరగ దరీకృత వక్త్రుడు (6–360)" అని పోతన గారి భాగవతంలో "దరీకృత" ప్రయోగము హద్దులలో పెట్టగల అను అర్థంలో వాడబడింది.

**4. వహ్ని ప్రభూత :** వహ ప్రాపణే. వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః – హవ్యమును దేవతలకు చేర్చువాడు కనుక అగ్నికి వహ్ని అను పేరు వచ్చింది. లలితా సహస్ర నామాలలో "చిదగ్నికుండ సంభూతా" ఒక అని ఒక నామం. బ్రహ్మ తేజస్సుకు ఒక ఆకారమైన "చిత్" అను అగ్నికుండం నుండి పుట్టిన తల్లికి నమస్కారమని దానికి అర్థం. (చిదగ్నికుండానికి బిందు సహిత త్రికోణమను అర్థం కూడా ఉంది) భండాసురుడు అనేవాడు బాధిస్తుంటే దేవతలందరూ పరమేశ్వరుని ప్రార్థిస్తే పరమశివుడు స్వయంగా పరశంభు అనే మహాయాగాన్ని చేస్తాడట. ఆ యాగాగ్ని నుంచి ఆవిర్భవించ మని పరాశక్తిని ప్రార్థిస్తాడట. ఆ యాగాగ్నికే చిదగ్నికుండమని అందులో నుంచి పుట్టింది కనుక అమ్మకు "చిదగ్నికుండ సంభూతా" అని పేరు వచ్చిందని ఇంకొక కథనం.

చిత్" అంటే జ్ఞానం. ప్రతి పదార్థం వెనుక ఆ పదార్థానికి సంబంధించిన తత్వాన్ని జ్ఞానమంటారు. తత్వం లేకుండా పదార్థం వుండదు. వృక్షం లోని వృక్షత్వమే

దానియొక్క జ్ఞానము. ఇదే చిత్ అని పిలువబడుతుంది. దీనిని అగ్నితో లలితా సహస్ర నామాలలో పోల్చబడింది. చెఱువు వారు "చిదగ్నికుండ సంభూతా" ను వహ్ని ప్రభూతా అన్నారు.

**5. లింగోద్భవం :** మాఘమాసంలో కృష్ణపక్ష చతుర్దశి తిథి రాత్రివేళ లింగోద్భవం జరిగినట్లు పురాణ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. ఆ శివరాత్రిని పర్వదినంగా పాటిస్తారు. శివుడు ఒక జ్యోతి రూపంలో మొదలు తుది కనిపించ నంతగా ఒక స్తంభంగా పైకి, క్రిందికీ వ్యాపించాడు. బ్రహ్మ, విష్ణువులు లింగం ఎక్కడ మొదలో ఎక్కడ చివరో తెలుసుకొనలేనప్పుడు శివుడు అగ్ని స్తంభపు మధ్యలో వారికి దర్శనం ఇచ్చాడనీ పురాణ గాథ. సకల చరాచర ప్రపంచం ప్రళయంలో ఎక్కడ గర్భితమై ఉండి, సృష్టికాలంలో ఎక్కడి నుంచి బయటకు వస్తుందో అది లింగం. (బసవేశ్వర గీతామృతం)

**6. లింగ శరీరం :** సూక్ష్మ శరీరం. ఆకాశాది పంచభూతాల వల్ల ఏర్పడినదనీ, ఈ సూక్ష్మ శరీరం జీవుడికి అజ్ఞానం వల్ల కలుగుతున్నదనీ, ఇది జీవాత్మకు అనాదియగు ఉపాధి అనీ వివేక చూడామణి తెలియజేస్తున్నది. (99వ శ్లోకం) ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశ త్రయం లింగ శరీరం.

**7. లింగచతుష్టయము :** 1. ఇష్టలింగము, 2. ప్రాణలింగము, 3. భావలింగము, 4. ఆత్మలింగము

**8. లింగత్రయారాధనం :** ఆరాధ్య/ వీరశైవ సంప్రదాయంలో గురువు శాంభవ దీక్ష ద్వారా ధరింపజేసే లింగకాయలోని లింగం ఇష్టలింగం. ఇదే మరో భావనలో ప్రాణ లింగం. ఇంకొక భావనలో ఇదే భావలింగం కూడా. ఈ మూడు భావనలలోని లింగాలను లింగ త్రయం అన్నారు. (త్రయం అని పేరేగాని ఉన్నది ఒకటే లింగం.) స్థూల దేహం మెడలో ధరించి ఆరాధించేది ఇష్టలింగం. దీనిని ఆరాధించడమే ఇష్టలింగారాధన. తనకూ లింగానికీ అభేద భావన కలిగే విధంగా లింగార్చన చేయడం లింగాంగి సాధన. స్థూలదేహం ఇష్టలింగాన్ని అర్చించినట్లు సూక్ష్మదేహం ప్రాణలింగాన్ని, కారణదేహం భావలింగాన్ని ఆరాధించడం సాధన.

**9. కార్యక్షమారుహావివృద్ధయే శివం :** ముద్రిత ప్రతిలో నాలుగవ పాదంలో కార్య క్షమారువిహావివృద్ధయే శివం అని ఉంది. గణ భంగమని భావించి "కార్య క్షమారుహావివృద్ధయే శివం" అని నేను సవరించి అర్థమిచ్చాను.



**శ్లో॥ హర శివ దేవ దేవ మృడ శర్వ పరేశ సురేశ ధూర్జటే**
**కవనపదార్థకీర్తిధనజీవితధాన్యసుతాదిసంపదః ।**
**సువిమలదేహ! యచ్చ వినివారయ భీతిమపోహ శాత్రవాన్**
**జటిల మహేశ మామవ నమామి సదా శివ తే పదాబ్జయోః ॥ 36**

**ప్రతిపదార్థము :** హర = భక్తుల పీడను హరించువాడా! ప్రళయ కాలమున సర్వమును హరించువాడా! (హృ హరణే); శివ = శుభముతో కలిసి ఉండేవాడా!; దేవ దేవ = దేవతలలో ప్రధానమైనవాడా!; మృడ = భక్తులను సుఖింపచేయువాడా! తాను సుఖముగా ఉండువాడా!; శర్వ = ప్రళయ కాలములో భూతములను హింసించువాడా! (శృహింసాయాం); పరేశ = అత్యున్నతుడైన దేవా!; సురేశ = దేవతలకు ప్రభువా!; ధూర్జటే = భారమయిన జడలు కలవాడా!; సువిమల దేహ = స్వచ్ఛమయిన దేహము కలవాడా!; సదాశివ = కాలమునకు వశము కానివాడా!; యత్ + చ = ఏవయితే; కవన = కవిత్వము; పదార్థ = పదార్థము (సప్తపదార్థములు – ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము.); కీర్తి = 1. దానకీర్తి, 2. పుణ్యకీర్తి, 3. కావ్యకీర్తి, 4. వక్తృత్వకీర్తి, 5. వర్తనకీర్తి, 6. శౌర్యకీర్తి, 7. విద్వజ్జనకీర్తి; ధన = 1. దైవధనము, 2. మానుషధనము – అను రెండు రకాల ధనములు; జీవిత = ప్రాణము, జీవితము; ధాన్య =ధాన్యము; సుతాది సంపదః = సంతానము మొదలయిన సంపదలవలన; భీతిమ్ వినివారయ = భయమును నివారింపుము; శాత్రవాన్ = శత్రువుల, అపోహ = తొలగించుము; జటిల = ఓ జడలు గల సన్యాసీ! శివా!; మహేశ = మహా + ఈశా = గొప్పవాడివయిన ప్రభూ!; మామవ = మామ్ + అవ = నన్ను రక్షించు; తే పదాబ్జయోః = తే పద + అబ్జయోః = నీ పద పద్మములకు; నమామి = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** భక్తుల పీడను హరించువాడా! ప్రళయ కాలమున సర్వమును హరించువాడా! శుభముతో కలిసి ఉండేవాడా! దేవతలలో ప్రధానమైనవాడా! భక్తులను సుఖింపచేయువాడా! ప్రళయ కాలములో భూతములను హింసించువాడా అత్యున్నతుడైన దేవా! దేవతలకు ప్రభువా! భారమయిన జడలు కలవాడా! స్వచ్ఛమయిన దేహము కలవాడా! కాలమునకు వశము కానివాడా! కవిత్వము, పదార్థము, కీర్తి ధనము, ధనము, జీవితము, ధాన్యము, సంతానము మొదలయిన సంపదలను ఇచ్చి, వాటివలన కలుగు భయమును నివారింపుము. నాపై శత్రువుల అనుమానమును తొలగించుము. ఓ జడలు గల

సన్న్యాసీ! శివా! గొప్పవాడివయిన ప్రభూ! నన్ను రక్షించు. నీ పదపద్మములకు నమస్కరించుచున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం లోని వృత్తం చంపకమాల. చంపకమాలకే సరసీ అనే ఇతర నామము ఉంది. ప్రకృతి ఛందమునకు చెందిన 711600 వ వృత్తము. 21 అక్షరములు & 28 మాత్రలు ఉంటాయి. 4 పాదములు. ప్రతి పాదములో న, జ, భ, జ, జ, జ, ర గణములుండును.

**2. శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు శివుడు. బ్రహ్మానందస్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు.

**3. సంపదః :** "సహసావిదధీత న క్రియాం / అవివేకః పరమాపదాం పదమ్ / వృణుతే హి విమృశ్యకారిణం / గుణలుబ్ధాః స్వయమేవ సంపదః" అని భారవి మహాకవి కిరాతార్జునీయమహాకావ్యంలో చెప్పాడు. గుణవంతుడిదగ్గరకు తాము చేరాలని ఐశ్వర్యములు తహతహలాడుతుంటాయి. సహృదయులైన జనులకు కూడా గుణవంతుని పైననే ఎక్కువగా ఆదరభావముంటుంది.

జితేంద్రియత్వం వినయస్య కారణం / గుణప్రకర్షో వినయాదవాప్యతే / గుణాధికే పుంసి జనోనురజ్యతే / జనానురాగ ప్రభవా హి సంపదః ॥ (కిరాతార్జునీయ మహాకావ్యం)

వినయగుణము రావటానికి ఇంద్రియనిగ్రహము అవసరం. వినయవంతునికి అన్ని రకాల మంచిలక్షణాలు వస్తాయి. గుణవంతుడైన వ్యక్తిని ప్రజలు ప్రేమతో ఆదరిస్తారు. జనుల ప్రేమ వల్ల సకల సంపదలు సిద్ధిస్తాయి.

యత్కటాక్ష సముపాసనా విధిః / సేవకస్య సకలార్థ సంపదః / సంతనోతి వచనాంగ మానసైః / త్వాం మురారిహృదయేశ్వరీం భజే ॥ (కనకధారాస్తవము 17)

ఆపదః, సంపదః, కాలే, దైవాత్, ఏవ, ఇతి, నిశ్చయీ / తృప్తః, స్వస్థేంద్రియః, నిత్యం, న, వాంఛతి, న, శోచతి (అష్టావక్ర గీత –09–03) ఆపదలు సంపదలు దైవం వలన అంటే మన పూర్వ కర్మ ఫలితాల వలన మాత్రమే కలుగుతాయి అని నిశ్చయించుకున్న

వాడు నిత్యం తృప్తి కలిగి ఉంటాడు. ఇంద్రియాలను నిగ్రహించుకొని ఏమీ కోరడు, దుఃఖించడు. ఇలా సంపదలగురించి రకరకాల ప్రసిద్ధ శ్లోకాలు ఉన్నాయి. చెఱువు వారు సంపదలను అనుగ్రహించి, వాటివలన భయాన్ని పోగొట్టమన్నారు.

**4. వినివారయ :** అహం నివారయామి త్వాం త్వం చ మాం వినివారయ (నీవు నన్ను అడ్డుకొనుము నేను నిన్ను అడ్డెదను.) (శ్రీ శివమహాపురాణములో విష్ణు వీరభద్ర సంవాదమను ముప్పదిఆరవ అధ్యాయములో 60 వ శ్లోకము)

**5. యత్ :** యత్ కు సంబంధించి సంస్కృత సాహిత్యములో రకరకాల ప్రయోగాలున్నాయి. యద్భావం తద్భవతి = ఏదయితే భావముంటుందో, అలానే జరుగుతుంది. యత్కరభస్య పృష్ఠే న మాతి తత్కణ్ఠే నిబధ్యతే = ఒంటెవీపుపై జాగా లేకపోతే మిగతా సామానుని దానిమెడలో వ్రేలాడదీస్తారు. భరించలేని కష్టాలు ఒకదాని వెంబడి ఒకటి వస్తుంటే ఈ న్యాయము చెబుతారు. యత్కృతకం త దనిత్యమ్ = స్వభావసిద్ధముగా కాకుండా కృత్రిమముగ కల్పిత మైనదంతా అనిత్యమే. బ్రహ్మచేత సృష్టించబడినది గనుక ప్రపంచానికి అనిత్యత్వము. యత్ప్రాయః శ్రూయతే తత్ న్యాయమ్ = తరుచుగా వింటుండేదాన్నే నిజమని విశ్వసించడం లోకస్వభావం.

**6. సదాశివ :** శివో మహేశ్వరశ్చైవ రుద్రో విష్ణుః పితామహః ।
సంసారవైద్యస్సర్వజ్ఞః పరమాత్మేతి ముఖ్యతః ॥ 23

నామాష్టకమిదం ముఖ్యం శివస్య ప్రతిపాదకమ్ ।
ఆద్యం తు పంచకం జ్ఞేయం శాంత్యతీతాద్యనుక్రమాత్ ॥ 24

సంజ్ఞా సదాశివాదీనాం పంచోపాధిపరిగ్రహాత్ ।
ఉపాధివినివృత్తౌ తు యథాస్వం వినివర్తతే ॥ 25

(శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహిత ముప్పది రెండవ అధ్యాయము)

శివుడు, మహేశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, పితామహుడు, సంసారవైద్యుడు, సర్వజ్ఞుడు మరియు పరమాత్మ అనునవి ముఖ్యమయిన పేర్లు. ఈ ఎనిమిది పేర్లు ప్రధానముగా శివుని ప్రతిపాదిస్తున్నాయి. శాంత్యతీత మొదలగు కళల క్రమములో శివుడు సదాశివుడు మొదలగు అయిదు ఉపాధులను స్వీకరించి యున్నాడు. ఆ ఉపాధులు ఉపసంహరింపబడగానే ఆయన తన స్వరూపము లోనికి తిరిగి వెళ్లును.



**శ్లో॥ శంకర గౌరీశ జటిల శూలిన్ - అంధకశత్రో వటుక పరేశ ।**
**సర్పవిభూషం సురనతమంఘ్రిం - హే భవతే నౌమ్యవ హరి బాణ ॥ 37**

**ప్రతిపదార్థము :** శంకర = సుఖమును కలుగజేయువాడా!; గౌరీశ = గౌరీదేవికి ప్రభువయిన శివా!; జటిల = ఓ జడలు గల సన్యాసీ; శూలిన్ = శూలము ధరించిన వాడా!; అంధక శత్రో = అంధకాసురుని శత్రువా!; వటుక = బ్రహ్మచారి రూపంలోని వాడా!; పరేశ = అత్యున్నతుడైన దేవా!; సర్పవిభూషమ్ = పాములు ఆభరణములుగా కలవాడా! సురనతమంఘ్రిమ్ = సురనతమ్ + అంఘ్రిమ్ = దేవతలు నమస్కరించు పాదములు కలవాడా!; హే భవతే = ఓ శివా! నీకొరకు; నౌమి = నమస్కరించుచున్నాను; హరి బాణ = త్రిపురాసుర సంహార సందర్భములో హరి బాణముగా కలవాడా!; అవ = రక్షించుము.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం శ్రీ వృత్తములో ఉంది. పంచరసైః శ్రీర్భతనగగైః స్యాత్ (వృత్తరత్నాకరము) భగణము, తగణము, నగణము, మరియూ రెండు గురువులు వరుసగా శ్రీ వృత్తంలో ప్రతి పాదంలోనూ వస్తాయి. 05 లేదా 06 వ అక్షరము తెలుగులో యతి.

**మా కురు చిత్తం శఠ జనవిత్తం - కల్మషగామీ సరతి హి నిత్యమ్ ।**
**వాంఛసి చేత్త్వం పరమపదాప్తిం - శంకరపాదమ్ భజ సుఖపత్తిమ్ ॥**

అని వృత్తరత్నాకరములో ఈ శ్రీ వృత్తమునకు మనోహర గమనము కలిగిన ఉదాహరణము ఇవ్వబడినది. ప్రతిపాదంలోనూ ఒకే గురువున్న వృత్తాన్ని కూడా శ్రీవృత్తమనే చెప్పింది వృత్తరత్నాకరం.

**2. శంకర :** శంకర పదముతో అనేక పదాలు సాహిత్యంలో అల్లుకొన్నాయి. వాటిలో కొన్ని శంకరపదములు = శివుని గూర్చిన పాటలు; శంకరగిరిమాన్యములు = దుర్గమప్రదేశములు; శంకరాభరణము = శివుని ఆభరణం వాసుకి... శేషుడు కాదు.

**3. అంధకాసురుడు :** ఈ రాక్షసుని శివుడు చంపాడు. అంధకాసురుడు మహాదేవుని త్రిశూలం మీద ఉండగా శివుని జటాజూటం చూస్తూ శివుని 108 నామములను కీర్తించాడట. పార్వతిని కామించిన అంధకుడిని శివుడు తన త్రిశూలంతో పైకెత్తి పట్టుకున్నాడు. అది అతని శరీరంలో మూడుచోట్ల గుచ్చుకొని విలవిల్లాడాడు. కొంత

సమయం తరువాత అంధకుడిలోని కామ, క్రోధ, మాత్సర్యాలు మూడూ అణగి పోయాయి. అంధకాసురుడు మహాదేవుని త్రిశూలం మీద ఉండగా శివుని జటాజూటం చూస్తూ శివుని 108 నామములను కీర్తించాడట. అప్పుడు ఆ శివుడు అంధకుడిని గణాధిపతులలో ఒకడిగా చేసాడట.

4. అవ : అవ అనునది ధాతువే కాదు. ఇది సంస్కృత అవ్యయము కూడా. ఇది సమాసపూర్వపదమై క్రింది అర్థముల తెలుపును. 1.వంగినది – ఉదా॥ అవాగ్రము = వంగిన అగ్రముకలది. 2. విరుద్ధము – ఉదా॥ అవమానము. 3. అనాదరమును = సూచించునది – ఉదా॥ అవకర్ణనము = అనాదరముతో వినుట. తెలుగు నిఘంటువు (తెలుగు–తెలుగు జి.ఎన్.రెడ్డి–ఆం.ప్ర.సా.అ. 1979)

5. ఈశునకము : ఈ వృత్తాంతము పండిత లోకంలో ప్రసిద్ధము. ఇద్దరు విద్వాంసులు రామమూర్తి, కృష్ణమూర్తి మాట్లాడుకొంటున్నారు. రామమూర్తి ఒక కుక్కను చూసి "ఈ శునకము నిజముగా కృష్ణమూర్తి" అని అన్నాడు. కృష్ణమూర్తికి కోపము వచ్చింది. "ఈశు – నకము" అనగా ఈశ్వరుని బాణము అనగా హరి అని మిమ్మలిని పొగిడాను. తప్పేముంది? – అని రామమూర్తి అన్నారట. నకము అంటే బాణము అని నిఘంటువులలో కనిపించదు కాని ఈ కథ తరతరాలుగా వినబడుతోంది.



**శ్లో॥ గజారే! హే శూలిన్! వటుక! విపతేఽబ్ధీషుధే! దానవారే!**
**పినాకిన్! హే శంభో! గిరిశ! భవ! మాం రక్ష భక్తార్తినాశ! ।**
**శ్రయిష్యామీశం త్వాం మదన విశరం సర్వ పాప ప్రణాశం**
**మదీశం భూతేశం సువిశద తనుం భీష్మ సూ మూర్ధజం త్వామ్ ॥ 38**

**ప్రతిపదార్థము :** గజారే! = గజ + అరే = గజాసురునికి శత్రువా!; హే శూలిన్! = శూలము ధరించినవాడా!; వటుక! = బ్రహ్మచారి రూపము ధరించినవాడా!; విపతే = ఓ విశిష్టమయిన ప్రభూ! ( విశిష్టః పతిః); అబ్ధీషుధే = అబ్ధి + ఇషుధే = సముద్రము అమ్ములపొదిగా కలిగినవాడా! (బాణములు దీనియందు ధరింపబడును కనుక అమ్ములపొదికి ఇషుధి అని పేరు); దానవారే! = దానవ + అరే = దానవులకు శత్రువా!; పినాకిన్! = పినాకమను ధనుస్సును ధరించినవాడా!; హే శంభో! = శుభములు కలిగించువాడా!; గిరిశ! = కైలాసములో శయనించువాడా!(శీఙ్ స్వప్నే);

భవ! = అంతయూ తానయగువాడా! (భవతి భవతే వా సర్వమితి భవః); మాం రక్ష = నన్ను రక్షించుము; భక్తార్తినాశ! = భక్త + ఆర్తినాశ = భక్తుల దుఃఖమును నశింపచేయువాడా!; త్వామ్ = నిన్ను (దకారాంత పుంలింగ యుష్మద్ శబ్దము ద్వితీయా విభక్తి ఏక వచనము); మదన విశరమ్ = మన్మథుని చంపినవానిని; సర్వ పాప ప్రణాశమ్ = అన్ని పాపాలను నశింపచేసినవానిని; మదీశమ్ = మత్ + ఈశమ్ = నా ప్రభువును (ఝలాంజశోఽన్తే- అను సూత్రము ద్వార "త్" కు బదులు "ద్" ఆదేశము వస్తుంది); భూతేశమ్ = భూత + ఈశమ్ = బూచుల రాజును; సువిశద తనుమ్ = చక్కగా స్పష్టమయిన శరీరము కలవానిని; భీష్మ సూ మూర్ధజమ్ = గంగానదిని తలపై కలవానిని( భీష్మని కన్నది కనుక గంగానదికి భీష్మ సూ, భీష్మ సువు అని పేర్లు); ఈశమ్ = ఈశ్వరుని; త్వామ్ = నిన్ను; శ్రయిష్యామి = ఆశ్రయించుచున్నాను.

**తాత్పర్యము :** గజాసురునికి శత్రువా! శూలము ధరించినవాడా! బ్రహ్మచారి రూపము ధరించినవాడా! ఓ విశిష్టమయిన ప్రభూ! సముద్రము అమ్ములపొదిగా కలవాడా! దానవులకు శత్రువా! పినాకమను ధనుస్సును ధరించినవాడా! శుభములు కలిగించువాడా! కైలాసములో శయనించువాడా! అంతయూ తానయగువాడా! నన్ను రక్షించుము. భక్తుల దుఃఖమును నశింపచేయువాడా! నిన్ను మన్మథుని చంపినవానిని అన్ని పాపాలను నశింపచేసిన వానిని ప్రభువును బూచుల రాజును, చక్కగా స్పష్టమయిన శరీరముకలవానిని గంగానదిని తలపైకలవానిని నిన్ను ఈశ్వరుని ఆశ్రయించు చున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది మేఘవిస్ఫూర్జితం

మేఘవిస్ఫూర్జిత శ్లోక లక్షణములు ఇవి. ఇది వృత్తం రకానికి చెందినది. అతిధృతి ఛందమునకు చెందిన 75714 వ వృత్తము.

19 అక్షరములు, 30 మాత్రలు ఉంటాయి. మాత్రా శ్రేణి: I U U - U U U - I I I - I I U - U I U - U I U - U. 4 పాదములు ఉండును. తెలుగులో ప్రాస నియమం ఉంది. తెలుగులో ప్రతి పాదములో 13 వ అక్షరము యతి స్థానము. ప్రతి పాదములో య, మ, న, స, ర, ర, గ గణములుంటాయి.

**1. ఇషుధే :** "పరితే ధన్వనో హేతిరస్మాన్ – వృణక్తు విశ్వతః। అథో య ఇషుధిస్తవారే అస్మన్నిధేహి తమ్" అని నమకములోని ప్రథమానువాకములోని మంత్రము. ఓ

పరమేశ్వరా! నీయొక్క అమ్ములపొది మాయొక్క శత్రువులయందు; (అనగా వ్యాధికారకాలైన శత్రువులయందు) ఉంచుము అని దీని అర్థం. ఈ ప్రభావముతో చెఱువువారు **'విపతేఽబ్ధీషుధే'** అని శివుని సంబోధించారని అనిపిస్తోంది.

పెద్దలు శ్రీ సూరం శ్రీనివాసులు గారు ఈ విషయంలో ఇలా వ్రాసారు. "రుద్రానువాకంలో ఆరే పదానికి సాయణభాష్యం దూరంగా అనే అర్థం చెప్పింది. భట్టభాస్కర భాష్యం మాత్రం **'అరీణాం సమూహే'** అని అర్థం చెప్పింది. ఇక ప్రస్తుత శ్లోకంలో విపతే అబ్ధీషుధే అన్న పదాలను విడివిడిగానే తీసుకోవలసివస్తుంది. విపతే అనే పదాన్ని సంబోధనగానే స్వీకరించాలి. చతుర్థిగా తీసుకోవాలి అంటే విపదే అని ఉండాలి. ఇది లౌకిక సంస్కృతం గదా. కాబట్టి విపతే – విపదాం పతిః (కుదిరితే) అని గానీ విశిష్టః పతిః అని గానీ విగ్రహం చెప్పుకోవాలి. మరే అర్థమయినా సరే, ఈ విధానంలోనే". వారి సూచనను అనుసరించి విపతే, అబ్ధీషుధే అని విడివిడిగా అర్థాలు వ్రాసాను. వారికి ధన్యవాదములు.

**3. గజారే :** శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితలోని యుద్ధఖండములో గజాసుర వధ అనే ఏబది ఏడవ అధ్యాయములో మనందరికి తెలిసిన గజాసుర కథలో కొన్ని మెరుపులు ఇలా ఉన్నాయి. మహిషా సురుని కుమారుడగు గజాసురుడు బ్రహ్మ గురించి తపస్సు చేసి అతనిని "ఓ దేవదేవా! ఈశ్వరా! నీకు నమస్కారము. నీవు నాకు వరమును ఈయగోరుచున్నచో, నేను కామనిర్జితులైన స్త్రీ పురుషులచే వధించబడకూడదు (17వ శ్లో)"అని వరమడిగాడు. గజాసురుడు అభీష్టములయిన ఇంద్రియసుఖములను హద్దు లేకుండా అనుభవించికూడా, ఇంద్రియజయము లేని వాడగుటచే తృప్తిని పొందలేకపోయెను (25శ్లో). అందరిని జయిస్తూ శివుడున్న కాశీనగరానికి వచ్చి శివునితో ఆ గజాసురుడు యుద్ధం చేసాడు. యుద్ధములో త్రిశూలధారియగు శివుడు తన మీదకు వచ్చుచున్న ఆ రాక్షసవీరుని గాంచి, ఈతడు ఇతరులచే వధింపబడడని తెలుసుకొని, వానిని శూలముతో పొడిచాడు (49శ్లో). త్రిశూలముచే పొడువబడిన ఆ గజాసురుడు తాను శూలముపై గొడుగు వలెనున్నట్లు భావించి శివుని మహిమను గానము చేసాడు. (50శ్లో). ఓ దిగంబరా! మహేశ్వరా! నీవు ప్రసన్నుడవైతే, నీ త్రిశూలముయొక్క అగ్నిచే పావనమైన ఈ నా శరీరచర్మమును నిత్యము ధరించుము (58శ్లో). అని వరమడిగాడు. అందుకే ఆనాటినుండి శివుడు గజచర్మధారి అయ్యాడు.

మనందరం చదువుకొనే వినాయకచవితి కథలో గజాసురుడే శివుని గురించి తపస్సు చేస్తాడు. 'నీవు నా హృదయంలో నివాసముండాలి' అని వరమడుగుతాడు. శ్రీహరి గంగిరెద్దులవాని రూపంలో నందితో గజాసురుని మెప్పిస్తాడు. గజాసురుడు వరము కోరుకొమ్మంటే. 'నీ హృదయంలో నున్న శివుడు మాకు కావాలి' అని అడుగుతాడు.

'నా చర్మాన్ని శివుడు ధరించాలి, నా ముఖం మూడు లోకాలలోను పూజింపబడాలి' అని అడుగుతాడు గజాసురుడు. శ్రీహరి అంగీకరించిన తరువాత. నందీశ్వరుడు గజాసురుని పొట్ట చీలుస్తాడు. శివుడు గజచర్మధారి అవుతాడు. గజాస్యుడైన వినాయకుడు మూడు లోకాలలోను పూజింపబడతాడు.

**4. వటుక!** (బ్రహ్మచారి రూపము ధరించినవాడా!) : పార్వతి చేసే తపస్సు ప్రభావం వల్ల శివుడి సమాధికి భంగం కలుగుతుంది. అప్పుడు శివుడు ఒక అందమైన బ్రహ్మచారి రూపంలో వచ్చి పార్వతిని పరీక్షిస్తాడు. ఇది కుమారసంభవాది కావ్యాల్లో ప్రసిద్ధం. 63 నాయనార్ల చరిత్రలలో అమర్నీతి నాయనారు చరిత్రలో కూడా శివుడు బ్రహ్మచారి వేషం ధరించిన కథ కనబడుతుంది. మన రుక్మిణీ తులసీదళం కథలా అమర్నీతి నాయనారు పుణ్యం త్రాసులో బ్రహ్మచారి కౌపీనానికి సమానమవుతుంది.

**శ్లో॥ ధరాధరాధివాసమాశ్రితార్థికల్పపాదపం**
**విధాతృవిష్ణుముఖ్యదేవపూజితాంఘ్రిపద్మకమ్ ।**
**సరస్వతీముఖాభిగీయమానకీర్తిభాసురం**
**శివం సదాంధకాసురాహరం నమామి శాశ్వతమ్ ॥ 39**

**ప్రతిపదార్థము :** ధరాధర = ధరతి విశ్వం ధరా – విశ్వమును ధరించునది భూమి. ధరతి భువం ధరః – భూమిని ధరించునది (ధృ ధారణే) ధర అని విడివిడిగా అర్థాలు. ధరాధరము అను సమస్త పదానికి కొండ అని అర్థము. ఇక్కడ శివస్తుతి కనుక ధరాధరము అనగా హిమాలయము; అధివాసమ్ = నివాస స్థానముగాకలవానిని, (అధి ఉపసర్గ, దీనికి తెలుగులో విడిగా ప్రయోగము లేదు. కొన్ని చోట్ల అధికము అను అర్థమును, కొన్ని చోట్ల నిరర్థకముగా ఉంటుంది); ఆశ్రిత = ఆశ్రయింపబడిన; అర్థి = యాచకులకు, కోరువారికి; కల్పపాదపం = కోరినవి ప్రసాదించే కల్పవృక్షమువంటివానిని (పాదము లనగా వేళ్లు. వాటి చేత నీటిని తాగుతుంది కనుక చెట్టుకు పాదపము అని పేరు.);

విధాతృ = బ్రహ్మ (సర్వము చేయువాడు. ధాఞ్ ధారణ పోషణయోః); విష్ణు ముఖ్య = విశ్వమంతట వ్యాపించియుండు విష్ణువు మొదలైన; దేవ = దేవతలచే; పూజిత = పూజింపబడిన; అంఘ్రి పద్మకమ్ = పద్మములవంటి పాదములు కలవానిని; సరస్వతీ = సరస్వతీదేవి (సరః ప్రసరణం సర్వత్ర అస్తీతి సరస్వతీ – అంతటా వ్యాప్తి కలిగినదానిని సరస్వతీదేవి అంటారు.); ముఖ = మోముచే (నోటిచే); అభిగీయమాన = చక్కగా పాడబడుచున్న; కీర్తి భాసురమ్ = కీర్తిచే ప్రకాశించువానిని; అంధకాసుర = అంధకుడను రాక్షసునిలోని; ఆహరమ్ = దుష్ట గుణములను అపహరించినవానిని; శాశ్వతమ్ = శాశ్వతుని; శివమ్ = శుభములనిచ్చు శివుని; సదా = ఎప్పుడూ; నమామి = నమస్కరించుచుందును.

**తాత్పర్యము :** హిమాలయము నివాస స్థానముగాకలవానిని, ఆశ్రయింపబడిన యాచకులకు కోరినవి ప్రసాదించే కల్పవృక్షమువంటివానిని బ్రహ్మ, విష్ణువు మొదలైన ముఖ్యులైన దేవతలచే పూజింపబడిన పద్మములవంటి పాదములు కలవానిని సరస్వతీదేవిచే చక్కగా పాడబడుచున్న కీర్తిచే ప్రకాశించువానిని, అంధకుడను రాక్షసునిలోని దుష్ట గుణములను అపహరించినవానిని శాశ్వతుని, శుభములనిచ్చు శివుని ఎప్పుడూ నమస్కరించుచుందును.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది పంచచామరము (నారాచ, మహోత్సవ) వృత్తం రకానికి చెందినది. అష్టి ఛందమునకు చెందిన 21846 వ వృత్తము. 16 అక్షరములు మరియూ 24 మాత్రలు ఉంటాయి. ప్రతి పాదములో జ, ర, జ, ర, జ, గ గణములుండును. మాత్రా శ్రేణి: I U I - U I U - I U I - U I U - I U I – U. 4 పాదములు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం ఉంది. తెలుగులో ప్రతి పాదములో 10 వ అక్షరము యతి స్థానము.

సమస్తలోక శంకరం నిరస్తదైత్యకుంజరం
దరేతరోదరం వరం వరేభవక్త్రమక్షరమ్ ।
కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం
మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్ ॥

– ప్రసిద్ధమైన ఈ వినాయక స్తుతి పంచ చామరమే. ఈ వృత్త రచన ఎదురు నడక

కలిగినదిగా చెబుతారు. "విశ్వనాథునిన్ స్తుతించెదన్" అను మకుటముతో విశ్వనాథ కూడా పంచచామర వృత్తములో నవరత్నాలు వ్రాసారు.

నగేంద్రకన్యకామనోధినాథునిన్ మహోత్తమున్
యుగాంతకున్ సదాశివున్ మహోరగాభిభూషితున్
ధగద్ధగాయమానరూపధారునిన్ దయామయున్
జగత్ప్రభున్ నటేశు విశ్వనాథునిన్ స్తుతించెదన్

రావణ కృత శివతాండవ స్తోత్రములో కూడా పంచ చామరము పరుగులు తీసింది.

**2. అర్థి :** 1. కోరికగలవాఁడు, కోరువాఁడు, 2. యాచకుఁడు, 3. (తెనుఁగుననే) ఇష్టము, ప్రియము అని మూడు అర్థాలు.

ఈ శబ్దమునకు కోరికగలవాఁడు, కోరువాఁడు, మొదలగు అర్థములయందు విశేషణముగానే ప్రయోగముగలదు. కోరిక మొదలగు నర్థములయందు విశేష్యముగా నన్నయభట్టాది కవిత్వమునఁ గనఁబడుచున్నది. ఇట్టి ప్రయోగములయందు భావప్రధాన నిర్దేశమని యెంచి విశేషణమునకే విశేష్యార్థముఁ జెప్పెడు సంప్రదాయము గలదు. ఇదియొక మార్గము. కన్నడమున అత్తి, అర్తి, అను రూపములు గలవు. అరితియని ఆంధ్రభాషార్ణవమునఁ గనఁబడుచున్నది. అర్తి యనుటకు మా "ఆర్థి" యని లేఖకులచే మొదట గ్రహింపఁబడియుండును. క్రమముగా అర్థియను రూపము వాడుకలో నిలిచి యుండును. "అర్థి" శబ్దముతో సంబంధములేని సంతోషము, భక్తి మొదలగు నర్థముల యందు దీనికి ప్రయోగములు గలవు. శైవకవులలో 'అత్యర్థి' అని "మోక్షార్థి" అని సమాసమునఁగూడ కనఁబడుచున్నది. చూ. అర్తి, అరితి. (వావిళ్ల నిఘంటువు 1949)

**3. శివ :** శివమంటే శుభం. దానితో కలిసి ఉండేవాడు శివుడు. శుభాలను ఇచ్చేవాడు శివుడు. బ్రహ్మానందస్వరూపుడు నిర్వికారుడు కనుక ఎప్పుడూ శమించి ఉండేవాడు శివుడు. సజ్జనుల మనస్సులలో శయనించి ఉండేవాడు శివుడు. ఎవరియందు సజ్జనుల మనస్సులుంటాయో అతడు శివుడు.

4. అంధకాసురుడు : ఈ రాక్షసుని శివుడు చంపాడు. అంధకాసురుడు మహాదేవుని త్రిశూలం మీద ఉండగా శివుని జటాజూటం చూస్తూ శివుని 108 నామములను కీర్తించాడట. పార్వతిని కామించిన అంధకుడిని శివుడు తన త్రిశూలంతో పైకెత్తి పట్టుకున్నాడు. అది అతని శరీరంలో మూడుచోట్ల గుచ్చుకొని విలవిల్లాడాడు. కొంత

సమయం తరువాత అంధకుడిలోని కామ, క్రోధ, మాత్సర్యాలు మూడూ అణగిపోయాయి. ఈ మూడు గుణములను శివుడు అపహరించాడను ఉద్దేశ్యములో 'అంధకాసురాహరం' అను ప్రయోగము ఉన్నట్లు తోచుచున్నది.



**శ్లో॥ ప్రియాముఖే క్షణక్షణే సుహృత్తయాఽతిశీతయా**
**దృశా శివస్సమీక్షతాం కిరాతరూపధారకః ।**
**శ్మశానభస్మ సంచయాతిశుక్లవిగ్రహశ్శివో**
**గజాజినోత్తరీయకోఽర్థికల్పవృక్షకో మృడః ॥ 40**

**ప్రతిపదార్థము :** కిరాతరూపధారకః = కిరాత రూపమును ధరించినవాడు!; శివః = శివుడు; సుహృత్తయా = ప్రేమానురాగాలు కలిగిన; అతి శీతయా = బాగా చల్లనిదయిన; దృశా = చూపుచేత; క్షణక్షణే = క్షణ క్షణమందు; ప్రియా ముఖే = ప్రియురాలయిన పార్వతీదేవి ముఖమును చూస్తున్నాడో అట్టి శివుని; సమీక్షతామ్ = చూడుము (ఈక్ష దర్శనే భ్వాది గణము ఆత్మనే పది లోట్ ఏకవచనము); శ్మశానభస్మ = అతని ఒలికిమిట్టకు సంబంధించిన కాలి తెల్లగానైన పొడి, (విబూది.); సంచయాతి = మన ఐశ్వర్యపు వృద్ధిని పొందించుచున్నది, దోషాలను పొగొడుతుంది; శుక్లవిగ్రహః = తెల్లనిశరీరము కలవాడు; గజాజినోత్తరీయకః = గజ + అజిన + ఉత్తరీయకః = ఏనుగు చర్మము, లేడి చర్మము పై బట్టగా కలవాడు, (నువ్వు అనుగ్రహిస్తే); మృడః = శివుడు (మృడః = భక్తులను సంతోష పెట్టువాడు);అర్థి – కల్పవృక్షకః = యాచకులకు కల్పవృక్షమూ అయినవాడు.

**తాత్పర్యము :** ఓ భక్తుడా! క్షణ క్షణమందు ప్రేమానురాగాలు కలిగిన బాగా చల్లనిదయిన చూపుచేత ఏ శివుడు ప్రియురాలయిన పార్వతీదేవి ముఖమును చూస్తున్నాడో అట్టి శివుని చూడుము. అతని శ్మశానానికి సంబంధించిన కాలి తెల్లగానైన విబూది తన ఐశ్వర్యపు వృద్ధిని పొందించుచున్నది. దోషాలను పోగొడుతుంది. శివుడు తెల్లని శరీరము కలవాడు. కల్పవృక్షముతో పోల్చదగినవాడు. కిరాత రూపమును ధరించినవాడు. ఏనుగు చర్మము, లేడి చర్మము పైబట్టగా కలవాడు.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది పంచచామరము (నారాచ, మహోత్సవ) వృత్తం రకానికి చెందినది.

అష్టి ఛందమునకు చెందిన 21846 వ వృత్తము. 16 అక్షరములు మరియూ 24 మాత్రలు ఉంటాయి. ప్రతి పాదములో జ, ర, జ, ర, జ, గ గణములుండును. మాత్రా శ్రేణి: I U I - U I U - I U I - U I U - I U I – U. 4 పాదములు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం ఉంది. తెలుగులో ప్రతి పాదములో 10 వ అక్షరము యతి స్థానము.

**2. సంచయాతి :**

శ్లో॥ అపూర్వః కోపి కోశోయం విద్యతే తవ భారతి ।
వ్యయతో వృద్ధిమాయాతి క్షయమాయాతి సంచయాత్ ॥

ఓ సరస్వతీదేవీ, నీ చెంత ఉన్నటువంటి నిధి చాల అపూర్వమైనది. అదేమిటో, విచిత్రం, ఖర్చు పెడుతూ ఉంటే పెరుగుతుంది. దాచుకుంటే తరుగుతుంది. (ఆ నిధి పేరే విద్య)

**3. సుహృత్తయా :** సోఽబ్రవీద్ కో భవాన్ బ్రూహి మమాత్మానాం సుహృత్తయా. (శ్రీవామన పురాణంలో ముప్పది తొమ్మిదవ అధ్యాయం 69వ శ్లోకం)

శ్లో॥ యథైవ తే పుత్ర! పితా తథాఽహమ్ ।
గురు స్స్వధర్మేణ సుహృత్తయా చ ॥ – రామాయణం2.21.51.

**4. సమీక్షతామ్ :**

శ్లో॥ యే వినిద్రా వినిశ్వాసాశ్శాంతా ధ్యానపరాయణాః ।
ధియా పశ్యంతి హృదయే సోఽయం పద్మే సమీక్షతామ్ ॥

యోగులు నిద్రను జయించి శ్వాసను నిరోధించి మనస్సును ఏకాగ్రము చేసి ధ్యాననిమగ్నులై బుద్ధితో హృదయమునందు ఏ పరమేశ్వరుని దర్శించెదరో, అట్టి ఈశ్వరుడు ఎదుటనున్నాడు. (చూడుము శ్రీశివమహాపురాణములోని తొమ్మిదవ అధ్యాయము 13 వ శ్లోకము).

**5. కిరాత :** మా గచ్ఛ అను శ్లోకములో (శివానందలహరి) శంకరులు శివుని ఆది కిరాత అని సంబోధించారు. నమోమృగయుభ్యశ్శ్వనిభ్యశ్చవోనమః (జంతువులను వేటాడి చంపు వేటగాని రూపములో ఉన్న, కుక్కల మెడలలోని తాళ్లను ధరించిన ఉన్న మీకు నమస్కారము.) అని నమకము నాలుగవ అనువాకములోని ఒక మంత్రములో శివుని కిరాత రూపానికి నమస్కారము చెప్పబడింది. భారవి రచించిన కిరాతార్జునీయములో

పరమేశ్వరుని కిరాత రూప వివరణ విస్తృతంగా ఉంది. శంకర భగవత్పాదులు చెప్పినట్లు మన మనస్సులలోని దుష్ట భావాలనే మృగాలను వేటాడే ఆ ఆది కిరాత రూపధారుని ఈ శ్లోకంలో చెఱువు వారు స్మరించుకొన్నారు.



**శ్లో॥ చిన్ముద్రయా యో వటవృక్షమూలతో**
**మౌనీంద్రవర్గానుపచిత్య శాశ్వతమ్ ।**
**జ్ఞానం ప్రవక్తి ప్రగృహీతమౌనకో**
**నౌమి ప్రభుం తం స్వమనీషితాప్తయే ॥ 41**

**ప్రతిపదార్థము :** చిన్ముద్రయా = జ్ఞాన ముద్రతో (చూపుడు వ్రేలి కొనను బొటన వ్రేలి కొనతో చేర్చి మిగతా మూడు వ్రేళ్ళను చాచి ఉంచిన ముద్ర); యః = ఎవడు; వట వృక్ష = మఱ్ఱిచెట్టు; మూలతః = మూలలో; మౌనీంద్ర వర్గాన్ = మునిశ్రేష్ఠుల సమూహములను; ఉపచిత్య = కలిపి; శాశ్వతమ్ = నాశనము లేని, స్థిరమైన; జ్ఞానమ్ = మోక్ష విషయమైన బుద్ధిని; ప్రవక్తి = బాగుగా చెప్పునో; ప్రగృహీత = బాగుగా గ్రహింపబడిన; మౌనకః = మౌనవ్యాఖ్య కలిగిన మునులు కలవాడగుచున్నాడో; తమ్ = ఆ పరమశివుని; ప్రభుమ్ = ప్రపంచ ప్రభువును; స్వ = ఆత్మీయమైన; మనీషితా = ఇష్టము; ఆప్తయే = పొందుట కొరకు; నౌమి = నమస్కరించుచున్నాను. (ను పరస్మై- స్తుతించుట నౌమి- నువః- నుమః- లట్ ఉత్తమ పురుష)

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకము ఇంద్రవంశము (ఇన్దువంశా) నకు చెందినది. ఇది వృత్తం రకానికి చెందినది. జగతి ఛందమునకు చెందిన 1381 వ వృత్తము. 12 అక్షరములు. 19 మాత్రలు ఉంటాయి. ప్రతి పాదములో త, త, జ, ర గణములుంటాయి. మాత్రా శ్రేణి: U U I - U U I - I U I - U I U. 4 పాదములు ఉంటాయి. తెలుగు లో ప్రాస నియమం తో పాటు ప్రతి పాదములో 8 వ అక్షరము యతి స్థానము.

**2. యః :** "యః కారయతి స కరోత్యేవ" ఎవఁడు చేయించునో వాడు చేయునుకూడ. ఎవఁడు అనుభవింపజేయునో వాడు అనుభవించునుగూడ.

**3. వట వృక్ష :** వటతి మూలైః స్వస్థానం వేష్టయతి వటః వట వేష్టనే. ఊడల చేత స్వస్థానమును చుట్టుకొని ఉండునది కనుక మఱ్ఱిచెట్టునకు వటమని పేరు. విస్తారమయిన

వటవృక్షమునకు విత్తన మతిస్వల్పమైనట్లు అను అర్థములో వటబీజన్యాయము ఉంది. శివుడు వట వృక్షము కింద కూర్చుంటే కృష్ణుడు వట పత్ర శాయి. ఈ విషయం శివ కేశవాద్వైతాన్ని బోధిస్తుంది.

**4. ప్రవక్తి :** ప్రవక్తి కి అందమైన పూర్వకవి ప్రయోగాలు ఇవి – న బ్రవీతి చ యస్సత్యంన ప్రదానం కరోతి చ । అశుచిర్వా శుచిస్థానే యః ప్రవక్తి శృణోతి చ ॥ (శ్రీశివమహా పురాణములోని మహాపాతక వర్ణనము అనే ఐదవ అధ్యాయము17 వశ్లోకము) ఎవడైతే సత్యమును పలుకడో, దానమును చేయడో, అశుచియై మరియు అశుచియగు ప్రదేశములో ప్రవచనమును చెప్పునో మరియు వినునో వాడు మహా పాపమును పొందును. కందర్పదమనమ్ వక్తి – పురాణామమర ద్విషామ్ అని శివ కర్ణామృతములోని ఒక శ్లోక పాదము. (03–105) పుర అను పేరుగల రాక్షసులయొక్క దర్పాన్ని ఎవడు అణచినట్లుగా చెప్పబడుతున్నాడు? కం – దర్ప దమనమ్? అను ప్రశ్నలోనే జవాబు ఉంది. కందర్ప – దమనమ్ – మన్మథుని దర్పాన్ని అణచినవాడు పరమశివుడు.

**5. చిన్ముద్ర :** చూపుడు వ్రేలి కొనను బొటన వ్రేలి కొనతో చేర్చి మిగతా మూడు వ్రేళ్ళను చాచి ఉంచిన ముద్ర చిన్ముద్ర. ఇందు బొటనవ్రేలు బ్రహ్మకి, చూపుడు వేలు జీవునికి ప్రతీక. ఈ చిన్ముద్రనే మౌన వ్యాఖ్య అని చెబుతారు. బొటనవ్రేలికే అంగుష్ఠమని పేరు. హృదయ మధ్యంలో అంగుష్ఠప్రమాణంలో యీశ్వరుడున్నాడని భగవద్గీత. హృదయములోనిది హృదయాకాశం. బయటిది అఖండాకాశం. ఈలోపల ఉన్న వస్తువే బయట సైతం అఖండంగా వ్యాపించి ఉన్నదనే విషయం చిన్ముద్ర చెబుతుంది. "లోపలి వస్తువొకటి, బయటి వస్తువొకటి' అని రెండు వస్తువులులేవు. రెండు రకాలులేవు. అన్నీ ఒకటే అన్న స్వానుభవాన్ని చూపుడు వ్రేలి కొనను బొటన వ్రేలి కొనతో చేర్చి దక్షిణామూర్తి ప్రబోధిస్తున్నారు.

**6. దక్షిణామూర్తి :** చెఱువువారు దక్షిణామూర్తి అని ప్రత్యేకంగా పదం చెప్పకుండా "తం ప్రభుం" అని దక్షిణామూర్తిని సూచించారు. శ్రీ రమణ మహర్షికి రాళ్లలో పుట్టి పెరిగిన మఱ్ఱిచెట్టు ఆకులో భగవంతుని యొక్క దివ్యమంగళ దర్శనమయింది. ఆ మఱ్ఱి చెట్టులోనే సాక్షాత్ శ్రీ దక్షిణామూర్తి తన భౌతికకాయంతో సత్, చిత్, ఆనంద యోగధ్యానంలో అవతరించాడు.

పరమేశ్వరుని రంగు స్ఫటికములా ఉంటుందట. స్ఫటికము నీళ్ళలో మునిగి

ఉన్నప్పుడు అది ఉన్నదనికూడా తెలియదు. అందుకే శివునికి రూపమున్నా రూపము లేనివాడుగా భావింపబడుతున్నాడు. ఈ అరూప రూపి పదము లాంటిదే దక్షిణామూర్తి పదము. దాక్షిణ్యము కల మూర్తి దక్షిణామూర్తి. (రూపము) దక్షిణ + అమూర్తి = దక్షిణామూర్తి (అరూపము)

గురోస్తు మౌన వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః

ప్రతి శివాలయంలోనూ దక్షిణాభిముఖంగా యీ దక్షిణామూర్తి విగ్రహం ఉంటుంది. దక్షిణామూర్తి శిల్పంలో ఆయన చుట్టూ ఎముకలు మాత్రమే మిగిలిన నలుగురు ఋషులు కనిపిస్తుంటారు. ఎముకలు మాత్రం ఉన్నా ఆయుస్సు ఉండేది కృతయుగం. అస్థిగతప్రాణులు. మాంస మున్నంతవరకూ ప్రాణ ముండేది త్రేతాయుగం. మాంసగత ప్రాణులు. రక్తమున్నంతవరకు ప్రాణం ఉండేది ద్వాపరయుగం. వీరు రుధిరగతప్రాణులు. అన్న మున్నంతవరకే ఆయువు ఉండేది కలియుగం. మనము అన్నగత ప్రాణులము. తన తండ్రి "వరుణుడ'నే వాని ప్రబోధంతో 'భృగువు' అనే ముని తపస్సుచేసి చివరికి ఆనంద స్ఫురణ కలుగుతోందని తండ్రిగారితో చెప్పాడు. ఆ ఆనందమే పూర్ణవస్తువు. ఆ ఆనందం అభ్యాసం చేస్తున్న కొద్దీ నడుమనడుమ తెగిపోకుండా సార్వకాలదేశికముగా ఉండిపోతుంది' అని తండ్రి చెప్పాడు. ఈ ఆనందము కలిగించేదే చిన్ముద్రా ప్రబోధం.

7. స్వమనీషితా + ఆప్తయే (= ఆత్మీయమైన ఇష్టముపొందుట కొరకు). జ్ఞానం రెండు రకాలు – ఒకటి పరోక్షజ్ఞానం (థియరీ), రెండవది అపరోక్షజ్ఞానం( ప్రాక్టికల్). అపరోక్ష జ్ఞానోపదేశమే దక్షిణామూర్తి మౌనవ్యాఖ్య. అది ఈ జీవునికి ఆత్మీయమైన ఇష్టాన్ని కలిగించాలని చెఱువువారి వేడికోలు.

వస్తువు లన్నింటిలోనూ తానే నెలకొని ఉన్నటులు శాంతుడై సుస్థిరుడై "అంతా ఒకటే" అనే అద్వైతానుభవం చూపిస్తూ చిన్ముద్రతో ఉపదేశం చేసే శ్రీదక్షిణామూర్తి దర్శనమాత్రాన మాయపొర తొలగి ఆనందాద్వైత జ్ఞానసముద్రంలో మనంగూడా కలసిపోతాం. అని నడిచే దేవుడు కంచి స్వామి చెప్పారు. ( జగద్గురు బోధలు మొదటి భాగం). ఇటువంటి దక్షిణామూర్తి మౌన ప్రబోధం చెఱువువారి శ్లోకంలో పదే పదే చదివితే వినబడుతుంది.



శ్లో॥ తం మృకండుసుతమంతకార్తిత -
త్రస్తమాయురుపనీయ శాశ్వతమ్ ।
యో రరక్ష విభురంతకాంతక -
స్స్వాయుషా చ యశసా యునక్తు మామ్ ॥ 42

**ప్రతిపదార్థము :** తమ్ = అతనిని; మృకండు సుతమ్ = భృగుమహర్షి కొడుకు అయిన ధాతకు ఆయతియందు పుట్టిన కొడుకు మృకండుడు, ఆ మృకండుని కుమారుడైన మార్కండేయుని; అంతక = యమునిచే (అంతం నాశం కరోతీత్యంతకః. డుకృ కరణే- నాశనము చేయువాడు కనుక యమునికి అంతకుడు అని పేరు వచ్చింది); ఆర్తితః = పీడవలన (అర్దనం అర్ద్యతే అనయా చేతి ఆర్తిః అర్ద పీడాయాం. దీనిచేత పీడింప బడును కనుక పీడకు ఆర్తి అని పేరు వచ్చింది); త్రస్తమ్ = భయముపొందిన (త్రస్ భయే); ఆయుః = జీవితకాలమును (ఏతీత్యాయుః ఇణ్ గతౌ = కడచిపోవునది అని ఆయుశ్శబ్దమునకు వ్యుత్పత్తి.); శాశ్వతమ్ = శాశ్వతముగా (శశ్వద్వర్తమానః శాశ్వతః - ఎప్పుడూ ఉండునది. అని శాశ్వత పదానికి వ్యుత్పత్తి); ఉపనీయ = కొనసాగించునట్లు, తిరిగితెచ్చునట్లు (విల్సన్ సంస్కృత నిఘంటువు); యః ప్రభుః = ఏ ప్రభువయిన; అంతకాంతకః = శివుడు. (అంతకాంతక పదానికి యముని అంతమొందించిన వాడు అని ప్రసిద్ధి. కాని మన్మథుని అంతమొందించినవాడు అని అంతకాంతక పదానికి శ్రీ హరినిఘంటువులో అర్థం ఉంది.); రరక్ష = రక్షించెనో (రక్ష పాలనే - లిట్ ప్రథమ పురుష ఏకవచనము రరక్ష); స్వాయుషా చ = నిండయిన బలము, శక్తి, త్రాణ, పరాక్రమము, దార్యములతో, జీవితముతో ( స్వాయుస్ పదానికి వాజసనేయ సంహితను ఉదాహరిస్తూ ఈ అర్థాలను విలియమ్స్ సంస్కృతాంగ్ల నిఘంటువు పేర్కొన్నది); యశసా = కీర్తితో; మామ్ = నన్ను; యునక్తు = కలుపుగాక! (యుజిర్ (యుజ్) యోగే- పరస్మైపదీ - లోట్ ప్రథమ పురుష ఏకవచనము యునక్తు).

**తాత్పర్యము :** యమునిచే పీడింపబడి భయముపొందిన మృకండుని కుమారుడైన మార్కండేయుని జీవిత కాలమును శాశ్వతముగా కొనసాగించునట్లు ఏ ప్రభువయిన శివుడు రక్షించెనో - పూర్ణాయుర్దాయమును ఇచ్చెనో - ఆ శివుడు నాకు నిండయిన జీవితముతో కీర్తి అనుగ్రహించుగాక!

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది రథోద్ధతము (పరాంతికము). రథోద్ధత శ్లోక లక్షణములు ఇవి.

ఇది త్రిష్టుప్పు ఛందమునకు చెందిన 699 వ వృత్తము. ప్రతి పాదములో ర, న, ర, వ(లగ) గణములుండును. 11 అక్షరములు, 16 మాత్రలు ఉంటాయి. మాత్రా శ్రేణి: U I U - I I I - U I U - I U. 4 పాదములు ఉండును. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగులో ప్రతి పాదములో 7 వ అక్షరము యతి స్థానము.

**2. రరక్ష –** కు సంబంధించిన కవి ప్రయోగాలు : మనుం రరక్ష రక్షోభ్యోయామైర్దేవ గణైర్వృతః యజ్ఞభగవానుడు స్వాయంభువ మన్వంతరమందు యామదేవ గుణములతో గూడి రాక్షసుల బారినుండి మనువును కాపాడెను (శ్రీ దేవి భాగవత మహాపురాణములో అష్టమ స్కంధములో భువనకోశమను తృతీయాధ్యాయము.16 వ శ్లోకము).

శ్లో॥ నక్రగ్రస్తపదం సముద్ధృతకరం బ్రహ్మాదిదేవాసురాః
రక్షంతీత్యనుదీనవాక్యకరుణం దేవేష్వ శక్తేషు యః ।
మాభైషీతి రరక్ష నక్రవదనాత్, చక్రాయుధ, శ్రీధరః
ఆర్తత్రాణ పరాయణస్సభగవాన్ నారాయణో మే గతిః ॥
(శ్రీమద్దేశికాచార్యులు రచించిన ఆర్తత్రాణపరాయణాష్టకము 3వ శ్లోకం)

3. మార్కండేయుడు : పదహారు సంవత్సరాల వయస్సులో అల్పాయుష్కుడైన మార్కండేయుడు మృత్యువు నుంచి తనను రక్షించమని శివుడిని వేడుకొన్నాడు. (చంద్రశేఖరాష్టకము) శివుడు ప్రత్యక్షమై యముని బారినుంచి మార్కండేయుని చిరంజీవిగా చేశాడు. ప్రళయ కాలంలో వటపత్రం మీద పసిబాలుని (విష్ణువు) ఉదరంలోకి వెళ్ళిన విశిష్టుడు మార్కండేయుడు. శివకేశవ భేదం పాటించని మహర్షి మార్కండేయుడు. ధర్మరాజుకు మానవ కర్మ గతి, కలియుగ ధర్మాలు చెప్పాడు. వ్యాసుని శిష్యుడైన జైమినికి నాలుగు పక్షుల విషయం చెప్పినవాడు మార్కండేయుడు. అష్టాదశ మహా పురాణాలలో మార్కండేయ పురాణం ప్రసిద్ధమైనది. మొత్తము 134 అధ్యాయాలు.

**శ్లో॥ మాతా త్వం త్వం జనకో – బంధుస్త్వం త్వం సఖా తథాఽధీశః ।**
**కర్తా కరణం కారణ – ముత కార్యం త్వమసి నాఽసి తత్త్వేన ॥ 43**

**ప్రతిపదార్థము :** త్వం మాతా = ఓ శివా ! నువ్వే తల్లివి. (పంచమాతలు:– రాజుభార్య, గురుభార్య, అన్నభార్య, భార్యజనని, స్వజనని) (మా మానే వర్తనే చ. గర్భము తల్లియందు ఇమిడియుండుటచే ఆమెకు మాత అని పేరు వచ్చింది. మాతి వర్తతే గర్భోఽత్ర మాతా); త్వం జనకః = నువ్వే తండ్రివి. (జనయతీతి జనకః. జనీ ప్రాదుర్భావే. పుట్టించు

వాడు కనుక తండ్రికి జనకుడు అని పేరు.); బంధుస్త్వమ్ = బంధుః + త్వమ్ = నువ్వే చుట్టము. (బధ్నాతి ప్రీతిమితి బన్ధుః. బంధ బంధనే. ప్రీతిని పొందించువాడు కనుక చుట్టమునకు బంధువని పేరు); త్వం సఖా = నువ్వే మిత్రుడివి. (సమానః ఖ్యాతః సఖా. ఖ్యా ప్రకథనే. సమానముగా పలుకబడినవాడు కనుక మిత్రునికి సఖుడని పేరు.); తథాఽధీశః = తథా + అధీశః = అలాగే నువ్వే అధికుడివి. చక్రవర్తివి. (అధి + ఈశః. కర్మధారయ సమాసము.); కర్తా = నువ్వే చేయువానివి; కరణమ్ = పనిని సిద్ధింపచేయుటయందు ఉపయోగించు సాధనము నువ్వే; కారణమ్ = చేయునది నువ్వే. (కరోతి కారణం. డుకృఞ్ కరణే.); ఉత = దృఢార్థము, ప్రశ్న, వికల్పము నువ్వే; కార్యం త్వమసి = కార్యం త్వమ్ + అసి = పనివి కూడా నువ్వే అయి ఉన్నావు; తత్వేన = సత్యముతో ఆలోచించినచో; న + అసి = నువ్వు విడిగా లేవు ( నేను, నువ్వు ఒకటే అని అద్వైతం).

**తాత్పర్యము :** ఓ శివా! నువ్వే తల్లివి. నువ్వే తండ్రివి నువ్వే చుట్టము. నువ్వే మిత్రుడివి. అలాగే నువ్వే అధికుడివి. చక్రవర్తివి. నువ్వే చేయువానివి. పనిని సిద్ధింపచేయుటయందు ఉపయోగించు సాధనము నువ్వే. చేయునది నువ్వే. దృఢార్థము, ప్రశ్న, వికల్పము నువ్వే. పనివి కూడా నువ్వే అయి ఉన్నావు. సత్యముతో ఆలోచించినచో నువ్వు విడిగా లేవు. ( నేను, నువ్వు ఒకటే అని అద్వైతం).

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం ఆర్యా వృత్తంలో ఉంది. దీని లక్షణాలు 25 వ శ్లోక వివరణలో ఉన్నాయి.

**2. కరణము :**

త్రి–కరణములు = 1. మనస్సు, 2. వాక్కు, 3. కర్మ.

పంచ కరణములు = పంచ ఇంద్రియములు 1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వ, 5. నాసిక. (జ్ఞానేంద్రియములు) 1. వాక్కు, 2. హస్తములు, 3. పాదములు, 4. పాయువు, 5. ఉపస్థ. (కర్మేంద్రియములు)

ఏకాదశ–కరణములు = 1. బవ కరణము, 2. బాలవ కరణము, 3. కౌలవ కరణము, 4. తైతుల కరణము, 5. గరజి కరణము, 6. వణజి కరణము, 7. భద్రా కరణము, 8. శకుని, 9. చతుష్పాత్తు, 10. నాగకరణము, 11. కింస్తుఘ్నము.

ద్వాదశ-కరణములు = ద్వాదశ-ఇంద్రియములు (కర్మేంద్రియములు (5), జ్ఞానేంద్రియములు (5) , 11. మనస్సు, 12. బుద్ధి

త్రయోదశ-కరణములు = దశ-ఇంద్రియములు, 11. మనస్సు, 12. బుద్ధి, 13. అహంకారము

**3. కారణములు**

త్రివిధ-కారణములు : 1. సమవాయి కారణము (పటమునకు కారణములగు తంతువులు మొ॥), 2. అసమవాయి కారణము (పటమునకు కారణమగు తంతు సంయోగము), 3. నిమిత్త కారణము (పటమునకు కారణమగు తురీ, వేమాదికము). "కారణం త్రివిధమ్, సమవాయ్య సమావాయి నిమిత్త భేదాత్" (తర్కసంగ్రహము)

పంచ-కారణములు = 1. కాలము, 2. స్వభావము, 3. నియతి, 4. పురుషుడు, 5. కర్మ.

షట్-కారణములు = 1. స్వభావము, 2. ఈశ్వరుడు, 3. కాలము, 4. యదృచ్ఛ, 5. నియతి (పూర్వజన్మ సంపాదిత ధర్మాధర్మములు), 6. పరిణామము. (సృష్టిలోని కార్యజాతము పుట్టుటకీ ఆను కారణములని సుశ్రుతమతము)

**4. కార్యములు :** కార్యములు పది. 1.కర్మము. 2. ప్రయోజనము. 3. ఆవశ్యకత. 4. వ్యాజ్యేము. 5. హేతువు. 6. పుట్టినది. 7. జన్మలగ్నమునకు దశమస్థానము. 8. కథాపర్యవసానము. 9. దినకార్యము.

**5. తత్త్వేన :**

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ (భగవద్గీత 11-54)

స్వస్వరూపానుసంధానమే భక్తి అని శంకర భగవత్పాదుల నిర్వచనం. ఆత్మస్వరూపం అన్నదే మానవుడి స్వ స్వరూపం. తనను తాను ఆత్మస్వరూపంగా తెలుసుకోవడము, దర్శించుకోవడమే భక్తి. చెఱువు వారు ఈ ప్రతి పాదనను తత్త్వేన పదముతో ఈ శ్లోకంలో పేర్కొన్నారు. ఎనిమిదేళ్ల చిన్న వయస్సులో "నా2సిత త్వేన" (సత్యముతో ఆలోచించినచో నువ్వు విడిగా లేవు) అనగలిగిన చెఱువు ప్రతిభకు నమో నమః.



శ్లో॥ శచీపతీరితం రతేః పతిం సుమైరవాకిరం
తమాహనస్తృతీయయా దృశా దిశేశసమ్ముఖే ।
అజీవయన్నిజేనతం ద్వితీయలోచనే నతే
కుటుంబినీ విడంబనా హి వామహెూ మహీయసీ ॥ 44

**ప్రతిపదార్థము :** ఇతః = ఇటు; శచీపతి + ఈరితమ్ = ఇంద్రుడు పంపిన (ఈర ప్రేరణే ధాతువు మీద క్త ప్రత్యయం); రతేః పతిమ్ = రతిదేవియొక్క భర్తను మన్మథుని; నిజేనతమ్ = సముఖమున ధనుస్సుతో వంగినవానిని; సుమైః = పూలతో; అవాకిరంతమ్ = బాణములను చల్లుతున్న అతనిని; తృతీయయా = మూడవ కంటి యొక్క; దృశా = చూపుతో; దిశేశ = దిక్కులకు అధిపతి; సమ్ముఖే = ఎదుట; ఆహనః = చంపితివి; అజీవ యన్ = ప్రాణము లేనివానిగా చేసావు; అహెూ = ఆశ్చర్యము; ద్వితీయ లోచనే = రెండవ కన్ను అయిన చంద్రునివలె చల్లగా ఉన్న పార్వతీదేవి; నతే = నతురాలు కాగా; కుటుంబినీ = కుటుంబమును పోషించు నాడుదిగా – భార్యగా; విడంబనా = అనుకరింప చేసావు; హి = నిశ్చయము, అశ్చర్యము; వామ్ = ఓ శివా! మీ ఇద్దరి యొక్క దాంపత్యము; మహీయసీ = మిక్కిలి పెద్దది.

**తాత్పర్యము :** ఓ శివా! ఇంద్రుడు పంపిన రతిదేవియొక్క భర్తను మన్మథుని, సముఖమున దనుస్సుతో వంగిపూలబాణము నీ మీద చల్లితే, మూడవ కంటి యొక్క చూపుతో దిక్కులకు అధిపతులు సంభ్రమంతో చూస్తుండగా బూడిద చేసావు. ఆశ్చర్యము! నీ రెండవ కన్నుఅయిన చంద్రునివలె చల్లగా ఉన్న పార్వతీదేవి భక్తితో నతురాలు కాగా భార్యగా స్వీకరించావు. ఓ శివా! మీ ఇద్దరి యొక్క దాంపత్యము, మిక్కిలి పెద్దది. లోకానికి ఆదర్శ నీయమైనది.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది పంచచామరము (నారాచ, మహెూత్సవ) అష్టి ఛందమునకు చెందిన 21846 వ వృత్తము. 16 అక్షరములు మరియూ 24 మాత్రలు ఉంటాయి. ప్రతి పాదములో జ, ర, జ, ర, జ, గ గణములుండును. మాత్రా శ్రేణి: I U I - U I U - I U I - U I U - I U I – U. 4 పాదములు ఉంటాయి. తెలుగులో ప్రాస నియమం ఉంది. తెలుగులో ప్రతి పాదములో 10 వ అక్షరము యతి స్థానము.

**2. శచీదేవి :** శచీదేవి ఇంద్రుని భార్య. కావ్యకంఠగణపతి మహాముని ఈమెను గురించి

ఇంద్రాణీ సప్తశతి వ్రాసారు. (వికచ కుసుమ మందార ద్రుమ వన వరవాటీషు / విహరణ మయి కుర్వాణామనసిజమనుగృహ్ణాసి ॥ (11శ్లోక). తల్లీ! ఇంద్రాణీ! వికసించిన పూలున్న మందారపు వనంలో విహరిస్తూ నీవు ఆ మన్మథుని అనుగ్రహిస్తూ ఉన్నావని భావం.) అటువంటి శచీపతితో రతిపతిని చెఱువు వారు ఇందులో కలిపారు. రెండు చోట్ల 'పతి' పదప్రయోగము అందంగాఉంది.

3. అవాకిరన్ (కృ విక్షేపే) : "అవాకిరన్ బాల లతాః ప్రసూనైః / ఆచారలాజైరివ పౌరకన్యాః" (రఘువం. 02-10). ఆ దిలీప మహారాజును రాజు బయటికి వెళ్ళునప్పుడు చల్లు వరి పేలాల వలె - పువ్వులను లేత తీగలు చల్లినవి.

**4. నిజే దేహే :** పిండ బ్రహ్మాండయో రైక్యా ద్భావయే త్స్వతనౌ తథా। దేవీరూపే నిజే దేహే తన్మయత్వాయ సాధకః ॥ విరాడ్రూపిణి మహాదేవి వేదమాత యైన గాయత్రి నైక్యభావముతో ధ్యానించి తన యంగములందు సాధకు డాయా దేవతలను న్యాస మొనర్చుకొనవలయును (శ్రీదేవీ భాగవత మహాపురాణమందలి ద్వాదశ స్కంధమున గాయత్రీ హృదయ మనెడు నాల్గవ యధ్యాయము. 5 వ శ్లోకము.)

**5. లోచనే :** శాస్త్ర పఠనపు గొప్పతనాన్ని వివరించిన శ్లోకములో లోచనే పదము మనోహరంగా ప్రయోగింపబడింది.

శ్లో॥ కామం కర్ణాంతవిశ్రాంతే - విశాలే తస్య లోచనే ।
చక్షుష్మత్తాతు శాస్త్రేణ - సూక్ష్మకార్యార్థదర్శినా ॥

(చెవులదగ్గర విశ్రాంతి తీసుకొన్న విశాలమైన నేత్రాలతో లోకాన్నయితే చూడగలం కాని సూక్ష్మదృష్టి గలిగి నప్పుడు మాత్రమే కావ్యార్థాలను, అందులోని సూక్ష్మాంశాల్నీ చూడగలం.) చెఱువువారి శ్లోకంలోని "లోచనే" పదం కూడా ఇటువంటి సూక్ష్మార్థాలు కలిగినది.



**శ్లో॥ సర్పహారవలయాంఘ్రినూపురో - భస్మచందనవిలేపనో భవాన్ ।**
**వహ్నిదృక్తదపి చాశ్రయంత్యహో - జ్ఞానరత్ననిధిరిత్యమీ జనాః ॥ 45**

**ప్రతిపదార్థము :** భవాన్ = ఓ శివా! నువ్వు (భవాన్ - భవన్తౌ - భవన్తః); సర్ప = పాములను (సర్పతీతి సర్పః. సృప్ గతౌ. చరించునది సర్పము); హార = మెడలో

పూల మాలగా, హారములుగా కలిగినవాడివి (హృ హరణే. దేనిచేత మనస్సు హరింపబడునో అది హారము); వలయ = కడియములుగా కలిగినవాడివి (వల సంవరణే. చుట్టుకొని యుండునది); అంఘ్రి = పాదములందు (అఘి గతౌ దీనిచే నడతురు గనుక పాదమునకు అంఘ్రి అని పేరు); నూపురః = అందెలుగా ధరించిన వాడివి. (నూయతే నూపురః. ణు స్తుతౌ. స్తోత్రము చేయబడునది కనుక అందెకు నూపురమని పేరు); భస్మ = బూడిదను; చందన = గంధపు; విలేపన = పూతగా కలిగినవాడివి; వహ్ని = అగ్ని (వహ ప్రాపణే. వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః – హవ్యమును దేవతలకు చేర్చువాడు కనుక అగ్నికి వహ్ని అను పేరు వచ్చింది); దృక్ = కన్నుగా కలిగినవాడివి. (పశ్యంతి అనయా దృక్. దృశిర్ ప్రేక్షణే దీని చేత చూడబడును కనుక నేత్రమునకు దృక్ అని పేరు. ); తదపి చ = అయినప్పటికి నిన్ను; జ్ఞాన రత్ననిధిః ఇతి = జ్ఞాన సముద్రమని; అమీ = ఈ (అసౌ – అమూ – అమీ – సకారాంత పుంలింగ అదస్ శబ్ద బహువచనము); జనాః = సమస్త జనులు; ఆశ్రయంతి = ఆశ్రయించుచున్నారు; అహెూ = ఆశ్చర్యము కదా!

**తాత్పర్యము :** ఓ శివా! నువ్వు పాములను మెడలో పూల మాలగా కలిగినవాడివి. కడియములుగా కలిగినవాడివి. పాదములందు అందెలుగా ధరించినవాడివి. బూడిద గంధపు పూతగా కలిగినవాడివి. అగ్ని కన్నుగా కలిగినవాడివి. అయినప్పటికి నిన్ను జ్ఞానసముద్రమని ఈ సమస్తజనులు ఆశ్రయించుచున్నారు. ఆశ్చర్యము కదా!

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది రథోద్ధతము (పరాంతికము). ఇది త్రిష్టుప్పు ఛందమునకు చెందిన 699 వ వృత్తము. ప్రతి పాదములో ర, న, ర, వ(లగ) గణములుండును. 11 అక్షరములు, 16 మాత్రలు ఉంటాయి. మాత్రా శ్రేణి: U I U - I I I - U I U - I U. 4 పాదములు ఉండును. తెలుగులో ప్రాస నియమం కలదు. తెలుగులో ప్రతి పాదములో 7 వ అక్షరము యతి స్థానము.

**2. సర్పఫణ న్యాయం :** పాము ఎట్టి ఆపదలోనైనా తన పడగ పైకెత్తి బుస్సుమంటూ ప్రజలను భయపెట్టి తప్పించుకొని పారిపోయినట్లుగా లోకంలో కొందరు వ్యక్తులు ప్రవర్తిస్తుంటారనే సందర్భంలో ఈ న్యాయం చెబుతారు.

**3. భస్మము : "త్రాయుషం జమదగ్నేః"** మొదలైన మంత్రాలను పఠిస్తూ శరీరం నిండా

భస్మాన్ని పులుముకోవడం భస్మస్నానం. దీనిని ఆగ్నేయ స్నానమని కూడా అంటారు. ఉజ్జయినిలో మహాకాలుడికి (శివలింగం) చితా భస్మంతో స్నానం చేయించే సంప్రదాయం ఉంది. బూడిదతో కప్పబడిన నిప్పు పైకి లేనట్లుండి లోపల మండుతూనే ఉన్నట్లు చెబితే భస్మచ్ఛన్నాగ్నిన్యాయం. బూడిదలో నేయి హోమం చేసినట్లుగా ఉందని చెబితే అది భస్మన్యాజ్యాహుతిన్యాయం.

సృష్టిలో ఉన్న ఏ వస్తువయినా అగ్నికి ఆహుతి అయితే భస్మమవుతుంది. తాను లయకారుడని చెప్పేందుకు శివుడు భస్మం ధరిస్తాడు. భస్మం నిరంతర బ్రహ్మానందమునకు ప్రతీకగా పెద్దలు చెబుతారు. భస్మానికి నాశనం లేదు.

**4. మూడవ కన్ను :** శివుని నుదుటిన ఉన్న మూడవకన్ను అన్ని ద్వంద్వములకు అతీతంగా ఉండే పరమజ్ఞానానికి సూచిక. ఆజ్ఞా చక్రమునకు స్థానం ఈ మూడవ కన్ను.

**5. విరోధాభాసాలంకారము :** ఈ శ్లోకములో విరోధాభాసాలంకారధ్వని ఉంది. పైకి విరోధముగ కనిపించినప్పటికి ఆలోచిస్తే విరోధము తొలగిపోతే అది విరోధాభాసా-లంకారము. పాములు మొదలైన వాటిని ధరించినవానికి జ్ఞానవంతుడు ఎలా అవుతాడనేది విరోధము. పాములు నిరంతర చైతన్యానికి ప్రతీకలు. మనకు భయం కలిగించేవి. శివుడు మానవులను కాపాడతాను అనే అభయం ఇవ్వటానికి వాటిని ధరిస్తున్నాడు. మెడ చుట్టు ఉన్న పాము కాలచక్రానికి సంకేతం. కుండలిని శక్తిని పోలిన పామును ధరించుట ద్వారా మోక్షం తన ద్వారానే సాధ్యమని శివుని సూచన. ఇలా విరోధము తొలగిపోయి శివుని జ్ఞానము నిరూపింపబడినది కనుక ఇది విరోధాభాసాలంకారము.

6. జ్ఞానము : జ్ఞానము రెండు విధాలు. మొదటిది శబ్దజ్ఞానము. రెండవది అనుభవజన్య జ్ఞానము. బుద్ధి బలముతో– ఊహిస్తూ వేదశాస్త్రార్థ చమత్కారములు తెలుసుకొనుట శబ్దజ్ఞానం. ఆశ్చర్యమేమిటంటే బుద్ధి కోసం తెలుసుకొనే శాస్త్రజ్ఞానము వలన బుద్ధినాశనము – దానివలన జ్ఞాననాశనము కూడా వస్తుంది. రెండవద అనుభవజన్య జ్ఞానము. ఇది లభించటం చాలా కష్టం సద్గురువు వల్ల సత్సాంగత్యమువల్ల ఇది లభిస్తుంది.

శబ్దజ్ఞానము ఆత్మానుభవజ్ఞానము కలిగించదు. జన్మజన్మముల నుంచి వస్తున్న అజ్ఞానపు పెంజీకటుల తెరలను చీల్చదు. ఎలా అంటే, దీపము గూర్చి తెలిసినంత మాత్రాన చీకట్లు పోవు. దీపాన్ని వెలిగిస్తేనే చీకట్లు పోతాయి. దీపము గురించి తెలుసుకోవటం పుస్తకాలు అనేకము చదివే శబ్ద జ్ఞానము. సద్గురువును ఆశ్రయిస్తే, సత్సాంగత్యము లభిస్తే – ఏది బంధకారణముగాదో అదే నిజమైన కర్మ అని. దేనివలన విముక్తి కలుగుతుందో అదే విద్య అని అనుభవ పూర్వకమైన వెలుగులు ప్రసరిస్తాయి. అనుభవ జ్ఞానము కలుగుతుంది. (శ్రీమద్దేవీభాగవతములో షష్ఠస్కంధములో నిమి చరిత్రమను పంచదశాధ్యాయములో 50 నుండి 64 శ్లోకాలు)

7. శివయ్యను మించిన సద్గురువు ఎవరున్నారు? ఆయనను స్తుతించటం కంటె సత్సాంగత్యము ఇంకొకటి ఎక్కడుంది? ఆయన కరుణ ప్రసరిస్తే మనలోని అజ్ఞానము సెలవు తీసుకొంటుంది. అందుకే ఆయనను జ్ఞాన సముద్రమని చెఱువువారు ఈ శ్లోకంలో పొగిడారు.



**శ్లో॥ యోంధకమార్యః ప్రోతం – శూలే పాచయతి పలలఖండమివ ।**
**ఆప్రాతశ్చాసాయం – లోకావనహేతుతస్తమీడేఽహమ్ ॥ 46**

**ప్రతిపదార్థము :** యః ఆర్యః = ఏ పూజ్యుడయిన శివుడు; అంధకమ్ = అంధకాసురుడను రాక్షసుని; శూలే = శూలమునందు; ఆప్రాతః = సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకు పగటి కాలాన్ని ఐదు భాగాలు చేస్తే అందులో మొదటి భాగమయిన ప్రాతః కాలముమొదలు; ఆసాయం చ = సాయంత్రము వరకు; ప్రోతమ్ = కుట్టబడినవాడిగా చేసాడో (గుచ్చబడినాడు); పలలఖండమ్ + ఇవ = మాంసపు తునుక వలె; పాచయతి = శూలముపై వండినట్లు చేసాడో (డుపచష్ పాకే); లోక + అవన = ఆ శివుని యొక్క లోకములను కాపాడు (తృప్తి పొందించు); హేతుతః = కారణము వలన; తమ్ = అతనిని; అహమ్ = నేను; ఈడే = స్తుతించుచున్నాను.

**తాత్పర్యము :** ఏ పూజ్యుడయిన శివుడు అంధకాసురుడను రాక్షసుని శూలమునందు తెల్లవారు మొదలు సాయంత్రము వరకు శూలమునందు గుచ్చాడో, మాంసపు తునుక వలె శూలముపై వండినట్లు చేసాడో, ఆ శివుని యొక్క లోకములను కాపాడు కారణము వలన అతనిని నేను స్తుతించుచున్నాను.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకం ఆర్యా వృత్తములో ఉన్నది. (దీని లక్షణాలు 25 వ శ్లోకములో వివరించబడ్డాయి).

**2. శూలే ప్రోతం :** సూత్ర ప్రోతము, (fastened with wires as puppets), శల్య ప్రోతము (pierced or transfixed by an arrow), సూచీప్రోతము (threaded) రథ ప్రోతము, ("fixed in a car", a particular personification) ఓతప్రోతము (నాలుగు ప్రక్కల వ్యాపించియున్నది, నిలువుగాను అడ్డముగాను నేయబడినది.) పదాలవలె – "శూల ప్రోతము" (fixed on a stake, impaled) కూడా సంస్కృతంలో అందమైన ప్రయోగము. చెఱువువారు ఈ శ్లోకములో దీనిని శూలే ప్రోతం అన్నారు.

**3. ఈడే :** ప్రభుం ప్రాణ నాథం...మొదలయిన శివ స్తుతులలో ఈ "ఈడే" ప్రయోగం సుప్రసిద్ధం.

**4. అంధకాసురుడు :** ఒకసారి పరమేశ్వరుడు కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఒకసారి పార్వతీదేవి హాస్యాలాడుతూ పరమశివుని కళ్ళు మూసింది. సమస్త బ్రహ్మాండాలు చీకటి అయిపోయాయి. అమ్మవారు చేతులు తీయగానే మరల ప్రకాశించాయి. ఈలోపుగా ఒక ఉపాధి స్వరూపమును పొంది కళ్ళు లేని నల్లపిల్లవాడు అయి ఏడుపు మొదలుపెట్టింది. అంధకారం నుండి పుట్టినవాడు కాబట్టి వాడికి అంధకుడు అని పేరు వచ్చింది. అంధకుడు కొండంత పెరిగిపోయి తనని సమీపించిన వారిని నోట్లో వేసుకొనేవాడు. అమ్మవారు భర్తను అంధకుని గురించి అడిగింది. నువ్వు నా కళ్ళు మూయడం వల్ల పుట్టాడు కనుక వీడు నీకూ నాకూ కొడుకే అని చెప్పాడు. వాడిని చంపటానికి కుదరదని అంధకుడిని అడవులకు పంపించారు. హిరణ్యాక్షుడికి సంతానం లేదని తనని గూర్చి తపస్సు చేస్తే శివుడూ అంధకుడిని పెంచుకొమ్మని ఇచ్చాడు. వాడు పెరిగి పెద్దవాడయ్యాడు. అంధకుడు బ్రహ్మగారి గురించి తపస్సు చేసి "1.కళ్ళను ఇవ్వవలసినదిగా, 2.తల్లిని పొందాలన్న కోరిక తనకు పుట్టినప్పుడు మాత్రమే చచ్చిపోవాలి" అను రెండు వరాలు ఇమ్మన్నాడు. బ్రహ్మగారు అనుగ్రహించారు.

పాపం పండి జగదంబ అయిన పార్వతిని కోరుకొన్న అంధకాసురుడిని శంకరుడు త్రిశూలంతో గ్రుచ్చాడు. చంపలేదు. వాడు త్రిశూలంమీద పడుకుని ఆయన జటాజూటాన్ని పీకాడు. త్రిశూల స్పర్శ వల్ల అంధకునిలో మార్పు వచ్చింది. ఏ కంటితో

ప్రపంచంలో ప్రతిదాన్ని చూసి అనుభవైక వేద్యములని అనుకున్నానో అవి వాస్తవాలు కావనే జ్ఞానం కలిగింది. శివుని నూట ఎనిమిది నామములతో స్తుతించాడు. తప్పు మన్నించమన్నాడు. శివుడు అంధకుడిని ప్రమథగణములలో తీసుకున్నాడు. (శివపురాణము – యుద్ధ ఖండము).

అయితే అగ్ని పురాణములో విష్ణువు అంధకుని చంపినట్లుగా ఉంది. "గౌరీం జిహీర్షుణా రుద్రమంధకే నార్దితం హరిః । అనురక్తశ్చ రేవత్యాం చక్రేచాంధాసురార్దనమ్॥ అంధకాసురుడు గౌరిని అపహరించుటకై రుద్రునకు కష్టమును కలిగించగ, రేవత్యనురక్తుడగు శ్రీహరి ఆ అసురుని సంహరించెను" (అగ్ని మహాపురాణమున ద్వాదశ సంగ్రామములను రెండువందలడెబ్బదియారవ అధ్యాయము 20 శ్లో గౌరీం జిహీర్షుణా రుద్రమంధకే నార్దితం హరిః । అనురక్తశ్చ రేవత్యాం చక్రేచాంధాసురార్దనమ్॥)

అంధకునిలా మన చూపు కూడా మారాలి. యథార్థము గుర్తించాలి. శివ కేశవులు ఒకరే అనే విషయం దృఢంగా మన మనస్సులో ఉంటే, పురాణాలలో వైరుధ్యాలు మనకు కనిపించవు. ఆ చూపు రాకపోతే సంశయాలతోనే విలువైన జీవితం మన చేతిలోనుంచి జారిపోతుంది. సంశయాత్మా వినశ్యతి.



**శ్లో॥ ఉదంచయన్దివం భువం విదారయన్దిశో దశ**
**ప్రదూరయన్ప్రభావభాసురస్సురైః ప్రనృత్యసి ।**
**విడంబనేయమప్యహో విశాలవిశ్వమంగళ –**
**ప్రకారతా పరిస్ఫురత్ప్రతీతికృద్వివేకినామ్ ॥ 47**

**ప్రతిపదార్థము :** దివమ్ = ఆకాశమును; ఉదంచయన్ = పైకి ఎగరవేచుచున్నది, విజృంభించుచున్నది; భువమ్ = భూలోకమును; విదారయన్ = చీల్చుచున్నది; దశ దిశః = 1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ అను పదిదిక్కులను (ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, యముడు, శివుడు, నిరృతి, వాయువు, అగ్ని, బ్రహ్మ, శేషుడు – వీరు క్రమముగా దశదిశలకు అధిపతులు); ప్రదూరయన్ = దూరముగా ఉంచుచూ; ప్రభావభాసురః = ప్రభావము కలిగించుచు; సురైః = దేవతలతో కలిసి; ప్రనృత్యసి = బాగా తాండవ నృత్యము చేయుచున్నావు; అహో = ఓ శివా!

అద్భుతమైన నీ తాండవ నృత్యము; ఇయమ్ = దీనిని; విడంబనా అపి = అనుకరించు చున్నప్పటికి; వివేకినామ్ = వివేకులకు; విశాల = విరివియైన; విశ్వమంగళ = విశ్వ శుభాన్ని కోరే; ప్రకారతా = విధానముగా; పరిస్ఫురత్ = స్పష్టమైనదిగా తోచుచు; ప్రతీతికృత్ = ప్రసిద్ధి కలదానిగా (నేను శుద్ధాత్మను అనే దృఢ నిశ్చయం ను ప్రతీతి అంటారు. జాగృతి ఉన్నంత కాలమూ ప్రతీతి నిల్చి ఉంటుంది. మొదట జాగృతి యొక్క అనుభవం కలుతుంది. తర్వాత ప్రతీతి).

**తాత్పర్యము :** ఓ శివా! అద్భుతమైన నీ తాండవ నృత్యము ఆకాశమును, భూలోకమును దూరముగా ఉంచుచూ, పైకి ఎగరవేచుచున్నది, విజృంభించుచున్నది. (శివుని నృత్యపు వేగాన్ని వర్ణించటానికి ఈ అతిశయోక్త్యలంకారము). 1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ అను పదిదిక్కులను ధ్వనులతో చీల్చుచున్నది. నీ తాండవ నృత్యము వివేకులకు విశ్వ శుభాన్ని కోరే విధానపు అనుకరణముగా ప్రసిద్ధి కలదానిగా స్పష్టమైనదిగా తోచుచున్నది. ప్రభావము కలిగించుచున్నది. దేవతలతో కలిసి బాగా తాండవ నృత్యము చేయుచున్నావు.

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఇది పంచచామరము. దీని లక్షణాలు 39వ శ్లోకములో చెప్పబడ్డాయి. రావణ శివతాండవ స్తోత్రము లోని పంచ చామర వృత్తమే చెఱువు వారి రచనలోను కనబడుట గమనార్హము.

**2. దివం :** దివం సర్వాముర్వీమరుణిమనిమగ్నాం స్మరతి (సౌందర్య లహరి 18వశ్లో) అమ్మ యొక్క ఎర్రని శరీర కాంతి ఆకాశాన్ని భూలోకాన్ని ఎర్రదనమనే సముద్రంలో మునిగిపోయినట్లు చేస్తోంది అన్నారు శంకర భగవత్పాదులు. అదే ఆకాశము, భూమి శివతాండవముతో ఎగిరెగిరి పడుతున్నాయని చెఱువువారి వర్ణన. "నేలయు నింగియు తాళముల్ గా జేసి, యేపున రేగి వాయించి (విరాట. 134 ప.) అని పలికిన తిక్కనగారి భావనా వైదుష్యానికి ఆకాశమును భూలోకమును ఎగురవేసిన ఈ చెఱువు వారు సరిజోడి.

**3. తాండవనృత్యము :** శివునికి రెండు అవస్థలు ఒకటి సమాధి అవస్థ రెండవది తాండవ నృత్య అవస్థ. సమాధి నిర్గుణం, తాండవ నృత్యం సద్గుణం. శివునికి నృత్యమంటే

చాలా ఇష్టం. ప్రదోష అష్టక స్తోత్రంలో పరమశివుడు నటరాజస్వామి అయి నాట్యం చేస్తే, బ్రహ్మాది దేవతలందరూ ఆనందంతో చూస్తారని అద్భుతమైన వర్ణనలున్నాయి. (వాగ్దేవీ ధృత వల్లకీ). ఈ తాండవ నృత్యాన్ని ప్రధానంగా మూడు విధాలుగా పెద్దలు చెప్పారు. మొదటిది – సర్వ ప్రపంచ సృష్టి స్పందన చైతన్య స్వరూపమే శివనృత్యము. అఖిలాండ బ్రహ్మాండ కోటులు అనంతముగ వివిధ భంగులలో దీనిలో కదలుతుంటాయి. రెండవది – పాశబద్ధులైన జీవులకు మోక్షాన్ని ఇచ్చే సంహారక్రియకు ప్రతీక ప్రళయ తాండవము. మూడవది – ఈ తాండవానికి రంగభూమి చిత్–అంబరము. అంటే మానవుని హృదయాంతర సీమ. ఇది భక్తులైన విజ్ఞులకు అనుభూతిశాల. ఇక్కడ పరమశివుడు రంగస్థలమును స్వీకరించి, నృత్యము చేసి, జీవునికి మోక్షమిస్తాడు. ప్రనృత్యసి (= బాగా తాండవ నృత్యము చేయుచున్నావు.) అనుట ద్వారా చెఱువు వారు ఈ మూడు నృత్యాల ప్రస్తావన చేసారు.

**4. పరిస్ఫురత్ :** చెఱువు వారి పరిస్ఫురత్ ప్రయోగము రామకృష్ణకవి రచించిన మహిషాసురమర్దిని స్తోత్రములోని పరిస్ఫురత్ ప్రయోగమును గుర్తుకు తెచ్చుచున్నది. 'దనుజ సుసంగర రక్షణ సంగ పరిస్ఫుర దంగ న టత్కటకే'. (08వ శ్లో) (రాక్షసులతో జరుగుచున్న మహాయుద్ధములో రక్షణ కార్యపు సంగతిచే ఎక్కువగా కదలుచున్నట్లు తోచుచున్న అవయవములలో కదలాడుచున్న కరకంకణములు కలదానా !)

**5. విశాల విశ్వ మంగళ :** చెఱువు వారు కోరిన ఈ ప్రపంచ శుభాకాంక్ష రావణకృత శివతాండవస్తోత్రములో కనిపించుచున్నది.

**శ్లో॥ నవీనమేఘమండలీ నిరుద్ధదుర్ధరస్ఫురత్**
**కుహూనిశీథినీతమః ప్రబంధబంధకంధరః ।**
**నిలింపనిర్ఝరీధరస్తనోతు కృత్తిసింధురః**
**కళానిధానబంధురః శ్రియం జగద్ధురంధరః ॥ 8 ॥**

కొత్త మేఘములను ధిక్కరిస్తున్న అమావాస్య రాత్రిని పోలిన నల్లని కంఠము కలవాడు, ఆకాశ గంగను తన శిరస్సు మీద ధరించిన వాడు, కృత్తికా నక్షత్రంలో ఉండేవాడు, గజ చర్మాన్ని కప్పుకొన్నవాడు, తెల్లని చంద్ర కళను నిరోధించే నల్లని కంఠము కలవాడు అయిన పరమశివుడు ప్రపంచమునకు శ్రేయస్సును ప్రసాదించునుగాక! (స్వీయానువాదము) శుభం భూయాత్.



**శ్లో॥ స్వేనాస్థితం హృదయమధ్య ఉదేతు నిత్యం**
**ముఖ్యం విలోచనమహీనమహీశతాంగ! ।**
**ఆహ్లాదయేద్దయితయోపహృతం ద్వితీయం**
**దుఃఖావహం దహతుమే దురితం తృతీయమ్ ॥** 48

**ప్రతిపదార్థము :** అహీన = తక్కువ కాని; మహీ = భూమియే (మహ పూజాయాం. పూజింపబడునది కనుక భూమికి మహి అని పేరు వచ్చింది); శతాంగ = రథముగా గల ఓ పరమశివా! (శతం అంగాన్యస్యేతి శతాంగః – నూరు అవయవములు కలది కనుక రథాన్ని శతాంగము అన్నారు); స్వేనాస్థితమ్ = నీ చేత ధరింపబడిన ప్రధాన నేత్రము చంద్రకళాత్మకము; హృదయమధ్యే = అది నా హృదయమధ్యమున (హ్రియతే విషయైరితి హృదయం. హృ హరణే.. విషయాదుల చేత హరింపబడునది కనుక మనస్సునకు హృదయమని పేరు); నిత్యమ్ = నిత్యము (నియతం భవతీతి నిత్యం. ఎడతెగని ఉనికి కలది కనుక నిత్యము); ఉదేతు = ఉదయించుగాక!; ద్వితీయమ్ = ద్వితీయ నేత్రము; దయితయా = నీ మనస్సునకు ప్రియమైన నీ భార్య యగు పార్వతిచే (దయతే చిత్తమాదత్త ఇతి దయితం. దయ దానగతిరక్షణ హింసా దానేషు. మనస్సును ఆకర్షించునది దయితము); ఉపహృతమ్ = స్వీకరింపబడినది; ఆహ్లాద యేత్ = ఆ నేత్రము నాకు ఆహ్లాదకారకమగుగాక!; తృతీయమ్ = ఇక తృతీయ నేత్రమగు ఫాలనేత్రము; దుఃఖావహమ్ = దుఃఖమునకు కారణమైన; మే = నాయొక్క; దురితమ్ = పాపమును (దుః నిందితం ఇతం గమనం అస్య దురితం. ఇణ్గతౌ. నిందితమైన నడత కలిగినది కనుక పాపానికి దురితమని పేరు); దహతు = హరించుగాక!

**తాత్పర్యము :** (ఈ శ్లోకంలో శివుని అర్ధనారీశ్వరరూపం వర్ణించబడింది). భూమియే రథముగా గల ఓ పరమశివా! నీ చేత ధరింపబడిన ప్రధాన నేత్రము చంద్రకళాత్మకము. అది నా హృదయమధ్యమున నిత్యము ఉదయించుగాక! ద్వితీయ నేత్రము అర్ధ నారీశ్వర రూపములో నీ భార్య యగు పార్వతిచే స్వీకరింపబడినది. అది నాకు ఆహ్లాదకారకమగుగాక! ఇక తృతీయ నేత్రమగు ఫాలనేత్రము దుఃఖమునకు కారణమైన నాయొక్క పాపమును హరించుగాక!

**విశేషాలు :**

**1. ఛందస్సు :** ఈ శ్లోకము వసంతతిలక వృత్తములో ఉంది. గణములు త–భ–జ–జ–గ–గ, 14 అక్షరములు లేదా21 మాత్రలు ఉంటాయి.

2. హృదయ మధ్యే : అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః । అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥ (ఓ అర్జునా, నేను సర్వ భూతముల హృదయములలో కూర్చుని ఉన్నాను. నేనే సర్వ ప్రాణుల ఆది, మధ్యము మరియు అంత్యము. 10– 20) అని భగవద్గీత.

హృదయస్థా (హృదయమునందు ఉండునది) పశ్యంతీ (హృదయ కమలంలో ప్రవేశించిన పరావాక్కుయొక్క సూక్ష్మరూపమైన రెండవస్థితిలోని వాక్స్వరూపిణి యైనది) అని లలితాసహస్ర నామములు. వీటి బాటలోనే చెఱువు వారు ఈ శ్లోకములో **హృదయ మధ్యే!** అని ప్రయోగించారు.

**3. మహీశతాంగ :** త్రిపురాసుర సంహారానికి శివుడు వెళ్ళినప్పుడు, భూమి ఆయనకు రథంగా, బ్రహ్మ సారథిగా, సూర్య చంద్రులు రథానికి చక్రాలుగా పరిణమించాయి.

**4. ఉదేతు :** "ఉదేతుమత్యజన్నీహాం రాజసు ద్వాదశ స్వపి" (చెఱువు వారు పరిశోధించిన శిశుపాలవధ ద్వితీయ సర్గ)

**5. దురితం దహతు** (పాపమును హరించుగాక) : కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః (ధన్యాలోకము). కామాక్ష్యా మమ దహతు సంసారవిపినమ్ (మూక పంచశతి పాదారవింద శతకము 56 వశ్లో). ఊరీ కురు మామజ్ఞమనాథం దూరీ కురు మే దురితం భో సాంబ సదాశివ శంభో శంకర శరణం మే తవ చరణయుగం (శంకర భగవత్పాదుల సువర్ణమాలా స్తుతి 07వ శ్లో). త్వచి దోషాః దృశి దోషాః హృది దోషాః యే అఖిలేంద్రియ దోషాః । తాన్ పూషా హతదోషః కించిత్ రోషాగ్నినా దహతు ॥ (చర్మసంబంధమైన దోషములు, దృష్టిసంబంధమైన దోషములు, హృదయసంబంధమైన దోషములు, సకల ఇంద్రియములకు సంబంధించిన దోషములు, ఏవియేవి కలుగగలవో, కలవో, వానిని అన్నిటిని, సర్వదోషనాశకరుడైన పూష (పోషకుడైన) భగవానుడగు సూర్యుడు, కొద్దిపాటి రోషాగ్నితో దహించుగాక !) (శ్రీ సూర్యనారాయణ ఆర్యాద్వాదశకస్తోత్రమ్06వ శ్లోకము). ప్రసిద్ధమైన పై మహాకవుల ప్రయోగ సరళిలోనే చెఱువు వారు "దురితం దహతు"ను ఈ శ్లోకంలో తృతీయ శబ్ద వైవిధ్యంతో ప్రయోగించారు. (వివరణలో నా సందేహమును తీర్చిన పెద్దలు శ్రీ అయాచితం నటేశ్వరశర్మగారికి, హృదయ పూర్వక ధన్యవాదములు).



**శ్లో॥ కామం దగ్ధ్వా మాతుల – మీక్షణ వహ్నిర్నదీప్రవాహస్య ।**
**మధ్యస్థం కురుషేఽబ్జం – దోషేఽన్యం స్వముత శిక్షయసి సామ్యాత్ ॥ 49**

**ప్రతిపదార్థము :** కామమ్ = మన్మథుని (కామ్యతే అనేన కామః – ఎవరిచేత కోరబడునో వాడు కాముడు. మన్మథుడు); దగ్ధ్వా = కాల్చి; మాతులమ్ = ఆతని మేనమామ అయిన చంద్రుని (మాతుః భ్రాతా మాతులః – తల్లి తో – తోడబుట్టిన వాడు); ఈక్షణ = చూపు అనే (ఈ క్షా ఈక్షణం. ఈక్ష దర్శనే); వహ్నిః = అగ్ని (వహ ప్రాపణే. వహతి ప్రాపయతి హవ్యమితి వహ్నిః – హవ్యమును దేవతలకు చేర్చువాడు కనుక అగ్నికి వహ్ని అను పేరు వచ్చింది.); నదీ ప్రవాహస్య = నదీ ప్రవాహము యొక్క (ఎనిమిది మైళ్ల దూరానికి మించి పడమర నుంచి తూర్పు దిక్కునకు పారే ఏరు నది); మధ్యస్థమ్ = మధ్యలో; అబ్జమ్ = పద్మముగా (అద్భ్యః జాయత ఇతి అబ్జః – జనీ ప్రాదుర్భావే. నీళ్లవలన పుట్టునది.); కురుషే = చేయుచున్నావు (కృ ధాతువు. ఆత్మనేపది మధ్యమపురుష ఏకవచనము); దోషే = దోషములందు (ద్వివిధ చిత్త దోషములు 1. రజస్సు, 2. తమస్సు. "రజస్తమశ్చ మనసో ద్వౌ దోషౌ సముదీరితౌ"); అన్యమ్ = ఇతరమని, మరియొకటని; స్వమ్ = తనదని లేకుండా; సామ్యాత్ = సామ్యము వలన; శిక్షయసి = శిక్షించుచున్నావు; ఉత = దృఢార్థము.

**తాత్పర్యము :** ఓ శివా! నీ తపస్సుకు విఘ్నము కలిగించిన మన్మథుని కాల్చావు. ఆతని మేనమామ అయిన, నీ వాడయిన చంద్రుని కూడా చూపుల అగ్ని ప్రవాహములో పద్మముగా చేసావు. (శివుడు మూడవ నేత్రము తెరిసిన సమయములో ఆ ఎర్రటి జ్వాలలో చంద్రుడు కూడా ఎర్రగా మారాడు. దీనిని శివుడు చంద్రునికి వేసిన శిక్షగా కవి భావన.) దోషములు చేసిన సందర్భాలలో పరాయివారు, నావారు అనే భేదాన్ని పాటించకూడదని ఆ శిక్ష ద్వారా లోకానికి తెలియచేసావు.

**విశేషాలు :**

1. ఈ శ్లోకం ఆర్యా గీతిలో ఉంది. ఆర్యావృత్త పూర్వార్ధలక్షణమే పూర్వార్ధంలోనూ, ఉత్తరార్ధంలోనూ ఉంటే దాన్ని ఆర్యాగీతి అంటారు. దానికి పూర్వార్ధంలోనూ, ఉత్తరార్ధంలోనూ ఒక గురువును కలిపితే అది తెలుగు కందం. ఆర్యా వృత్త లక్షణాలు 25వ శ్లోకవివరణలో పొందుపరచబడినాయి.

2. క్షీర సాగర మథన సమయంలో లక్ష్మితో కలిసి పుట్టినవాడు చంద్రుడు. లక్ష్మి –

రుక్మిణిగా అవతారం ఎత్తినప్పుడు ఆమెకు ప్రద్యుమ్నుని రూపంలో పుట్టినవాడు మన్మథుడు. కనుక తన తల్లికి తోడ బుట్టినవాడు కనుక చంద్రుడు – మన్మథునికి మామ అవుతాడు.

3. దగ్ధ పదము చుట్టూ న్యాయాలున్నాయి.

**దగ్ధపత్రన్యాయము :** ఆకును కాలిస్తే అది మసి అవుతుంది. కాని, తన ఆకారమును మాత్రము విడువదు. (రూపాయినోటును కాలిస్తే, అదికాలినా దాని ఆకారము, అక్షరములు నంబరు ఉన్నట్లే యుండును.) ఒక ఆకును కాలిస్తే దాని ఆకు ఆకారం నశించకపోయినా అది ఆకు కాదని ఎలా తెలుసుకుంటామో అట్లే సంసారం నిస్సారమని తెలుసుకున్నవాడు దానిమీద భ్రాంతి పొందదు.

**4. దగ్ధబీజన్యాయము :** విత్తు కాలిస్తే మొలకెత్తదు. రాగము నశిస్తే సంసారబంధమే లేదు. ఇటువంటి దగ్ధ పదాన్ని శివకృత "మన్మథ" దహన సమయములో వాడిన కవి ప్రతిభకు జోహారు.

5. వహ్ని చుట్టూ అనేక వెలుగులున్నాయి. పొగను జూచి నిప్పున్నదని తెలిసికొనుట వహ్నిధూమన్యాయము.

6. "వహ్నిమాన్ పర్వతః" "ధూమవత్త్వాత్" పొగ వచ్చుచున్నది గావున కొండపై అగ్ని పుట్టినది అని గుర్తించుట. పొగ వచ్చుచున్నదే, వహ్ని యున్నదా ఏమి? అని తొలుత అనుమానము; పిదప, వహ్నిలేనిదే పొగయుండదు కావున తప్పక వహ్నియున్నది అని నిర్ధారణము. కారణముచే ననుమానించి కార్యము నూహించుట. అగ్నినుండి అగ్నికణములు బయలుదేరినట్లు. అగ్నినుండి వెడలిన విస్ఫులింగములు తదగ్న్యంశ ములేకాని అగ్నిభిన్నములు కావు. అట్లే పరమాత్మనుండి రకరకముల సృష్టులు బయలుదేరుచున్నవి. అవన్నియు నాతని కళామాత్రములేగాని తదిన్నేములు గావు. "సోఽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి" ఆ పరమాత్మయే "నేను అనేకరూపములు గలవాఁడ నయ్యెదను" అని కోరి వివిధరూపములుగ తనను విభజించుకొనినట్లు శ్రుతులు నొడువుచున్నవి. కావున తదభేదము సర్వథా సుసిద్ధము. ఇది వహ్నివిస్ఫులింగ న్యాయము.

7. వహ్ని కళలు : అగ్నికి పది కళలు ఉన్నాయి. అవి : 1. ధూమ్రార్చి, 2. ఊష్మ, 3. జ్వలిని, 4. జ్వాలిని, 5. విస్ఫులింగిని, 6. సుశ్రీ, 7. సురూప, 8. కపిల, 9. హవ్య

వాహక, 10. వ్యవహా. పది కళలనూ పదిమంది దేవతలుగా భావన చేశారు. ఇవీ వారి పేర్లు. సర్వజ్ఞ, సర్వశక్తి, సర్వైశ్వర్య ప్రదాయిని, సర్వ జ్ఞానమయి, సర్వవ్యాధి వినాశిని, సర్వాధార స్వరూప, సర్వపాపహర, సర్వానందమయి, సర్వరక్షా స్వరూపిణి, సర్వేప్సిత ఫలప్రద.

8. మనసిజు మామ మామ యభిమాన మడంచినవాని మామ నం
దనుని విరోధి నందనుని నందను సుందరి మేనమామఁ జం
పిన జగజెట్టి పట్టిఁ బొడిజేసిన శూరుని తండ్రిఁ గన్నుగాఁ
గొనిన సురాధినాథుని తనూభవు నాయువు మీకు నయ్యెడున్.

(చాటుపద్య రత్నాకరము)

చివరకు ఆ బ్రహ్మదేవుని ఆయువు మీకు కలగాలని ఈ పద్యంలోని ఆశీస్సు. దీనిలో మొదటగా మనసిజు మామ గా చంద్రుని వర్ణించారు.

9. "కలశపాథోరాశిగర్భవీచిమతల్లి / కడుపార నెవ్వాని కన్నతల్లి / అనలాక్షు ఘనజటా వనవాటి కెవ్వాడు / వన్నెవెట్టు ననార్తవంపు పువ్వు" అను ప్రసిద్ధమైన పెద్దన గారి పద్యములో మిలమిలా మెరిసిపోయే కాంతికి పై హద్దుగా చంద్రుడు వర్ణించబడ్డాడు. "వలరాజు మేనమామ"– చంద్రుడట. మన్మథుని అందమంతా అతని మేన మామయైన చంద్రునిలో ఉందని భావం.

10. "శివుని జడ అనే తోటలో పూసిన పువ్వు చంద్రుడు" అను పెద్దన భావనకు చెఱువు వారి అబ్జ భావన సరిజోడు. అయితే పెద్దన పద్యంలో లేనిది, చెఱువు వారి శ్లోకంలో ఉన్నది అబ్జమనే విశిష్ట పదం. అబ్జ మనే పదము చంద్రునికి, పద్మానికి వర్తిస్తుంది. నీటియందు పుట్టినవాడు చంద్రుడు (అప్సు జాతః అబ్జః). నీళ్లవలన పుట్టునది పద్మము. (అద్భ్యః జాయత ఇతి అబ్జః) అటువంటి అబ్జమనే పదాన్ని చంద్రునితో ఈశ్లోకంలో చెఱువు వారు పోల్చారు. ఉపమేయ ఉపమాన పదాలు వేరు. చంద్రుడు. అబ్జము. కాని రెండింటి అర్థాలు "అబ్జ" అనే ఒకే పదంలో రావటం మాములు విషయం కాదు.

11. ఇంత అద్భుత అబ్జ పద ప్రయోగము ఎనిమిదేళ్ల బాల కవి చేసాడంటే నమ్మలేం. వేద మూర్తులయిన, తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారిదగ్గర విద్యాభ్యాసము చేసిన అదృష్టము చెఱువు వారిచే ఇటువంటి పద ప్రయోగాలు చేయించింది. ఎనిమిదేళ్ల వయస్సులో ఇటువంటి అద్భుత శ్లోకాలు వ్రాయించింది.

12. శివునికి చంద్రుడు పరాయి వాడని ఒక మహాకవి సమర్థించాడు.

శ్లో॥ శిరసా ధార్యమాణోపి – సోమః సోమేన శంభునా ।
తథాపి కృశతాం ధత్తే – కష్టః ఖలు పరాశ్రయః ॥

శివుడు చంద్రునికి చక్కటి ఆశ్రయం ఇచ్చాడు. ఆదరించాడు. కానీ అది పరాయి ఇల్లు. పరాయి ఇల్లు పరాయి ఇల్లే. సొంత ఇల్లు సొంత ఇల్లే. అందుకే పాపం చంద్రుడు చిక్కిపోయి సన్నబడ్డాడు. ఇతరుల ఇంట్లో ఉండడం ఎవరికయినా కష్టమే కదా! శివునికి చంద్రుడు సొంతవాడని చెఋవు మహాకవి ఈ శ్లోకంలో ఒక చక్కటి భావనను అల్లారు. జయన్తి తే సుకృతినో ....



**శ్లో॥ జయతు జయతు దేవోఽర్థాంగజానిర్మహేశో**
**జయతు జయతు దేవీ తస్య వామాప్యవామా ।**
**జయతు జయతు తజ్జాయాపతీడ్యప్రసాదో**
**జయతు జయతు భక్తౌఘశ్శివార్థ్యస్మదాదిః ॥** **50**

**ప్రతిపదార్థము :** అర్థాంగజానిః = సగము శరీరములో భార్య కలిగినవాడు; మహేశః = గొప్పవాడయిన శివ ప్రభువు (మహాన్ చ అసౌ ఈశః చ); దేవః = దేవుడు; జయతు = విజయము పొందు గాక! (జి జయే); జయతు = విజయము పొందుగాక! (జి జయే); తస్య = అతనియొక్క; దేవీ = రాణియైన పార్వతి; వామాప్యవామా = వామా + అపి + అవామా = ఉత్తమ స్త్రీ యైనప్పటికి అనుకూలమైనది, విడువబడనిది; జయతు = ఆమె జయింపబడుగాక!; జయతు = జయింపబడుగాక!; ఈడ్య = పొగడదగిన; ప్రసాదః = అనుగ్రహము కలిగిన; తజ్జాయాపతి = తత్ + జాయాపతీ = ఆ ఆలుమగలు – ఆది దంపతులు; జయతు = జయింపబడుదురుగాక; శివార్థి = శివ + అర్థి = శుభముల కొరకు వేడుకొను; అస్మదాదిః = అస్మత్ + ఆదిః = మావంటి; భక్తౌఘః = భక్తసమూహములు కల ఆ అర్ధనారీశ్వరుడు; జయతు = జయింపబడుగాక!

**విశేషాలు :**

1. ఈ శ్లోకం మాలిని (నాందీముఖీ) ఛందస్సులో ఉంది. అతిశక్వరి ఛందమునకు చెందిన 4672 వ వృత్తము. 15 అక్షరములు. 22 మాత్రలు ప్రతి పాదములో న, న,

మ, య, య గణములు. మాత్రా శ్రేణి: I I I - I I I - U U U - I U U - I U U

**2. అర్ధాంగజాని :** జాయా అంటే భార్య. బహుబ్రీహి సమాసములో ఉత్తర పదమయిన జాయా శబ్దానికి జాని అనునది ఆదేశముగా వస్తుంది. రఘువంశ మహాకావ్యములో **'అనన్య జానేః'** (15 స–61 శ్లో) అని ప్రయోగముంది. "మరొక భార్య లేనట్టి ప్రభువుగా రామునికి బంగారముతో నిర్మించిన సీతయే భార్య" అని అక్కడ అర్థం. జానకీజాని (జానకీ జాయా యస్య సః– జానకి భార్యగా కలిగినవాడు) అని శ్రీరాముని పిలుస్తుంటారు. 'జానకీ! జానికి, రామచంద్రమహిజానికి సాటి విభుండు లేడిలన్' అని మైలవరపు సూర్యనారాయణమూర్తి గారు ఒక శతకాన్నే రచించారు. జానకీ జాని వంటిదే శివునికి సంబంధించిన నగజా జాని. నగజ భార్యగా కలిగినవాడు అని బహుబ్రీహి సమాసము. ఈ పద్ధతిలోనే చెఱువు వారి 'అర్ధాంగజాని' పద ప్రయోగాన్ని సమన్వయించుకోవాలి.

**3. వామా :** మాతా అన్నపూర్ణేశ్వరి అని ప్రసిద్ధమైన మకుటం కలిగిన అన్నపూర్ణా స్తుతిలో శంకరభగవత్పాదులు "వామా స్వాదు పయోధరా" (08శ్లో) అని ప్రయోగించారు.

4. వామ ప్రయోగము కలిగిన "యాంత్యేవం గృహిణీపదం యువతయో వామా కులస్యాధయ:" ( శుశ్రూషస్వ గురూన్ శ్లోకం) అన్న కాళిదాసు వాక్యానికి మురిసిపోయి వసుచరిత్ర కారుడు కూడా "శాశ్వతమతినిట్లుగా మనిన వామయె వామగదా! వసుంధరన్" అని వామ పదాన్ని ద్విరుక్తి చేసాడు. (వసుచరిత్ర– 6 / 56)

సారస్వత చింతామణి మంత్రాన్ని జపించిన శ్రీహర్షుడు నైషధములో "అవామా వామార్ధే....." శ్లోకంలో శివుని అర్ధనారీశ్వర స్వరూపము అవామా (స్త్రీరూపం కానిది), వామా (స్త్రీరూపం కానిది) అని వివరించాడు.

5. వామా శబ్దము మనోహరమైనదానికి, ప్రతికూలమైనదానికి రెండింటికి పేరు. వాయతే వమ్యత ఇతి చ వామః. వా గతి గంధనయోః. టువము ఉద్గిరణే. పొందబడునది మరియూ విడువబడినది వామము. అందుకే చెఱువు వారు విడువబడనిది అను అర్థంలో కూడా అవామా పదాన్ని ప్రయోగించారు.

6. ఇంతకీ శివయ్య వామదేవుడు. వామదేవునికి అమరము చెప్పిన రకరకాల నిర్వచనాలలో వామయా దీవ్యతీతి వా. స్త్రీ చేత ప్రకాశించువాడు అని ఒక నిర్వచనం.

7. దేవః : శ్రీ శివసహస్రనామములో దేవశబ్దము శివనామముగా చెప్పబడింది. (939) దివ్ అనే ధాతువు నుండి 'దేవః' అను శబ్దము ఏర్పడుచున్నది. ఆ ధాతువునకు రకరకాల అర్థాలు. దివు క్రీడా విజిగీషాద్యుతిస్తుతిమోదమదస్వప్నకాంతిగతిషు. 'సృష్టి మొదలగు వ్యాపారములతో క్రీడించువాడు, 'సర్వ భూతములలో ఆత్మతత్త్వమై ప్రకాశించు చుండువాడు', ఇలా రకరకాల అర్థాలు దేవ పదానికి వస్తాయి. దేవః (375) శబ్దము విష్ణుసహస్రనామములో కూడా కనిపిస్తూ శివ కేశవాద్వైతాన్ని నిరూపిస్తుంది.

8. మహేశః : మహేశాత్ నాపరో దేవః మహిమ్నః నా పరో స్తుతిః / అఘోరాత్ నా పరో మంత్రః నాస్తి తత్త్వం గురో పరమ్. ('మహేశ్వరుడిని మించిన దేవుడు లేదు. శివమహిమ్నస్తోత్రాన్ని మించిన స్తుతి లేదు. అఘోరమంత్రాన్నిమించిన మంత్రం లేదు. గురువును మించిన పరతత్త్వం లేదు') అని ప్రసిద్ధి.

9. "జానాతి రామ తవ నామ–రుచిం మహేశః/జానాతి గౌతమసతీ త్వత్–చరణ–ప్రభావం /జానాతి దోర్బల–పరాక్రమం ఈశ–చాపః /జానాత్యమోఘ–పటు–బాణ–గతిం పయోధిః" అను శ్లోకములో మహేశుడు రామ నామ రుచిని తెలుసుకొన్నవానిగా చెప్పబడ్డాడు.

10. మాతా తాతస్సా సమాయా మహేశః (126 శ్లో.) (ఈ సర్వ ప్రపంచానికి ముందు పుట్టిన మాయ తల్లి. ఆ మహేశుడు తండ్రి.) అని మత్స్యప్నః – (నాకల) పుస్తకంలో బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారు మహేశ పదాన్ని గంభీరార్థంలో ప్రయోగించారు.

11. స్వయం మహేశః, శ్వశురో నగేశః, సఖా ధనేశశ్చ, సుతో గణేశః / తథాపి భిక్షాటనమేవ శంభోః, బలీయసీ కేవలమీశ్వరేచ్ఛా! (తాను స్వయంగా మహేశ్వరుడు! మామగారు – పర్వతాధిపతి హిమవంతుడు! స్నేహితుడు – ధనాధిపతి కుబేరుడు! కుమారుడు – గణేశ్వరుడు! అయినా శివునకు భిక్షాటనం తప్పలేదు. ఈశ్వర సంకల్పమే బలీయమైనది!) అని ఒక చాటుకవి మహేశ పదాన్ని చమత్కరించాడు.

12. ముగింపు : ఇంకొక రెండు శ్లోకాల్లో శ్రీ లింగోద్భవ వృత్తమాలికాస్తుతి ముగియనున్నది. అందుకే మంగళాంతముగా జయతు ధాతువును ఎన్నోసార్లు ఈ శ్లోకంలో చెఱువువారు ప్రయోగించారు.



శ్లో॥ **జయతి పితృపితా మే కర్మకృద్బ్రహ్మరూపో**
**జయతి సుకవిశౌండః కోఽపి మాతామహోఽయమ్ ।**
**జయతి చెరువువంశ్యస్సత్యనారాయణోఽసౌ**
**జయతి గురుకటాక్షో యత్ర సాంబప్రసాదః ॥** 51

**ప్రతిపదార్థము :** మే = నా యొక్క; పితృపితా = తండ్రి తండ్రి – తాత (పితుః పితా పితామహః); కర్మకృత్ = కర్మ యందు అకర్మను మరియు అకర్మ యందు కర్మను చూచేవాడు; బ్రహ్మరూపః = బ్రహ్మము (పరమాత్మ, వేదము, తపము.) తన రూపముగా కలవాడు అయిన బ్రహ్మశ్రీ చెఱువు లక్ష్మీనారాయణ చయనులు; జయతి = జయించు చున్నాడు; కోఽపి = కః + అపి = నిర్వచనములకు అందని ఒకానొక మహనీయుడు; సుకవి శౌండః = సుకవులయందు నేర్పరి; మాతామహః + అయమ్ = తల్లి తండ్రి– తాత (మాతుః పితా – మాతామహః) బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు; జయతి = జయించుచున్నాడు; అసౌ = ఈ; చెరువు వంశ్యః = చెఱువు వంశములో పుట్టిన; సత్యనారాయణః = సత్య నారాయణ శాస్త్రి; జయతి = జయించుచున్నాడు; యత్ర = ఎక్కడ; సాంబప్రసాదః = శివుని అనుగ్రహము కలదో (అక్కడ); గురుకటాక్షః = గురుకటాక్షము; జయతి = జయించుచున్నది.

**తాత్పర్యము :** కర్మ యందు అకర్మను మరియు అకర్మ యందు కర్మను చూచేవారు, బ్రహ్మము (పరమాత్మ, వేదము, తపము.) తన రూపముగా కలవారు అయిన నా తండ్రి తండ్రి బ్రహ్మశ్రీ చెఱువు లక్ష్మీనారాయణ చయనులు జీవనసాఫల్యము పొందినవారు. (జయించుచున్నారు) నిర్వచనములకు అందని ఒకానొక మహనీయుడు, సుకవులయందు నేర్పరి నా తల్లి తండ్రి బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి జీవన సాఫల్యము పొందినవారు. (జయించుచున్నారు) ఎక్కడ గురుకటాక్షము కలదో అక్కడ శివుని అనుగ్రహము ప్రకాశిస్తుంటుంది. దీనికి సాక్ష్యంగా ఈ చెఱువు వంశములో పుట్టిన సత్యనారాయణశాస్త్రి నాగురువు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి కటాక్షము పొంది, శివుని అనుగ్రహముతో ఈ లింగోద్భవ వృత్త మాలికా రచన చేసి జీవన సాఫల్యము పొందుతున్నాను.

**విశేషాలు :**

1. ఈ శ్లోకం మాలిని (నాందీముఖీ) ఛందస్సులో ఉంది. దీని లక్షణాలు 51 వ శ్లోకంలో చెప్పబడ్డాయి.

2. కర్మణ్య కర్మయః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥(గీత 04-18)

(కర్మ యందు అకర్మను మరియు అకర్మ యందు కర్మను చూచే వాడు మనుజులలో బుద్ధిమంతుడైనవాడు. అలాంటి వాడు యోగి. అన్ని కర్మలు చేసేవాడు.) కర్మలు రెండు రకాలు. 1.శాస్త్రము విధించిన పుణ్య కర్మలు. 2.శాస్త్ర నిషిద్ధ పాప కర్మలు (వికర్మలు) శాస్త్రము విధించిన కర్మలను ఆసక్తి, ఫలేచ్ఛ, మమకారము, అహంకారము వదిలి చేయుట - కర్మయందు అకర్మను చూచుట. ఇలాచేస్తే కర్మలు వానిని అంటవు. లోక వ్యవహారములో మనోవాక్కాయ వ్యాపారములను విడిచిపెట్టుట అకర్మ. అయితే ఇది అంత తేలికయిన విషయము కాదు. కిం కర్మ కిమకర్మేతి కవయోప్యత్ర మోహితాః (04-16 గీత) ఏది కర్మ, ఏది అకర్మ అనే విషయములో పండితులు కూడా మోహ పడతారు. చెఱువు వారు తన తాతగారు శ్రీ లక్ష్మీనారాయణులను ఇటువంటి కర్మ కృత్తుగా వర్ణించారు.

3. గరుడ చయనం అను ఒక యాగం చేసిన వారిని చయనులు అనిపిలుస్తారు. చెఱువు వారి తాతగారు శ్రీ లక్ష్మీనారాయణులు ఈ చయనం చేసినందువల్ల లక్ష్మీనారాయణుల చయనులయ్యారు. ( వీరివివరాలు నాకు తెలియచేసిన పెద్దలు డా. తూములూరి శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి గారికి ధన్యవాదములు).

4. కోఽపి : సరసిజ విపక్ష చూడః / సగరతనూజన్మ సుకృత మూర్ధాఽసౌ / దృక్కూలంకషకరుణో / దృష్టిపథే మేఽస్తు ధవళిమా కోఽపి ॥ (జడలలో చంద్రుని తురుముకొన్నది. సగరపుత్రుల సుకృతమైన గంగను తలపై ధరించినది - దయగల కన్నులుగలది - అయిన ఇది ఇట్టిది' అని నిర్వచించుటకు వీలుకాని ఒకానొక తెల్లని తేజమొకటి నా కనుల యెదుట సాక్షాత్కరించుగాక!)

శ్రీ సదాశివబ్రహ్మేంద్రులు రచించిన శ్రీ శివమానస పూజా స్తోత్రములోని పై 16వ శ్లోకములో "కోఽపి" (ఇది ఇట్టిది' అని నిర్వచించుటకు వీలుకాని) అనుదానిని ఎంత భక్తి పారవశ్యాలతో ప్రయోగించారో చెఱువు వారు కూడా తన గురువు గారు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారిని పేర్కొనే సందర్భంలో కోఽపి ప్రయోగించారు. రాఘవనారాయణశాస్త్రి గారు సుకవి శ్రేష్ఠులు, చెఱువు వారు తాను

వ్రాసిన ఒక గురు స్తుతిలో " దీవ్యత్ప్రౌఢిమ కావ్య కల్పన కళా ధౌరంధరీ మార్మికులు" గా కవి శ్రేష్ఠులుగా రాఘవనారాయణశాస్త్రి గారిని నుతించారు.



**శ్లో॥ లింగోద్భవే మహాదేవే - నానావృత్తస్తవాంచితా ।**
**సత్యనారాయణేనేయం - కృతినా కృతిరర్పితా ॥** 52

**ప్రతిపదార్థము :** లింగోద్భవే = లింగ + ఉద్భవే = లింగాకారములో (స్తంభాకారంలో) పుట్టిన వానియందు; మహాదేవే = గొప్పవాడయిన దేవునియందు (శివునియందు); నానా వృత్త = అనేక వృత్తముల; స్తవాంచితా = స్తవ + అంచితా = స్తోత్రములతో కూడిన; ఇయం కృతిః = ఈ 52 శ్లోకముల లఘు కావ్యము; సత్యనారాయణేన = సత్యనారాయణశాస్త్రి అను; కృతినా = స్తోత్రరచన అను పని నెరవేరిన అదృష్టవంతునితో; అర్పితా = అర్పింపబడినది, అంకితమీయబడినది.

**తాత్పర్యము :** లింగాకారములో పుట్టిన గొప్పవాడయిన శివునికి (చందవోలులోని లింగోద్భవ స్వామికి) అనేక వృత్తముల స్తోత్రములతో కూడిన ఈ 52 శ్లోకముల లఘు కావ్యము సత్యనారాయణశాస్త్రి అను అదృష్టవంతునితో అంకితమీయబడినది.

**విశేషాలు :**

1. శ్లోకానికి నాలుగు పాదాలుండి, ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలుంటే దానిని అనుష్టుప్ఛందస్సంటారు. ఈ శ్లోకంలో ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాలున్నాయి. అనుష్టుప్ తో మొదలయిన లింగోద్భవ వృత్తమాలికాస్తుతిః అనుష్టుప్ తో ముగిసింది.

మాఘ మాసం కృష్ణపక్షం, చతుర్దశి తిథి రాత్రివేళ లింగోద్భవం జరిగినట్లు స్కాంద తదితర పురాణ గ్రంథాలు చెబుతున్నాయి. అదే రోజు శివరాత్రి పర్వదినంగా పాటిస్తారు. బ్రహ్మ విష్ణువులకు తన గొప్పతనాన్ని తెలియచేయడం కోసం శివుడు జ్యోతిరూపంలో ఒక స్తంభంగా అంతు తెలియనంతగా, మొదలు తుది కనిపించ నంతగా పైకీ, క్రిందికీ వ్యాపించాడు. బ్రహ్మ విష్ణువులు లింగం ఎక్కడ మొదలో ఎక్కడ చివరో తెలుసుకొనలేనప్పుడు శివుడు అగ్నిస్థంబం మధ్యలో వారికి దర్శనం ఇచ్చాడనీ పురాణాలు చెబుతున్నాయి. ఇక్కడ వెలసిన ఆ మహాదేవుని చెఱువు వారు లింగోద్భవ మహాదేవునిగా పేర్కొన్నారు.

2. కృతి : కృతమ్ కర్మ ప్రశస్తమ్ అస్యాస్తీతి – పనిని చక్కగా నెరవేర్చిన వాడు కృతి (హలాయుధ నిఘంటువు). ప్రశస్తం కృతమ్ కృత్యమస్యాస్తీతి కృతీ. మంచి కృత్యము కలవాడు కృతి (అమరము). నఖల్వనిర్జిత్య రఘుం కృతీ భవాన్ (రఘువంశము 03–51) ఓ ఇంద్రా! నువ్వు రఘుమహారాజును జయింపకుండా కృత కృత్యుడివి కాలేవు) అను చోట కృతీ అనగా కృతకృత్యుడు అను అర్థము పెద్దలు చెప్పారు.

3. లింగోద్భవ వృత్తమాలికాస్తుతిః సమాప్తా.

డా. చెఱువు సత్యనారాయణశాస్త్రి గారు రచించిన లింగోద్భవ వృత్తమాలికా స్తుతి అర్థ తాత్పర్య విశేషాలు ఆ శివయ్య కరుణ వలన నేటితో (28–06–2016) పూర్తయినవి.

ప్రమాదవశమున రచనలో దొర్లిన దోషాలను పరమశివుడు మన్నించుగాక.

మంగళమ్ మహత్



# నమస్సుమాంజలి

జన్మను ప్రసాదించిన ప్రత్యక్ష దైవాలు తాడేపల్లి **సుశీల, పార్వతీశ శాస్త్రికి,**

అంతా తానై, నన్ను ఈ చెఱువు రచనా పథంలో నడిపించిన **లింగోద్భవ స్వామికి,**

చెఱువు లోని కమలాల నైగనిగ్యమును పరిశీలించిన నాకు స్వయంసిద్ధ కాళీ పీఠము ద్వారా ప్రచురణ ప్రోత్సాహమిస్తున్న శతాధిక గ్రంథ ముద్రాపయిత
**శ్రీ రావి మోహనరావు గారికి,**

తన ఆశీర్వాద శ్రీ ముఖంతో ఈ పుస్తకానికి అమ్మవారి కుంకుమ పెట్టిన పూర్వాశ్రమంలో తటాక సన్నిహితులు, ఇప్పుడు కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు
**శ్రీ సిద్ధేశ్వరానంద భారతీ స్వామి వారికి,**

దేవీపద మంజీరమై నాకు ఆశీర్నినాదమందిస్తున్న
**బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారికి,**

నా వ్యాఖ్యానాన్ని ఆసాంతం పరిశీలించి ఆత్మీయ రచనా స్పర్శను అందించిన
**డా॥ సూరం శ్రీనివాసులు గారికి,**

"ఏరా.. పతాయ్.. బా.. అంటున్నావా.. బావా అంటున్నావా..
నా శ్లోకాలు వివరించావా !?" అంటూ నిత్యం నా మనో నివాసులై,
మీసాల చాటున గంభీరంగా నవ్వుతున్న
**డా॥ చెఱువు సత్యనారాయణ శాస్త్రి గారికి,**

నన్ను అభిమానించి ప్రోత్సహిస్తున్న
**ఆత్మీయులందరికి**

నాకుతోడు నీడయిన నా శ్రీమతి
**మీనాక్షితో** కలిసి

**ఈ 13 వ పుస్తక ప్రచురణ సందర్భంగా పతంజలి నమస్సుమాంజలి**